" శ్రీమద్రామాయణం చైవ దక్షారామాయణం తథా స్తోత్రపాత్రే
పాపహరే వాల్మీకి వ్యాసయోః కృతే "

( ౧౩ అధ్యాయము. )

భీమఖండము, భీమేశ్వరపురాణము
భీమేశ్వరమాహాత్మ్యము నామాంతరములుగల

# దక్షారామాయణము

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిచే రచింపఁబడి

దక్షారామ ధర్మకర్తలగు
శ్రీరాజా కాకర్లపూడి గోపాలనరసరాజా బహదరువారి
ధనసాహాయ్యముచే

రాజమహేంద్రవరము
సరస్వతీ పవరు ప్రెస్‌నందు ముద్రింపఁబడి
ప్రకటింపఁబడియెను.

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.

1926

 [వెల రు. ౧-౦-౦



శ్రీ దక్షారామభీమేశ ధర్మకర్తలగు

శ్రీరాజా కాకర్లపూడి గోపాలనరసరాజా బహదర్ వారు

రామచంద్రపురము

*

# పీఠిక.

"అస్తి నాస్తి దిష్టం మతిః (౪-౪-౬౦") అనెడి పాణినీయ సూత్రమందలి ప్రథమపదమునకు లక్ష్యంబగు వారలకు నిట్టి మహా గ్రంథ విశేషముల నెత్తి ప్రత్యేకముగా నాదువాక్యావళితోఁ దెలుపుటకంటెఁ బూర్వులు రచించిన పద్యములను గొన్నిటి నిందుఁ జూపెదను.

శ్లో. శ్రీమద్రామాయణం చైవ దశ రామాయణం తథా।
స్తోత్రిపాత్రే పాపహరే వాల్మీకివ్యాసయోరుభే॥

(౧౩ అధ్యా. ౪౫ పత్ర)

కం. శ్రీ రామాయణమును ద
శ రామాయణముఁ గలిమలాపహములు స
త్సారమతులు వాల్మీకికిఁ
బారాశర్యునకు వినుతిపాత్రములయ్యెన్

(౩ అ. ౨౧౭)

దశ రామపురాధీశునకు భీమేశుఁడను బిరుదము వచ్చుటకుఁ గారణము:—

శ్లో. భూమిదిగ్వ్యోమపూర్ణస్య భీమస్య హిమశైలినః
ప్రాసాదభూదసౌ దేవో భీమేశబిరుదాంకితః

(౧౫ అధ్యా ౪౯ పత్ర)

కం. భీమ మగు గళకూటము
భూమియు గగనమును దిశలఁ బొడచూపినచో
భీమగతి మ్రింగెఁ గావున
భీమేశ్వరుఁ డయ్యె నితఁడు బిరుదాంకమునన్

(౪ ఆశ్వా. ౪౬)

సర్వగోమహీవస్త్రాన్నసువర్ణసత్రంబు
లెన్ని వెచ్చించిన నేమిఫలము
సంతతంబును కృచ్ఛ్రచాంద్రాయణాదుల
వరటుచునుంట మెవ్వరికి మెచ్చు
గీ. దూరమునను దలంచిన దురితహరుని
జేరి కొలిచిన సకలార్థసిద్ధికరుని
నంత్యమానస్థమోక్షదీక్షైకగురుని
భీమనాథేశ్వరేశ్వరస్వామిఁ గొలుఁడు

(४ అ. ३-२)

మనుజుని రక్షింపఁ శివభక్తియే కాని కల్పవృక్షాదు లక్కఱలేదనుటకు:-

శ్లో॥ కిం కల్పవృక్షైర్బహుభిః కామధేనుశతైశ్చ కిమ్।
చిత్తం యది స్యాన్మర్త్యస్య శివభక్తిప్రపూరితమ్॥

(-१८ అధ్యా. ५४ పత్ర)

గీ. కల్పవృక్షంబదేటికిఁ గామధేను
సముదయంబేల యిష్టార్థసంపదలకు
నిశ్చయంబుగ మనసులో నిల్చెనేని
చాలదా మర్త్యరక్షింప శంభుభక్తి

(౫ అశ్వా. ౧౪౩)

దక్షవాటమునందే సకలము కలదనుటకు:—

శ్లో॥ శ్రీదక్షవాటీనగరీ స్థానే యన్నాస్తి దైవతమ్
స్థానే నాస్తి తదన్యస్మిన్కుత్రాపి వసుధాతలే
శ్లో॥ శ్రీదక్షవాటీనగరీ స్థానే నామృతమస్తి యత్
స్థానే నాస్తి తదన్యస్మిన్కుత్రాపి వసుధాతలే
శ్లో॥ శ్రీదక్షవాటీనగరీ స్థానే యన్నాస్తి శాసనమ్
శ్రీదక్షవాటీనగరీ సర్వక్షేత్రనివాసభూః
శ్లో॥ శ్రీదక్షవాటీ నగరీ సమస్తవిబుధాశ్రియా

శ్రీదక్షవాటీనగరీ శివస్యాంతఃపురం మహత్

(౩౨ అధ్యా ౧౦ వ పత్ర)

సీ. దక్షవాటీమహాస్థానంబులోలేని
యమరులే స్థానంబునందు లేరు
దక్షవాటీమహాస్థానంబులో లేని
యర్థమేస్థానంబునందు లేదు
దక్షవాటీమహాస్థానంబులో లేని
యమృతమేస్థానంబునందు లేదు
దక్షవాటీమహాస్థానంబులో లేని
యజ్ఞమేస్థానంబునందు లేదు

తే. దక్షవాటిక సకలతీర్థముల కిరవు
దక్షవాటిక సకలవిద్యలకు గరిడి
దక్షవాటిక విభవంబు తానకంబు
దక్షవాటిక శివునియంతఃపురంబు.

(౬ ఆశ్వా. ౧౦౫)

పుడమిపై దక్షారామమునకు సమమగు తీర్థము లేదనుటకు:—

శ్లో. వచసా కిం సహస్రేణ సర్వజ్ఞస్య వచో మమ
ఇదం సత్యమిదం సత్యమిదం సత్యం శరీరిణామ్.

శ్లో. జయఘంటానాదపూర్వం మయోచ్చైస్సుటముచ్యతే
దాక్షారామసమం తీర్థం నాస్త్యేవ భువనత్రయే.

(౩౦ అధ్యా. ౯౯ పత్ర)

క. మాటలు వేయునేటికిఁ
జాటించెన్ శివుఁడు వేడ్క జగములలో మ
న్నీటిదరి దక్షవాటికి
సాటిగఁ దీర్థములు లేవు సత్యమునుండీ.

(౬ ఆశ్వా. ౫౩)

శ్లో. భీమేశధామభూకాంతా భూషాం దక్షిణకాశికామ్
దాక్షారామపురం స్తోతుం నశక్తః పద్మభూరపి.
(౧ అధ్యా. ౨౩)

క. దక్షిణకాశీనగరము
దక్షారామంబు భీమధామము ధన్య
త్వక్షితిక్షోణీమండల
రక్షామణి దానిఁ బొగడ బ్రహ్మకువశమే.
(3 అ. 30)

భీమేశునికంటెఁ బెద్దవేల్పు లేఁడనుటకు :—
శ్లో. భీమేశాదుత్తమం దైవం దక్షారామాత్పరం పదమ్
సప్తగోదావరాచ్ఛ్రేష్ఠం తీర్థం చ న మహీతలే.
గీ. భీమనాథునికన్నను బెద్దవేల్పు
దక్షవాటంబుకంటె నుత్తమపదంబు
సప్తగోదావరముకంటె సకలతీర్థ
సారమగు తీర్థరాజంబు జగతి లేదు.
(౨ అ. ౧౫)

దక్షిణకాశి యనఁ దక్షారామమేకాని కాళహస్తిశ్రీశైలాది క్షేత్రములు కావు.

ఇందులకు నిదర్శనముగా :—
శ్లో. "భీమేశధామభూకాంతా భూషాం దక్షిణకాశికామ్
దక్షారామపురం స్తోతుం న శక్తః పద్మభూరపి"
(భీమ. ౧ అధ్యా. ౨౩)

క. దక్షిణకాశీనగరము
దక్షారామంబు భీమధామము ధన్య
త్వక్షితిక్షోణీమండల
రక్షామణి దానిఁ బొగడఁ బ్రహ్మకువశమే"
(3 అ. 30)

అనెడి భీమఖండపద్యముల నటుంచినను గాశీఖండమందలి మూఁడవ యాశ్వాసమునందుఁ గానిపించెడి గద్యపద్యములే దక్షిణ కాశీ యన దక్షారామమే యని మామాటకి నొక్కి చెప్పుచున్నవి.

"ఇట్లు ధర్మంబునం భువనోపద్రవంబుఁ బ్రశాంతిఁ బొందించి దక్షిణ కాశీసందర్శనంబుం గాని కాశీవియోగ వేదనాభారంబు డిందుపడదని డెందంబున నిశ్చయించి........ఆంధ్ర దేశంబున కరుగునప్పుడు.

(కాశీఖండము 3. ఆ.)

"క. దక్షిణవారాణసి యగు
దక్షారామంబు సొచ్చి తరుణేందుధరున్
వీక్షించిన గోలెను గా
శీక్షేత్రాలోకసుఖము చేకుఱె బుషికిన్."

(కాశీఖండము 3 ఆ. ౨౫)

"క. క్లేశంబును సౌఖ్యంబును
నాశివునను గుంభజన్ముఁ డభిమర్శించెన్
గాశీవిరహము దక్షిణ
కాశీసంగమము వరుసఁ గలిగిన 'కతనన్"

(కాశీఖండము. 3 ఆ. ౨౬.)

కొన్ని పామరజనవాక్యములు.

భీమలింగ మాసమునంటఁ బెరుగునపుడు బంగారుచీల కొట్టిరనెడి వాక్యము పామరజనవాక్యమే కాని భీమఖండమునందుఁ గాన్పింపదు. ముప్పదియొకండవ యధ్యాయమునందుఁ గాన్పించెడి క్రిందివిషయమును బట్టి యట్లుగల్పించిరనుకొనవచ్చును. "భీమేశ్వర స్వామి మహాప్రభావముతో బ్రహ్మాండకర్పముదాఁకఁ బెరిగినపుడు బ్రహ్మాదిదేవతలు భయపడి "స్వామీ నీవు పొట్టివాఁడవైనఁ గాని నిన్నుఁ బూజింపనేరము"నఁగాఁ దనరూపమును హ్రస్వము గావించి నాఁడని మాత్రము కలదు"

ఈభీమలింగము మొదట క్షీరసాగరమున జనింపఁ ద్రిపురాసురులకుఁ గులదైవతముగనుండినట్లును, త్రిపురాసురసంహారమునకుఁ బిమ్మటఁ బంచఖండములుగా నొనర్పఁబడి దక్షారామాదిపంచారామములందుఁ బ్రతిష్ఠింపఁబడినట్లును నీక్రిందిప్రమాణములవలనఁ దెలియవచ్చుచున్నది; కాని తారకుని మెడలోనిలింగమని యెందును గానరాదు:—

శ్లో. అమృతాంభోధిసంభూతం సముద్భూతే మహీతలే
మహోద్భూతం జగద్వంద్యం భోగమోక్షప్రదాయకమ్.
(౨౩ అధ్యా. ౭౮ పుట)

శ్లో. క్షీరాంభోరాశిసంజాతం మహాలింగం సుధామయమ్
త్వామాశ్రయే మహాదేవ దక్షవాటాధినాయక.
(౧౯ అధ్యా. ౫౭ పుట)

శ్లో. సుధాపాథోనిధిర్మధ్యే స్వయం ప్రాప్తవత్యోదయం
ప్రతిష్ఠితేన సూర్యేణ సప్తభిశ్చ మహాత్మభిః.
(౨౯ అధ్యా. ౯౪ పుట)

శ్లో. తతస్త్రిపురదైత్యేయ గణానాం కులదైవతమ్।
తద్దివ్యలింగం పరమం నిర్మలం నిరుపద్రవమ్.

శ్లో. పంచాక్షరీసంచరత్త్వం పంచబ్రహ్మమయం ప్రభుమ్
పంచఖండాని కృత్వాథ పంచస్వారామభూమిషు.
(౧౯ అధ్యా. ౬౨ పుట)

కొన్ని పరిశోధనములవలనఁ దేలెడి విషయములు

దక్షారామమని వ్యవహరింపఁబడు నగర మొకప్పుడు దక్షవాటికయనియు, దాక్షారామమనియు దాక్షేమియనియుఁ బిలువఁబడి విశేషప్రఖ్యాతి గాంచియుండెను. మొదట నీపురమునకు దాక్షేమి యను పేరుండుటను బట్టి దక్షప్రజాపతి యాగముచేయుటయు, దాక్షాయణి యగ్నిప్రవేశముగుటయు నీనగరికి ముడివెట్టఁబడియుండును. అప్పటినుండియుఁ దెలుఁగునను దాక్షేమి యనెడి నామము సంస్కరింపఁ

బడిన గీర్వాణభాషయందు దక్షవాటిక యనియు దక్షారామమనియు మారియుండును. ఆనగరమునకు మొదటినుండియు దక్షునినామధేయముతో సంబంధమున్నట్లుగాన్పింపదు. అదియట్లుండనిండు! మ. మానవల్లి రామకృష్ణకవిగారికి లభించిన 'లీలావతి' అనెడి ప్రాకృత కావ్యమును బట్టి యీపట్టనము మొదట (క్రీ. పూ. ౨౦౦) శైవమతభేదమైన పాశుపతారాధనమునకు ముఖ్యక్షేత్రముగానుండెననియు, నిచ్చట నగ్న పాశుపతమూర్తి భీముఁడను పేర వెలసియున్నాఁడనియు, నిందునూరమి రెండువేలసంవత్సరములక్రిందట హాలశాతవాహనుఁడు శృంగళద్వీప రాజకన్యక యగు లీలావతి యను నామెను బెండ్లియాడెననియుఁ దెలియుచున్నది. ఆగ్రంథమునందు దక్షారామమునకును దక్షునియజ్ఞమునకును సంబంధమగాన్పింపదు. దక్షవాటిక కొంతకాలము బౌద్ధక్షేత్రముగాఁ గూడ నుండినట్లు గాన్పించుచున్నది. అట్లు బౌద్ధక్షేత్రముగానుండినపుడు గూడ భీమేశ్వరుఁడు పాశుపతమూర్తిగాఁ బూజింపఁబడెను. శైవాగమములు విశేషముగాఁ బ్రచారములోనికివచ్చినపు డీక్షేత్రమున కాధిక్యమెక్కుడయ్యెను. అప్పుడే దక్షవాటిక దక్షుని కథతో ముడిపెట్టఁబడియుండును. ఇయ్యది క్రీ. ౪ వ శతాబ్దియందో ౫ వ శతాబ్దియందో జరిగియుండును. ఆ నగరము పిమ్మటఁ బల్లవుల కాలమునాఁడును, శాలంకాయనవిష్ణుకుండినుల కాలమునందును, దరువాతి శతాబ్దులలోఁ బూర్వచాళుక్యులయొక్కయు, వెలనాటిచోడుల యొక్కయుఁ, గాకతీయులయొక్కయు, రెడ్లయొక్కయుఁ బరిపాలనమందును విశేష ప్రఖ్యాతిగలనగరముగానుండుటయే కాక దక్షిణ కాశియని ప్రఖ్యాతి నడసెను. ఆ కాలముననే సంస్కృతస్కాంద పురాణమందలి యీభీమఖండము రచింపఁబడియుండును. ఆ భీమేశ్వర మాహాత్మ్యమును రచించినవాఁడు భీమమండలవాసియే కావచ్చును. ఆస్థభీమపురాణరచనకాలమును బూర్వచాళుక్యరాజుల పరిపాలనారంభ

కాలమును నొకటియై యుండవచ్చును. దక్షవాటిక పంచారామ క్షేత్రములలో నొకటియని పురాణప్రసిద్ధమైయున్నది. ఈనగరవైభవమును దెలుపుటకా దేవాలయమునందున్న శిలాశాసనములే చాలియున్నవి.

పైనచెప్పఁబడినట్లు సర్వవిధముల నధికమగు క్షేత్రమాహాత్మ్యమును నాక్షేత్రేశునకు ధర్మకర్తలగు శ్రీరాజా కాకర్లపూడి రాజగోపాలనరసరాజాబహదరువారు తమ యాత్మబాంధవులగు శ్రీరాజా కాకర్లపూడి వెంకటసీతారామచంద్రరాజుగారు లోనగు వారలతోడను ధీసచివులగు పట్టిసపు సూర్యనారాయణగారు లోనగు వారలతోడనుగూడి యీగ్రంథమును విని ముద్రింప నాకనుజ్ఞయొసఁగిరి.

ప్రమాదవశమున "శ్రీరాజా కాకర్లపూడి రాజగోపాలనరసరాజ బహదరువార"నుటకు బదులుగా "శ్రీరాజా కాకర్లపూడి గోపాలనరసరాజాబహదరువారు" అని ముద్రింపఁబడినది.

మఱియుఁ జిన్నతనమున బ్రహ్మశ్రీ భాగవతి లక్ష్మీనృసింహసోమయాజులుగారిచెంతఁ జదువుకొనుచుండినపుడు నన్నుఁ గన్నతల్లిదండ్రులకంటె నధికముగాఁజూచిన బ్ర. మద్దినాల వెంకటరత్నముగారిని అన్నపూర్ణనుబోలిన వారి ధర్మపత్నియగు సుబ్బాంబగారిని మదిఁ దలంచుచున్నాఁడను.

మంగళాను శాసనము.

సీ. అనసూయకుఁ బ్రియా సనసూయయియ్యవనా
ఎత్తిగన్న జానకీసతి భజింపఁ
గుశలవత్వము గన్నకొమరులు రామచం
ద్రుఁడు సూర్యనారాయణుండుఁ గొలువ
వరరంగనాయకాంశాభర్త వేంకట
కృష్ణరాజనృపేంద్రు కీర్తిఁబెనుప

ధీగాగ్రవర్తి సీతారామచంద్రరా
జాత్మ బాంధవుండై సహాయపడంగ
తే. నలరిపల్లసూర్యనారాయణుండు
నీసచివుండౌచు నీదండందిరుగుచుండ
నాయురారోగ్యభాగ్యంబులందుమయ్య!
రాజగోపాల నరసింహరాజవర్య!

కాటకూటేశ్వరము 7—6—26

ఇట్లు,
భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి.

---

# కథా సారము

ఒకప్పుడు వ్యాసుండు మున్నూఱుగురు శిష్యులను వెంట నిడి కొని పుడమిపైఁగల పుణ్యతీర్థములెల్లను దిరిగితిరిగి కాశియే మోక్ష స్థానమనుకొని యందు వసింపఁబోయెను. అప్పుడు విశ్వేశ్వరుండా వ్యాసుని మనస్సు పరీక్షింపదలంచి మున్నూఱుగురు శిష్యులతోడ నున్న యా బాదరాయణున కేడుదినములన్నము లేకుండఁజేసెను. అత్తఱి నాకారాసింధ్రుండు కాశికాపురమునందున్న యేవిప్రునింటికిఁ బోయినను "లేదు! లేదు! వనువుండు! పొండు!" అనెడి నుడువులే వినవచ్చుటచే కోపించి "కాశికాపురమునందుండు వారలకు మూండుతరములదనుకను విద్యయు ధనమును భక్తియు నుండకుండుఁగాక!" అని శపింపఁజూచునప్పుడు కాశికానగరసోమవీథిలో నొక యింటనున్న యేఁబదియేండ్లప్రాయము గల యొక ముత్తైదువ యాతనిని బిలిచి యిట్లనియెను:— "ఓమాసింధ్రా! శాంతింపుము! శాంతింపుము! విశ్వేశ్వరుండు నీమనశ్శుద్ధిఁదెట్టిదోయని పరీక్షింపనెం

చెను; కాని కాశికాపురమున నన్నము దొరకకుండునా! మధ్యాహ్న సమయమునం దన్నపూర్ణాదేవి బంగారు తెడ్డుతో నమృతపాయస మతిథులకుఁ బెట్టుచుండునన మాట నీవు వినలేదు కాఁబోలును! ఈ మాటలన్నియు నేల? పాపమేఁడునాళ్ళనుండి శుష్కోపవాసమొనర్చు చున్నారు. నేఁడు మీకందఱకు భోజనము పెట్టెదను! రండు!" అని నంతనే వారెల్లరును నామెయింట భుజించి చేతులు కడుగుకొని యొక యరుగుపైఁ గూర్చుండియుండఁగా విశ్వేశుఁడు విశాలాక్షీసహితుఁడై వచ్చి కోపముతో నిట్లనియెను:—"ఓదురాత్మ! కారణములేకయే కాశికాపురమును శపింప వచ్చితివా? ఇప్పుడే యిందుండి కదలి వేఱొకస్థలమునకుఁ బొమ్ము!" అని కోపించి కొన్ని కాఱులు పల్కఁగా నా వ్యాసుఁడు చింతాక్రాంతుఁడయ్యెను. అప్పు డన్నపూర్ణాదేవి యిట్లనియెను:—వత్సా! విచారింపకుము! పుణ్యతీర్థములలో నీకాశి కాపురమె గొప్పదనకొనుచున్నావాఁడవు. ఇంతకన్న మిన్నయగు దక్షారామమున్నది. అందు దక్షుఁడు యజ్ఞమొనర్చెను. అది భోగ మోక్షములకుఁ బుట్టినిల్లు. కాన నీవచ్చటకును బోవలయు! అచ్చటికే పోయి యందే వసింపుము." అని చెప్పఁగాఁ గాశికాపురమునందుండి కదలి ప్రయాగక్షేత్రమునకువచ్చి యందున్న మాధవుని దర్శించి యట నుండి పయనమై క్రమక్రమముగా జగన్నాథమందలి జగన్నాథస్వామిని, శ్రీకూర్మమందలి కూర్మనాయకస్వామిని, సింహాచలమందలి లక్ష్మీ నృసింహస్వామిని, పీఠికాపురమందలి కుక్కుటేశ్వరుని, సర్పవరమందలి భావనారాయణస్వామిని, దుత్యభాగాతీరమందలి యగస్త్యేశసంగమేశు లను, సాంపరాయమ్రగామ (సంపర) సమీపముననున్న ముక్తీశ్వరుని భజించి దక్షారామమునకుఁ బోనున్నప్రాకు భీమేశ్వరుని సేవించి దక్షారామమునుండి పీఠికాపురమునకుఁ గుక్కుటేశ్వరుని సేవింప లోపాముద్రను వెంటనిడుకొని పోవుచుండినయగస్త్యునిఁ

గాంచి యెదురేగి తోడితెచ్చి యా మహేశాలయము ముంగల నున్నయొక చంద్రకాంతశిలపైఁ గూర్చుండఁబెట్టెను. అంత నిష్టాలాపములతోఁ గొంతప్రొద్దుపుచ్చిన పిదప నగస్త్యుఁడు వ్యాసునిఁ జూచి యిట్లనియెను:—"వ్యాసా! నీమోమును గాంచినంతనే మహావిచారమేదియో నీమనస్సునం దున్నట్లు గాన్పించుచున్నది. కాశికాపురము నుండివచ్చుచున్నాఁడనని చెప్పుచున్నవాఁడవు; అందు విశ్వేశాదులతో నీవేమియు వైరపడి వచ్చుచుండుట లేదు కదా?" అని యనినంతనే వ్యాసుఁడు కాశికాపురమున జరిగినదంతయుఁ బూసగ్రుచ్చినట్లు విన్నవించి యిట్లనియెను:—

"అగస్త్య! దక్షపురీశ్వరుఁడు భీమనాయకుఁడు నాకు నిక్కి నాదుఃఖమును దీర్చునా? సప్తగోదావరమున వేసఁగిని సమృద్ధముగా జలముండునా? భీమేశ్వరునిఁ బూజింపఁ బుష్పములు దళములు దొరకుచుండునా? మధ్యాహ్నవేళయందు విప్రకాంతలాఁకలిదీఱ భిక్షయిడుదురా? మహాత్మా! ఆ భీమేశ్వరమాహాత్మ్యమును నాకుఁ జెప్పవలయును" అని యనఁగా నగస్త్యుఁడు దక్షయాగాదివిషయములను వివరించి చెప్పి యిట్లనియెను:—"ఓవ్యాస! నేఁడు మన మందఱమును గూడి దక్షవాటమునకే పోదము! నిన్ను విడిచి పోవ నాకు బుద్ధిపుట్టకున్నది" అని యగస్త్యుఁ డనఁగా వా రందఱును సొంపగాయమహాగ్రామమునకుఁ బోవుదారిని బట్టి వచ్చుచుఁ జూతాటవిని దాఁటి సోమేశుని భజించిరి; ఓంకారనగరము (ఓదూరు) నందున్న బ్రహ్మను విష్ణుని, శంకరుని నుతించిరి; శిలాగ్రామము (శివల) నందున్న శంకరునకు మ్రొక్కిరి. అంత వ్యాసుఁడు దక్షారామమును బ్రవేశించుటకుఁ దగిన కాలమభిజిత్తని నిర్ణయించినపిదప నగస్త్యుఁ డిట్లనియెను:—వ్యాసా! సూర్యుఁ డాకాశమధ్యమమునకు వచ్చెడి వేళయగు నభిజిత్కాలము వఱకు నిచ్చటనే యుండనేల? ప్రొద్దుపొడిచి యిప్పటికి రెండేగడి

యమైనది; దక్షారామమూ మిగుల దాపుననున్నది. మనమిాలోపున నాకసమునకెగసి భీమమండలమునంతయును గాంచవచ్చును!" అన వ్యాసుఁ డందులకు సమ్మతించెను. అంతలోపాముద్రయు, నగస్త్యుఁడును, వ్యాసుఁడును యోగవిద్యాబలముచే నాకసమున కెగసిరి. అంత నగస్త్యుఁడు వ్యాసునితో నిట్లనియెను:—« ఈభీమమండలియందుగౌతమిాసింధుశాంతేయ కణ్వానదులు మనోహరజలపూరితములయి ప్రవహించుచుండును. అదే! బ్రహ్మాసంవేద్యము; అందు బ్రహ్మాసంవేద్యస్వామి కాశిలోమృతినొందినఁగాని పడయరాని కైవల్యసుఖమిచ్చును. అదే! కోటిపల్లి; అందు సోమేశుఁడున్నాఁడు. అదే! భోగమోక్షసాధనమగు దక్షారామము. అదియే! ఆకసము నంటుచుండిన భీమేశ్వర ప్రాసాదము. అదియే! సప్తమునులును దెచ్చిన సప్తగోదావరము. అదే! పట్టిసమహాస్థానము; అందు వీరభద్రేశ్వరుఁడు వెలసియున్నవాఁడు. అదే! పద్మపర్వతము (రాజమహేంద్రవరము); అందు మార్కండేయేశ్వరుఁడున్నాఁడు. అదే! కుమారారామము; అందుఁ గుమారభీమేశ్వరుఁడున్నాఁడు. అదియే! కుక్కుటేశ్వరాదు లుండిన పీఠాపురము. అదేఁడే! మాకులదైవత మగు పల్వలపురీశుఁడు. అదియే! సంగమేశ్వరస్వామియుండెడి కుండలాముఖక్షేత్రము" అని హస్తముతోఁ జూపిచెప్పి సూర్యునివంకఁ జూచి యిట్లనియెను:—ఓవ్యాసా! మనము దక్షవాటికకుఁ బోవ నభిజిత్కాల మాసన్నమగుచున్నది. ఇఁక నిందు మసలఁజనద"ని వారు మువ్వురును శిష్యులుండిన త్రికూటోదరమునకుఁ దిగి దక్షారామమునకుఁ బోయిరి. సప్తగోదావరమున స్నానమొనర్చిరి. అంత వ్యాసుఁ డగస్త్యునితో నిట్లనియెను:—"ఓయగస్త్యా! ఇందున్న పంచతీర్థములకంటెను ముందుగా ద్వాదశ (౧౨) క్షేత్రములందుండు శివలింగములను సేవింపవలయును గాన వానిని గూర్చి చెప్పినపిదపఁ బంచతీర్థములసంగతిఁ జెప్పుము"

అనినంతనే వ్యాసుఁడిట్లనియెను:—ఓవ్యాసా! నేనీ కథయెల్ల మున్ను కుమారునివలన వింటిని. అట్లే నీకును జెప్పుచున్నాఁడను. అందింద్రేశతీర్థము మొదటిది. పూర్వము దేవేంద్రుఁడంతఁ దనపేర నొకలింగమును బ్రతిష్ఠించెను. ఆపాకశాసనేశ్వరుని సేవించువారల కైంద్రపదమబ్బును. సిద్ధలింగముండిన సిద్ధేశ్వరస్థానము రెండవది. అందు సిద్ధులాసిద్ధలింగమును బ్రతిష్ఠించిరి. అది దక్షప్రజాపతియాగదేశమునకుఁ దూర్పుప్రక్కనున్నది. అందు సల్పెడి యజ్ఞదానాదులొక్కొకటి కోటిగుణితమగును. యోగీశ్వరుఁడుండిన యోగీశ్వరస్థానము మూఁడవది. అందు సనకాదియోగు లాయోగీశ్వరలింగమును బ్రతిష్ఠించిరి. అది యణిమాదిసిద్ధులను గలిగించును. మంకణుఁ డాయోగీశ్వరేశ్వరునిఁ బూజించి బ్రహ్మజ్ఞానమును బడసెను. మర్త్యుఁ డొకమాఱు సప్తగోదావరమున మునిఁగి యాదేవుని సేవించిన నమర్త్యపదవి సంభవించును. యమేశ్వరుఁడుండిన యమేశ్వరస్థానము నాల్గవది. అందు యమునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన యమేశ్వర లింగము గలదు. మానవుఁడొకమాఱాయమేశుని భజించిన మహాభయము లేకుండును. యజ్ఞతటాకమున మునిఁగి యాయమలింగసన్నిధిని నూటెనిమిదిమాఱులు మృత్యుంజయజప మొనర్చినవారలకు నపమృత్యుభయము లేకుండును. ఆ యమేశతీర్థమున శ్రాద్ధపిండోదకాదులిచ్చిన నరుఁడు పితరులను నరకకూపములనుండి లేవనెత్తును. కాళేశ్వరస్థాన మైదవది. అందున్న మహాకాలుఁ డగు కాళేశ్వరుఁడు కోరిన కోరికలెల్ల నిచ్చును. ఆదేవుని చెంతఁ జేయు దానహోమాదు లొక్కొక్కటి కోటిఫలమునిచ్చును. వీరభద్రస్థానమాఱవది. అందు శ్రీవీరభద్రాదిదేవవీరులు ప్రతిష్ఠించిన శ్రీవీరభద్రలింగమును సేవించిన భుక్తిముక్తులు కలుగును. ఆదేవుని చెంతఁ జేయు నగ్నిహోత్రాదిక్రియలు బహుఫలము నిచ్చును. శ్రేయమును గోరువారు యజ్ఞతటాకతీర్థమునందును, బడమరనున్న పద్మిని

యందును మునింగి యావీరభద్రేశుని సేవింపనలయును. బ్రహ్మేశ్వర స్థాన మేడవది. అందు బ్రహ్మచేఁ బ్రతిష్ఠింపఁబడిన బ్రహ్మేశలింగ మును సేవించువారలు బ్రహ్మనిష్ఠీవ్రశధామములందు సుఖింతురు. బ్రహ్మలింగసన్నిధిని దపోధ్యయనాదులచే సాధింపఁబడని కార్య మొక్కటియు నుండదు. కపాలేశ్వరస్థాన మెనిమిదవది. పూర్వము కాలభైరవునిచేతిలోనున్న బ్రహ్మకపాలపాత్రము జారి సప్తగోదావర జలములందుఁ బడెను. అంత నాస్థానమునందుఁ గపాలేశ్వరుఁ డుద్భ వించెను. ఆ దేవుని సేవించినవారల పాతకములెల్ల నశించును. ఆ మహేశ్వరుని చెంతఁ జేసిన దానహోమజపాదులు కోటిఫలమునిచ్చును. * వరుణేశస్థాన మొకటి కలదు. అందు వరుణునిచేఁ బ్రతిష్ఠింపఁ బడిన వరుణేశ్వరుఁడు గలఁడు. వానలు లేనపుడా దేవునకు సహస్ర ఘటాభిషేక మొనర్చిన వానలు మెండుగఁ గురియును. కుక్కుటేశ్వర స్థానము తొమ్మిదవది. పూర్వము కుక్కుటము (కోళ్ళు) లా దేవునకుఁ బ్రదక్షిణ మొనర్చి మోక్షమందినవి. ఆ కుక్కుటేశ్వరస్థానము కాశీ

---

* పదవ యధ్యాయమునందు ద్వాదశ (౧౨) క్షేత్రములను జెప్పునపు డీవరుణేశస్థానమును జెప్పియుండలేదు. మరలఁ బదునొకండవ యధ్యాయమునందుఁ దీర్థక్రమమును విశదముగాఁ జెప్పునపుడు వరుణేశస్థానమును జెప్పఁబడియున్నది. ద్వాదశక్షేత్రములని యన్నాము గదా దీనిని గూడఁజేర్చినఁ బదమూఁడగునని వదలి యుందురేమో తెలియకున్నది. అట్లయినఁ బదునొకండవ యధ్యాయమునఁ జెప్పనేల? ఇంకను గొన్ని తీర్థవిశేషములను దెలియఁగోరువారలు ముప్పదిరెండవ యధ్యాయ మును జూడవలయును. మఱియుఁ బదవ యధ్యాయమునందు గాళేశతీర్థము నాల్గవది గను, బదునొకండవ యధ్యాయమున నైదవదిగను జెప్పఁబడియున్నది.

శ్లో. ఇంద్రేశతీర్థం విఖ్యాతమృషిసంఘనిషేవితమ్
సిద్ధేశ్వరం మహాతీర్థం సర్వసిద్ధికరం నృణామ్.

శ్లో. యోగీశతీర్థం పరమం యోగలక్ష్మీప్రదాయకమ్
కాళేశతీర్థం భక్తానాం మనోభీష్టఫలప్రదమ్.

కేదారగోకర్ణకుంభఘోణములకు సాటియైనది. అందొనర్చెడి హోమ దేవార్చనాదులు కోటిగుణితములు. సోమేశ్వరస్థానము పదవది; అందు సోమునిచే నాసోమలింగము నిలుపఁబడినది. ఆ సోమతీర్థమున మునిఁగి సోమేశుని భజించువారలు కైలాసమున కరుగుదురు. మాహేశ్వర యోగస్థానముపదునొకండవది. అందు సిద్ధాదులామహాలింగమునునిల్పిరి. ఆ దేవుని సన్నిధియందొనర్చునది యెల్ల బహుఫలమునిచ్చును. గయ యందు వలె మాహేశ్వరతీర్థమునందు మానవులు శ్రాద్ధపిండప్రదానాదులచేఁ బితరులకుఁ దృప్తి కావింతురు. రామేశ్వరతీర్థము పండ్రెండవది. ఆరామేశ్వరుని చెంత నున్న రుద్రపాదగయయందుఁ బితృయజ్ఞమొనర్చినవారలకు మహాఫలము కలుగును. ఓవ్యాసా! పండ్రెండు తీర్థములే యని పలుకనేల? నర్మదాతటమునఁ దీర్థముగాని ప్రదేశమే లేదని చెప్పి పంచతీర్థములను గూర్చి యిట్లు చెప్పఁదొడఁగెను:— వ్యాసా! పంచతీర్థములను గూర్చి చెప్పుచున్నాఁడను సావధానముగా

---

శ్లో. యమేశతీర్థం విపులం శాంతిదాంతిప్రదాయకమ్
వీరభద్రేశ్వరం తీర్థం విశ్వస్తుత్యం సుపావనమ్.

శ్లో. బ్రహ్మేశతీర్థం పరమం బ్రహ్మర్షిగణసంకులమ్
కపాలేశ్వరతీర్థం త్వణిమాద్యష్టభూతిదమ్.

శ్లో. కుక్కుటేశ్వరతీర్థం తత్కాశికాసగరోపమమ్
సోమనాథేశ్వరం తీర్థమపవర్గఫలప్రదమ్.

శ్లో. శ్రీమాహేశ్వరతీర్థం తత్సదానుగ్రహకారణమ్
రామేశ్వరం శివం తీర్థం త్రిషు లోకేషు విశ్రుతమ్.

(౧౦ అధ్యా. ౨౯ పత్ర)

శ్లో. తతో జగన్నుతం స్థానం వరుణేశ్వరనామకమ్
వరుణేశమహాలింగం వరుణేన ప్రతిష్ఠితమ్,

(౧౧ అధ్యా. ౩౫ పత్ర)

వినుము ! సతీసతి తన తండ్రి యగు దక్షుఁడు కావించిన యవమాన మును సహింపలేక యజ్ఞముచేయు స్థలమున యోగాగ్నిచేఁ బ్రాణ మును ద్యజించినది. అది మొదలా స్థానము సతీయోగాగ్నిత్రయతీర్థ మనఁబడుచున్నది. అచ్చటఁ గావించెడి యజ్ఞాద్యులు సాధకుల కనంతఫలమునిచ్చును. అఖిలేష్టసంసిద్ధినామక మగు తీర్థము రెండవది. అందు నరులకు సకలాభీష్టములు సిద్ధించును. అచ్చట నే పార్వతి దీర్ఘతపము గావించి శంకరునకర్ధాంగి యయ్యెను. ఆ తీర్థమున మునిఁగి యందలి మహేశుని భజించువారలు కోరెడి యర్థము దుర్లభమయిన దయ్యును బడయుదురు. అందొనర్చెడి హవ్యకవ్యాదిరూపక మగు కర్మము మేరుతుల్యమగును. సోమేశ్వరతీర్థము మూఁడవది. అచ్చట సోముఁడు (చంద్రుఁడు) మహాదేవు నారాధించి వరమందెను. ఆసోమ తీర్థమునమునిఁగి యాదేవునకు మ్రొక్కి న సకలపాపములడఁగును. భక్తి యుతుల కాశంకరుఁడు కల్పవృక్షమే! హైమవతతీర్థము నాల్గవది. "మహాదేవుఁడు తనకల్లుఁడు కావలయునని యెంచి హిమవాలుగేండ్లు తపము గావించెను. అంత మహేశుఁడందుద్భవించెను. ఆహిమాద్రీశుని మధ్యాహ్నభోగకాలమునందు వాయించెడి ఘంటానాదము విను వారలు ముక్తికళ్యాణఘంటానాదము విందురు. ఉపహారమొనర్చు నప్పటి ఘంటారావము వినువారలకు యమునిమహిషకంఠ ఘంటా రావము వినరాదు. సప్తగోదావరతీర్థమైదవది. శంభుఁడు లోకహిత మునకై స్వయముగా నందుద్భవించెను. పూర్వము సప్తమహర్షులు దానిని భీమేశ్వరాభిషేకమునకై తీసికొనివచ్చిరి. ఆ భీమేశ్వరుఁడు తన్ను భజించువారలకుఁ గల్పవృక్షమై యున్నవాఁడు. ఒకమాఱా దేవున కభిషేకించినను, బూలతోఁ బూజించినను దలఁచినతలఁపులు తలకూడును. భీమేశనగరమునందున్న యగస్త్యేశ రామేశ నాకులేశ గణేశ పాతాళభైరవులను, బంచతీర్థములను గాంచిన ద్వాదశక్షేత్రము

లను సంకర్షించిన మహాఫలము కలుగును. ఆదిమూల మగు మూల స్థానేశ్వరలింగమును వీక్షించిన నీక్షేత్రమండలి సకలలింగములను దర్శించిన ఫల మబ్బును. సప్తగోదావరమును, భీమేశుని, నాకులేశ్వరుని, సుద్రపాదస్థలమును సంస్మరించిన వాఁడు ధన్యతముఁడగు న"ని యగస్త్యుడు దక్షప్రారాధకక్షేత్రమును, భీమేశవైభవమును, సప్తగోదావరోత్కర్షమును, ద్వాదశక్షేత్రగౌరవమును, బంచతీర్థప్రభావమును వినిపించి యిట్లనియెను:—"ఓకృష్ణద్వైపాయన! మధ్యాహ్నభోగవేళ యగుచున్నది. మన మెల్లరమును భీమేశుని సేవింపఁ బోదమ"న వారందఱును భీమేశాలయమంటపద్వారమును బ్రవేశించిరి. కళ్యాణాచలమంటపమును గాంచిరి; దానికిఁ బూర్వభాగమున నున్న మహాస్థానమంటపము నవలోకించిరి. బహిర్గేహమున నున్న పరివార దేవతలకుఁ బ్రణమిల్లిరి. దండపాణీశ్వరునకు దండమిడిరి. అంత శ్రీభీమేశమహాప్రభుని మందిరద్వారమును జొచ్చిరి; అంతర్గృహమునకుఁ బ్రదక్షిణ మొనర్చిరి; భీమనాయకపత్నికిఁ బార్వతికిఁ బ్రణామ మొనర్చిరి; కుమారస్వామిని గొల్చిరి; గజాననుని సేవించిరి; దుర్గామహాదేవిని నుతించిరి; వటుకభైరవుని పరికించిరి; చతుర్ముఖునకుఁ జేమోడ్చిరి; లక్ష్మీపతిని సేవించిరి. అంత భీమనాథుని స్వర్గప్రాసాద మెక్కి భీమేశ్వరునకు సాష్టాంగదండప్రణామమాచరించి పలు తెఱఁగుల నుతించిరి; బంగారుపూవులతోఁ బూజించిరి; సప్తగోదావరకనకకమలపూజ గావించిరి; ప్రార్థించిరి. అంత వ్యాసుఁ డగస్త్యునితో నిట్లనియెను:—"ఓ యగస్త్యమునీంద్రా! నీ యనుగ్రహముచే భీమమండలమును, ద్వాదశక్షేత్రాదులను, భీమనాయకునిఁ గాంచితిని; ధన్యుఁడ నైతిని. నీవును నీ దివ్యక్షేత్రమునందే యుండి లోపాముద్రా సహితముగా నుండి తపమాచరింపుమ"ని చెప్పి యా యగస్త్యుని వీడ్కొల్పి శిష్యులతోడఁ గూడి భీమేశ్వరుని సేవించెను; పలుతెఱఁగుల నుతిం

చెను. అంత నాకాశవాణి యిట్లనెను:—"ఓ మునీంద్రా! భీమేశుఁడు నిన్ననుగ్రహించెను; సుఖముగా నిందు నివసింపుమ"నెను. అంత వ్యాసుఁడు పైలాదిశిష్యులతోడ "భీమేశ్వరుఁడు మనలను గరుణించెను"అని చెప్పి దక్షారామమునందే నివసించెను.

మరల నైమిశారణ్యమునందలి మునులు సూతునితో నిట్లనిరి:—"సూతా! నీవలననే భీమలింగసముద్భవమును, సప్తర్షులు సప్తగోదావరమును దెచ్చుటయును, భీమేశప్రతిష్ఠయును గూడ విన నెంచితిమి"అని వేఁడికొనఁగా నాతఁడిట్లనియెను:—ఇదివఱకు మీకుఁ జెప్పినది యగస్త్యుఁడు వ్యాసునకుఁ జెప్పిన యాత్రాక్రమము. ఇఁక నారదుఁడు మునులకుఁ జెప్పినదంతయును జెప్పెదను:— మొదట వ్యాసుఁడు మున్నాలుగురు శిష్యులతోడను గాశికాపురమునకుఁ బోయెనని వసిష్ఠాత్రిభరద్వాజభార్గవాంగిరసాదిమునులును "మేమును వ్యాసుఁడుండిన కాశికాపురమునకే పోయెదమ"ని ప్రయాణమై పుణ్యతీర్థములను గాంచుచుఁ బోయిపోయి కాశికాపురమునకుఁ జేరిరి; గంగలో స్నాన మొనర్చిరి; విశ్వేశుని దర్శించిరి. అంత వ్యాసుని జాడ దెలియఁ గోరి యందు వసించెడి యతులనడుగఁగా వారలిట్లనిరి:—అయ్యా! ఆవిశ్వేశద్రోహిస్థితి మాకేల? అతఁ డిందుండఁ దగిన వాఁడా! అతని యునికి మాకేమియుఁ దెలియదు. పొండు! పొండు!" అని పల్కి యా వ్యాసుఁ డొనర్చినదంతయుఁ జెప్పఁగా నావసిష్ఠాదులిట్లనుకొనిరి:—ఆ వ్యాసునే యిందుండనీక వెడలనడచిన కోపగాఁడు మనలను మాత్ర మిందుండ నిచ్చునా! ఆ కృష్ణద్వైపాయనుఁ డుండిన తావుననే మనమును సుఖముగా జీవింపవచ్చు ననుకొని వ్యాసుఁడు వచ్చిన మార్గమును బట్టి దక్షారామమునకు విచ్చేసి నారదునితో నిట్లనిరి:—ఓనారద! మా కిపుడు దక్షవాటీ తీర్థమాహాత్మ్యాదులను జెప్పుము!" అనఁగా నా నారదుఁ

డిట్లనియెను:—సప్తగోదావరతీర్థము సర్వ తీర్థములలో నుత్తమ మైనది. భీమనాథేశ్వరస్వామి దానితీరమున నున్నాఁడు. ఆ దేవుని దర్శించిన సప్తజన్మకృతపాతకములు నశించును. దక్షవాటమున దేవేంద్రాదులు ప్రతిష్ఠించిన లింగములు లెక్కింప నలవి కాకున్నవి. అందలి ద్వాదశక్షేత్రములను దర్శించిన పుణ్యము రామలింగేశుని దర్శించిన గాఁ గలదు. ద్వాదశక్షేత్రములను సేవించిన నరుఁడు పాపి యయ్యును యమాలయమునకుఁ బోఁడు" అని చెప్పఁగా వారందఱును సప్తగోదావరమున స్నానమొనర్చి భీమేశుని దర్శించిరి; మహానందములో నచ్చట వసించిరి ; వ్యాసునిఁ గాంచిరి; అగస్త్యుని వీక్షించిరి; వారివలనను నా దక్షారామగౌరవమును వినిరి. అంత నామును లెల్లరును వసిష్ఠుని ముందిడుకొని యొక స్థలమునఁ గూర్చుండి యుండఁగా మంకణుఁ డిట్లనియెను:—ఓమహాత్ములారా! మీలో నొకరివలన భీమనాథమాహాత్మ్యమును వినఁగోరుచున్నాఁడను" అనియనినంతనే మునులు వసిష్ఠుని వేఁడికొనఁగా నాతఁడా భీమేశ మాహాత్మ్యము నిట్లు చెప్పఁదొడఁగెను:— మంకణా! భీమ మగు గరళము భూమియు గగనమును దిశలను నిండి యుండునపుడు భీమ గతిని మ్రింగెను గావున భీమేశ్వరుఁ డయ్యెను" అనిన నామంకణుఁ డది యంతయుఁ జెప్పుమనఁగా నిట్లనియెను:—మంకణా! పూర్వము జలంధరాదిరాక్షసులకును దేవేంద్రాదిదేవతలకును వైరము పొడమఁగా దేవేంద్రుఁడు పాలసముద్రమునఁ బవ్వళించిన విష్ణునకు విన్నవింపఁగా నా నారాయణుఁడు విచ్చేసి దేవదానవులను రావించి యిట్లనియెను:—ఓదేవదానవులారా! అన్నదమ్ము లగు మీ రిట్లు కలహింపఁజనదు! ముదిమియును జావును లేని స్థితిని సంపాదింపవలయును గాని యిట్లొండొరులు కలహింపఁ జనదు. అస్థితి యమృతపాన మొనర్చిన రాఁగలద"ని వారలను బోత్సహించి

మంథరనగరాదిసాధనములను సమకూర్చెను. అంతదేవదానవులు సాగరమును మథింపనారంభింపఁగా నందు భయంకరమగు హాలాహల ముద్భవించి జగము లెల్ల నాక్రమింపఁదొడఁగెను. అకాఁకకుపచ్చగ నుండెడి విష్ణువు కృష్ణవర్ణుఁ డయ్యెను. అంతదేవతలునుబూర్వదేవత లును బరుగిడివచ్చి దాక్షారామాధినాథునకు విన్నవింప భయపడవల దని వారల కభయ మొసఁగి యా విసము నఱచేత నుంచుకొనఁగా నొకమధుకరమువలెఁ గాన్పించెను. దానినిమ్రింగఁజూచునపుడు పార్వతి కోరిన తీరున కంఠకోణమున నిల్పెను. దేవతలును బూర్వదేవతలును బహుప్రకారముల నుతింప భీమేశ్వరుఁడిట్లనియెను:—"ఓ దేవదానవు లారా! సముద్రమథనారంభమున విఘ్నేశునిఁ బూజింప మఱచితిరి. కాన యిట్టి చేటు వాటిల్లెను. ఆ గణనాయకునిఁ బూజించి మరల సాగరమును ద్రచ్చనిచ్చగింతురేని వాంఛితము నెఱవేఱును" అని చెప్ప వారందఱా గణనాయకునిఁ బూజించి మరల సముద్రమును మథింపఁగా జంద్రాదులును, అమృతకలశముతో ధన్వంతరియు, లక్ష్మియును జనించిరి. ఆ పద్మాలయపద్మనాభుని వరించెను. అంత రాక్షసులు ధన్వంతరికరమున నున్న యమృతకలశమును హరింపఁగా దానినిమరలవిష్ణుఁడు మాయాంగనయై వారలనువంచించి తెచ్చి దేవతల కిచ్చెను. అంత రాక్షసులు విచారముతో నొకచోటఁ గూడియుండఁగా నారదుఁడు వారలను గాంచి యిట్లనియెను:—ఓ త్రిపురాసురులారా! మీరేలవిచారించెదరు? అమృతపానమునఁగలిగిన వానికంటెనధికమగువ రములుమీరలు భీమేశునిఁ బూజించినఁబడయఁ గలరు" అని నారదుఁడు చెప్ప నారక్కసులందఱును భీమేశ్వరు నతినిష్ఠతోఁ బూజించి వరము లంది దేవతలను బీడింప నారంభింపఁగా బ్రహ్మేంద్రాది దేవతలు మరల భీమేశ్వరునిచెంతకువచ్చి యిట్లు వేఁడికొనిరి:—భీమనాథ! మొదటహాలాహలమును ద్రావి రాక్షసులను దేవతలను సమముగాఁ

గాచినాఁడవు! పిమ్మట రాక్షసులకు వరములొసంగితివి! వారలిప్పుడు మమ్ములను బీడించుచున్నారు. ఇత్తఱి మమ్ములను రక్షింపకున్న వారే యీజగములనేకచ్ఛత్రముగా నేలఁగలరు" అని విన్నవింపఁగా భీమేశ్వరుఁడు భూమ్యాదులను రథాదులుగఁ జేసికొని త్రిపురములను దహించెను. అప్పుడు త్రిపురాసురులకుఁ గులదైవతమగు లింగము విష్ణుబాణాగ్నిజ్వాలలంటక ప్రకాశించుచుండెను. అది పంచతత్త్వమయమగుటచే నైదు ఖండములుగా నొనర్చి యందునాల్గిటిని నమరేశారామసోమారామక్షీరారామ కుమారారామములని విఖ్యాతము లగు క్షేత్రములందుఁ బ్రతిష్ఠింపఁజేసి తాను దక్షారామమునందు భీమేశ్వరలింగమునందువసింప నిచ్చగించెను. అంతసప్తమహర్షులు నాభీమలింగమును బ్రతిష్ఠింప ముహూర్తము నిశ్చయించికొని యిట్లనుకొనిరి:—"ముందుగా మనము భీమేశ్వరాభిషేకమునకై యొకనదిని దేవలయును" అనుకొని మహానందముతో గౌతమీతీరమునకేగి యిట్లు ప్రార్థించిరి:—"అమ్మా! గోదావరి! దక్షవాటమున మాప్రభుఁడు భీమేశ్వరుఁడు ప్రతిష్ఠఁ గైకొన సిద్ధముగా నున్నాఁడు! కదలిరమ్మా." అని ప్రార్థించినంతనే యాగోదావరి వారివెంటవచ్చుచుండెను. అప్పుడు తుల్యభాగాతీరమునందుఁ గొందఱు దైత్యములు గృహములు నిర్మించుకొని తపము గావించుచుండిరి. ఆసప్తమునులామార్గమునవచ్చుటచే నాదైత్యమునులసర్వస్వమునువరదపాలై పోఁగా వారలు దేవమునులు తెచ్చుచుండిన గోదావరమునకుఁ బ్రవాహము లేకుండునట్లు శపించిరి. ఆ దేవమునులును నాతుల్యభాగయపూజ్యయగుఁ గాక యని శపింపఁగా నన్వర్థనామకుఁ డగు తుల్యభాగుఁ డిట్లనియెను:—మీరలు కలహించి పుణ్యజీవన లగు నీనదులను శపింపఁదగదు? శాపములను మరల్పుఁడి!" అన వారలు మామాట మరల్పరాదని దేవమునులు తుల్యభాగపుణ్యకాలములందు మాత్రమే

పూజ్యయగునట్లును, దైత్యమునులు సప్తమునులు తెచ్చెడి గోదావరి యందఱకుఁ గనఁబడునట్లుగాఁ బైకిఁ బ్రవహింపక భూమిలోనే ప్రవహించునట్లును గరుణించిరి. అంత నాసప్తఋషులు గోదావరిని దోడ్కొనుచు వచ్చి దక్షారామము ప్రవేశించునప్పటికి భీమలింగము ప్రతిష్ఠనొంది పూజింపఁబడి యుండెను. అది కాంచి యామునులిట్లనిరి:—మేముప్రతిష్ఠింపనెంచిన భీమలింగమునెవ్వరో మమ్ములెక్క చేయక ప్రతిష్ఠించి పూజించిరని కోపింపఁగా సూర్యుఁడు వచ్చి యిట్లనెను:— మహాత్ములారా! మీరు ప్రతిష్ఠింపనెంచిన దివ్యలింగమును వేఱొకరు ప్రతిష్ఠింపఁగలరా! దారిలో జరిగినజగడముచే మీకుఁ గాలవిలంబము కాఁగా స్వామియే తనకుఁదాను బ్రతిష్ఠ గైకొనెను. బ్రహ్మాదులును నేనును బూజించితిమి" అని యనఁగా నాకాశవాణియు మునులకిట్లనియెను:— ఓ మునులారా! మీరు విచారపడవలదు; మీరునిర్ణయించుకొనిన ముహూర్తమునకే స్వామి తనకుఁ దాను బ్రతిష్ఠ గైకొనియెను. అంత దివాకరాదులు పూజించిరి. మీరలెనమండ్రుగురును భీమలింగమును బ్రతిష్ఠించినవారలే యగుదురు కాన యర్చనమునకై యష్టమూర్తివంశజులను నియమింపుఁడి! ఇతరులు తత్త్వవేత్తలైనను స్వామిని ముట్టుకొనఁదగరు; వారలో మూఢులైనను బనికివత్తురు" అని చెప్పినంతనే యామునులు తాము తెచ్చిన గోదావరీజలముతో భీమేశ్వరునకభిషేకము గావించి పూజించిరి. సప్తమునులు తెచ్చిన గోదావరము కాన సప్తగోదావరమయ్యెను. అంత సూర్యుఁడు కైలాసమునకేగి శంకరుని బ్రార్థింపఁగా నామహాదేవుఁడు వచ్చి మార్గశిర శుక్లచతుర్దశియందు భీమలింగమునం దైక్యమయ్యెను. అంత గౌరిలక్ష్మి మొదలగు పతివ్రతలు స్తోత్రమొనర్చిరి. అంత సప్త గోదావరమును దెచ్చుచుండినపుడు దేవతలను వెంటనిడుకొని గగన మార్గమున వచ్చిన దేవేంద్రునకు బృహస్పతి "భూదానమే దానమ" ని

చెప్పఁగా భీమేశ్వరునకుఁ గొంతభూభాగమొసఁగి దానికి భీమమండల మని పేరిడియెను. అంత భీమేశ్వరుఁడు వసంతోత్సవము నవధరించెను. సప్తమునులును భీమేశ్వరుని నుతించిరి. అంతఁ బరమేశ్వరుఁడు పార్వతికి శివభక్తియుఁ, గలియుగలక్షణములను, యోగసాధనమును, బ్రహ్మోపాసనవిధానమును, దక్షారామగౌరవమును వివరించి చెప్పెను. అంత జలంధరవ్యాఘ్రాదిరాక్షసులు ముల్లోకములను నాక్రమించి బాధింపఁదొడఁగఁగా దేవేంద్రాదులు విష్ణునికడకేగి మొరయిడఁగా నిట్లనియెను:—దేవతలారా! దక్షయాగమున వీరభద్రుఁడు నాచక్రమును చక్కిలముపగిది మెక్కినదిమొదలు నిరాయుధుఁడనైయేమియుఁజేయలేకున్నవాడను; ఇప్పుడుభీమేశ్వరునిఁబూజించియాచక్రమునుమరలబడసి మిమ్ములనురక్షించెదనని చెప్పివిభూతిరుద్రాక్షమాలాదులను ధరించి నిత్యమును సహస్రపద్మములతోఁ బూజించుచుండఁగా నొకనాఁడు భీమేశ్వరుఁడాపద్మనేత్రుని భక్తిని బరీక్షింపనెంచి యొకకమలమును హరింపఁగా నావిష్ణుఁడు తననేత్రకమలముతో నర్పించెను. దానికి భీమశంకరుఁడు మెచ్చి నేత్రమును జక్రమును గూడ నిచ్చెను. అంత వ్యాసాదులకు భీమేశ్వరుఁడు ప్రసన్నుఁడై దక్షారామమహిమమిట్లు కొనియాడెను : ..“దక్షారామమునకు సాటి యగు తీర్థము వేఱొండులేదుకావున వేఱొకయెడకుఁ జనకుండ నిందేయుండునట్లు కండ్లూడఁబెఱకుకొనియుఁబాదములు ఖండించుకొనియు నుండవలయును.” అని వివిధవిశేషములను బేర్కొనియంతర్ధానమందెను.

---

భీమేశ్వరున కొసఁగిన భూభాగమునకు భీమమండల
మని పేరిడుట 115—122

౨౫. భీమేశ్వరుఁడు వసంతోత్సవము నవధరించుట 122—127

౨౬. సప్తమహర్షులు భీమేశ్వరునిఁ బూజించుట; వసిష్ఠుఁడు మంకణునకు శివభక్తిమాహాత్మ్యమును
జెప్పుట 127—132

౨౭. పరమేశ్వరుఁడు పార్వతికిఁగలిలక్షణములనఁ యోగ
విధానమును జెప్పుట 133—139

౨౮. పరమేశ్వరుఁడు పార్వతికి బ్రహ్మము నుపాసించు
విధానమును దెలుపుట 139—144

౨౯. పరమేశ్వరుఁడు పార్వతికి దక్షారామగౌరవమును
జెప్పుట 144—150

30. సూతుఁడు శౌనకాదులకు దక్షారామమాహాత్మ్య
మును జెప్పుట 150—153

3౧. దక్షయాగమునఁ గోల్పోయిన తనచక్రలాభము
నకై విష్ణువు విభూతిధారణాదులొనర్చి భీమేశుని
సేవించుట 153—158

3౨. భీమేశ్వరుఁడు వ్యాసాదులకుఁ బ్రసన్నుఁడై దక్షా
రామమాహాత్మ్యమును జెప్పుట 159—167

భీమఖండము, భీమేశ్వరపురాణము, భీమేశ్వరమాహాత్మ్యమను నామాంతరములుగల

# దక్షారామాయణము

## కథోపక్రమము

### ప్రథమాధ్యాయము

నైమిశారణ్యపుణ్యక్షేత్రమునఁ బండ్రెండేండ్లు జరుగు దీర్ఘసత్ర యాగమునకు శౌనకాదిమునులెల్లరును విచ్చేసిరి. అందు రోమహర్షికి బుత్త్రుఁడును బాదరాయణునకుఁ బ్రియశిష్యుఁడును నగు సూతునిఁ గాంచి మును లిట్లనిరి:—"మహాత్మా! నీవు పౌరాణికుఁడవు; వాగ్విదుల కెల్లను మేటివి. మే మిదివఱకు బహుసంహితాకీర్ణమును సపాద లక్షగ్రంథసంఖ్యాసమన్వితమును బంచాశత్ఖండమండితమును నగు స్కాందపురాణమునందలి పూర్వఖండమునందు వ్యాసుఁడు తన యపరాధమువలన విశ్వేశునిచే వెడలఁగొట్టఁబడి వారణాశి వదలెనని మాత్రము వింటిమి. అంత మోక్షపాత్రమగు నావ్యాసుఁడు మోక్షపదమగు నా కాశిఁ బాసి శిష్యవర్గముతో నెచట వసియించెనో! ఎచ్చటనేమి చేసెనో! ఏతీర్థమాడెనో! అది యెల్ల మాకు నానతీదగుదు వనిరి. అంత నాకథకుఁడు శౌనకాది మునులతో నిట్లనియెను:— "తాపసులారా వినుఁడి! సకల ధర్మజ్ఞుఁడును నాకు గురువును నగు ద్వైపాయన మౌనివిశ్వేశ్వరుని కోపనుచేఁ గాశికాపురమునందుండి కదలి గంగదరికిఁ జేరి ప్రాజ్ఞులగు శిష్యులతోఁ గలసి పుడమిపైఁ గల పుణ్యతీర్థములనెల్ల లెక్కించి చూచి సార్థసంపన్నముగా నీమాట మాటాడియెను:—"శిష్యులారా! విశ్వేశ్వరుఁడు వీఁకవెడలి పొమ్మని

నంతనే నేను విచారించుచుండఁగా నంబయగు గౌరి కనికరమున నాతో నిట్లనియెను:—వత్సా! తీర్థబృందమంతటిలో నీ కాశిగరీయసి. ఇట్టి కాశికాపురముకన్న దక్షవాటీపురమే మిన్న. అది సదా భోగమోక్షములకుఁ బుట్టినిల్లు. అందు ఃముందు దక్షప్రజాపతి యజ్ఞము చేయ నెంచి బ్రహ్మేంద్రాదిదేవతలను నల్లుండ్రగు చంద్రాదులను మాత్రమే యాహ్వానించి యా యాగమహోత్సవమున సత్కారములచేఁ దని పెను, గాని దర్పముచే దర్పకారాతియగు కాలకంఠుని రుద్రుఁడనియు జగదేకగురుఁడనియు సదాశివుఁడనియు నెఱుఁగక దురాశయుఁడై పిలువకుండెను. అల్పబుద్ధియగు నాతఁడజ్ఞానముచే మహాదేవు ననాద రించి దేవతల యానతిఁ బడసి కర్మవశమున నాజన్నము చేయసమ కట్టెను; గాని యట్టి పనులు పురోభివృద్ధి గాంచఁగలుగునా! అటులు కావరమునఁ గన్నుగానని దక్షుఁడు దేవదేవుఁడు లేకయే యధ్వరము చేసి దేవగణముతోఁ గోపియునుసాక్షాత్సంహారరుద్రుఁడునునగు వీర భద్రునివలన దుర్దశల నందెను. పదపడి దీనబంధువగు నామహేశ్వ రుని పాదపద్మములఁ జేరి శరణము వేఁడి దేవతావ్రాతముతోడ ముక్తుఁడయ్యెను. మహానుభావు లెందును సమయము కోలఁదిని నిగ్ర హానుగ్రహములను జూపుదురు గాని దీర్ఘకోపులుగారు. అంత భూతే శుఁడా దక్షుని యపరాధములలోఁ గొనికృపాయత్తుఁడై దేవతల నానందపఱచెను; భయవిహ్వలులగు ఋషుల కభయ మొసఁగెను; రోసముచేతను నీసుచేతను నంతర్హితయగు తన దేవిని మరల విభుఁడు వామాంగమున వహియించెను. యజ్ఞమృగశిరమును జెండి గివిగ్రవే లఁగట్టిన నయనిధియగు నాభీమనాథుఁడే దేవుఁడు! భూమండలము న దక్షవాటమే తీర్థము! సర్వదేవరాజగు శ్రీభీమేశ్వరునకు నిగ్రహా నుగ్రహ స్థైర్యము లద్భుతములా యేమి? అతఁడు కాలకూటము నుపసంహరించినవాఁడు; త్రిపురాసురులనుమర్దించినవాఁడు . ఆమహాదే

వుని కడకంటి చూపుననే యీజగమెల్లఁ గలుగుచుండుట లేదా! ఆలోకేశుఁడు తన్ను బ్రహ్మాదులు సంస్తుతింప విశ్వమోహినియు,మహామాయయు, స్వదేహార్ధ వాసినియునగు తనదు దేవిని హిమాచలతపోఫలసిద్ధికిని మేనకాభాగధేయమునకును దేవహితమునకును హిమాలయమున జనియింపనియమించెను. ఆభువనేశ్వరియుమహేశ్వరుని దేహమును విడనాడి గట్టులఱేకి మీనికిఁబట్టియైపుట్టెను. అందుచేఁ బుడమిపై దక్షారామమే ముక్తిక్షేత్రమని కీర్తింపఁబడుచున్నది. దక్షుని యజ్ఞగృహావాటచే నాపురమునకు దక్షారామమను పేరువచ్చెను.

అచ్చట సదాశివుఁడు సాక్షాత్కరించుటచే నాపురజనులకు భోగమోక్షఫలమన నెంతటిది! ఈమహీతలమున నందలి తీర్థములలోఁ గొన్నిభోగమునే యొసఁగుచుండును; మఱికొన్ని మోక్షమునే యొసఁగుచుండును. ఈదక్షపురమున్నదో భోగమును మోక్షమును గూడ నిచ్చును. శ్రీభీమేశ్వరుని కన్ననుత్తమదేవునిని దక్షారామము కన్నను బరమపదమును సప్తగోదావరము కన్నసారమగు తీర్థమును నీజగా నఁగానము. అందలి వారలకు భోగమోక్షములు కరతలామలకములు శ్రీభీమేశ్వరమునఁజీవించుటగాని స్మృతినొందుటగాని శ్రేయమే! సకలలోకనాథునిచే భీమనాథునిచే నాపురము సంశోభించుచున్నది. అతఁడు పాల్కడలిని బొడమిన విసమును మెసవి కాలగళుఁడయ్యెను. గట్టులఱేని పట్టి బటువు పాలిండ్ల కొనలొత్తుకొన బిగ్గఁగౌగిలించుకొనుమేటి. ఉయ్యేలలను బోలుమిన్నేటి తరఁగల నూఁగులాడు లేనెలను సిగపూవుగఁ జేసికొనిన ప్రోడ; నలువయై దేవతలను గత్తికోటను గండ్రించిన గండఁడు; ఆప్రభుని గండమండలమునాగ కుండలములచే సందీపించుచుండునని యిట్లు తపోధనశ్రేష్ఠుఁడగు నావ్యాసుఁడు దక్షారామగౌరవమును హృదయవ్యథ శాంతింప సభివర్ణింపుచుఁ బ్రయాణింప సంసిద్ధుఁడై ముచ్చటలు చెప్పుచు నమృతజలతరంగిణి యగు నాభాగీ

రథీతీరము నందుండఁగనే భానుఁడస్తమించెను. అంతటఁ గృష్ణద్వైపాయనుఁడు నాగంగా తటముననే సంధ్యాకాలోచిత క్రియలు నిర్వర్తించుకొని యొకనిర్మల సైకతస్థలమున శిష్యసందోహ సహితుఁడై కూర్చుండియుండి విశ్వేశ్వరుఁడు చేసినధిక్కారమును దలఁచికొని తలఁచికొని యంతఃపరితాపము నడంచుకొనియెను; గాని యామునివరునకు మానసవ్యథచే నారేయి చాలసేపటికిఁ గాని కన్నులకుఁ గూర్కురాదయ్యెను. అంతసూర్యోదయము కాఁగాసంయమీశ్వరుఁడు ప్రాతఃకాలోచిత క్రియలు జఱపుకొని శిష్యబృందము తోడ దక్షవాటీనగరమునకుఁ బో నాయిత్తపడుచుఁ గాశీవియోగమునఁ గలిగిన మహావేదనచే డెందమునందు గుందుచు నెట్టకేలకు ధైర్యమవలంబించి కనకోత్తుంగసౌధ గోపురశాలియు, మణిప్రాకారకలితమును, చిత్రధ్వజసమంచితమును, బుణ్యనారీనరాకీర్ణమును గజాశ్వరథ సంకులమును, దేవస్థానశతాకీర్ణమును, దటాక వనశోభితమును, నానాతీర్థప్రకాశితమును, వేదశాస్త్ర పురాణవిద్యా సక్తద్విజాకులమును దపోయోగరతానేక ముముక్షుగణ సేవితమును, శివతత్త్వ పరిజ్ఞాతృమాహేశ్వర విభూషితమునుగోవిందకీర్తనాసక్త వైష్ణవవ్రాతసంకులమును గణేశసౌరశాక్తాదిదేవసముపాసితమును, సుఖసర్వజ్ఞ కైలాసవసతి విస్మృతమును, కైవల్యకారియునగు కాశికాపురమును సంయమీంద్రుఁడగు వ్యాసుఁడు భక్తిపురస్సరముగఁ బ్రదక్షిణ క్రమమునఁ బోవుచు బాలాదిత్యునకు నమస్కరించెను. కేశవునకుఁ గేలు మోడ్చెను; భాగీరథికిఁ బ్రణమిల్లెను; విశ్వనాథునకు వెన్నెల కోలలిడియెను: విశాలాక్షిని వినుతించెను; మోక్షమండపమునకు మొక్కెను; అంతర్గృహమునామతించెను; భైరవుని శరణందెను; ఢుండీవిఘ్నేశ్వరు నారాధించెను. దండపాణికిదండమిడియెను. కుక్కుటచతుష్టయమున కేటికోళ్ళిడియెను. సర్వదేవతలకుఁ జేమోడ్పులొసఁగెను. పిమ్మటనామునిపుంగవుఁడా

కాశికానగరము నుండి యెట్టకేని నిర్గమించి ఋషిసంఘనిషేవిత మగు ప్రయాగక్షేత్రమునకుఁ బోయెను. అందు దేవేశుండును, భక్త వత్సలుడును గిరీటాద్యలంకృతుఁడును, పురాణపురుషుఁడును నగుమాధ వునిఁ గాంచియావేద వ్యాసుఁడు పలుమాఱు మ్రొక్కుచు వేదార్థ రచిత వాక్యముల వినుతించియు, నాదేవుని ప్రసాద తులసీతీర్థముల సేవించియుఁ గాశీవియోగమువలనఁ గలిగినసంతాపమునుజాల సేపటికిఁ గాని శాంతింపఁజేసి కొనలేకపోయెను. పిమ్మటనామునివరుఁడు శిష్యుల తోడఁబయనమై పురుషోత్తముడుండిన జగన్నాథముదారిఁ బట్టెను.

ఇది స్కందపురాణమునందలి క్షేత్రఖండమునఁ బ్రథమాధ్యాయము.

---

ద్వితీయాధ్యాయము.

—§ వ్యాసుఁడు శిష్యులతోడఁ గూడి జగన్నాథమునకుఁ బోవుట §—

సూతుఁడుశౌనకాదిమునులతో నిట్లనియెను:—

"మునినాథుఁడగు వ్యాసుఁడు సంభ్రమముతో జగన్నాథమును జూడఁగోరి పయనమైపోవునప్పుడు మార్గమధ్యమున మహాద్భుతము లును, మహాపుణ్యములునునగు జగన్నాథవర్ణనములచే శిష్యులను సంత సింపఁజేయుచుఁ బోయిపోయి మింటినంటుచుండిన జగన్నాథాలయ మును గాంచెను. దానిని గగనమున దూరమునుండియే వైమానికులు ప్రతిక్షణమును విస్మయమందుచు వీక్షించుచుందురు. అది దర్శన మాత్రముచేతనే మహాపాతకులగు నరులకుఁగూడను మోక్ష మొసఁ గుచుండును. లక్ష్మీపతి కది సుధాసాగరముకన్నను, సూర్యమండలము కన్నను ధరిత్రీమండలమునఁ బ్రియమై యుండును. అత్తరిభానుమంతుఁ డంధకారమును హరించినటుల జగన్నాథాలయ కనకశృంగ ప్రకాశ

మాహాని చంద్రుని మనఃక్లేశాంధకారమును హరించినది. అంత నెదుట సాక్షాద్వైకుంఠమగు శ్రీజగన్నాథమును గనులారఁ గాంచెను. అది విశ్వాధ్యక్షునిచే రక్షింపఁబడుచున్నది; మోక్షలక్ష్మికి భవనమైనది; అనవరతమనేక కల్యాణములకు స్థానమైనది. పరమపావనమైనది; జగన్నాథుని ప్రసాదాన్నముచే సకలవర్ణములను సంకీర్ణమొనర్చునది; బ్రహ్మాదులకు నగణ్యమైనది; మనుజుల కలుషసాగరతరణికి యానపాత్రమైనది; మందభాగ్యులకు దుర్లభమైనది; భాగ్యశాలురకు సులభమైనది. అత్తఱి నాపరాశరతనూభవుఁడు పరమానందమునంది శిష్యులతోడఁ బురమందుఁజొచ్చి యచ్చట వసియించు భాగవతోత్తములను జూచెను. వారెల్లపుడును భుజములపై శంఖచక్రముల గురుతులు కలిగియుందురు. తులసీదామభూషణములను దాల్తురు. లలాటఫలకమున దేదీప్యమానముగా నూర్ధ్వపుండ్రములను ధరియింతురు; శోభయొసఁగ వక్షములపైఁ దులసీ పద్మాక్షమాలికలను వైచుకొందురు. హస్తములందుఁ బద్మాక్షమాల లిడికొని భగవన్నామమునె సదా జపియింతురు. అవ్యయమగు భగవత్తత్త్వమునే పరస్పరమును బోధించుకొనుచు భగవంతునిఁ గీర్తించుచుందురు. భగవధ్యానమునందాసక్తి గలిగియుందురు; భగవంతునిదక్క బాహ్యవిషయములపై నాసక్తి పరిత్యజింతురు; భగవద్గుణమును వర్ణించునెడ వారి శిరములు కంపించుచుండును; భగవత్కథలను వినునపుడు హర్షముచే వారి యాననము లానందాశ్రువులతో నిండియుండును. కంఠములందు గద్గదస్వనము బయలువెడలును; అంగములందుఁ బులకాంకురములు పొడచూపును; దంభాహంకారములను దరికి రానీయరు. మఱియు నందలివారందఱును న్యాయమార్గాసక్తులును విష్ణుపరాయణులును నై యుందురు. అచ్చటి బుధోత్తములు వైష్ణవశాస్త్రములనే సదా పఠియించుచుందురు. అందును గొందఱు రామాయణమును, గొందఱు హరి

భక్తిసుధోదయమును, కొందఱు విష్ణుపురాణమును, కొందఱు భాగవతమును, కొందఱు విష్ణుధర్మోత్తరమును, కొందఱు గీతాశాస్త్రమును, కొందఱు పాద్మోత్తరఖండమును, కొందఱు హరివంశమును, కొందఱు విష్ణుసహస్రనామములును, కొందఱష్టోత్తరశతమును కొందఱు విష్ణుసంబంధమగు పాంచరాత్రిక ముఖ్యగ్రంథములను బఠించుచుందురు. ఇట్లనుదినమును భగవదాసక్తిలో నిరతమనస్కులై పెక్కండ్రు భాగవతోత్తము లచ్చటనే వసియించుచుందురు. భగవద్భక్తితత్పరులగు బ్రాహ్మక్షత్రియ వైశ్యశూద్రులు తీర్థయాత్రాపరాయణులై సకలదేశములనుండియు నచ్చటికి వచ్చుచుందురు. దూరమయ్యును బ్రయత్నముతో శ్రీరంగశ్రీనివాసాది క్షేత్రములనుండియు మహాధన్యులగువారలు స్వజనులతోడను నాప్తులతోడను జగన్నాథేశ్వరుని జ్యేష్ఠాభిషేకమును రథయాత్రామహోత్సవమును, డోలాపర్వోత్సవమును నిత్యావసరవైభవమును జూడఁగోరి జగన్నాథమునకు విచ్చేయుదురు. అంత వారు మార్కండేయ మహాలింగ సన్నిధియందలి తీర్థజలములందుఁ మునిఁగి భక్తితో నానీలకంధరుని సేవింతురు. మఱియు నచ్చటి యక్షయవటపాత్రమునందలి నిర్మల జలములందు నీరాడుదురు. శ్రీ జగన్నాథ చరణకమల సమీపముననున్న నదీజలముల మునుకవైచి భక్తవత్సలుఁడగు నా దేవునిభజయింతురు. అట్లె రోహిణీకుండమునందు విగాహింతురు; ఇంద్రద్యుమ్న సరస్సునందుఁ బ్రుంగుదురు; మహోదధియందు మజ్జనమాచరింతురు; యత్నముతో ముక్తిశిలనీక్షింతురు. కాన నా మానవులకు సకలకల్మషములును క్షీణింప ముక్తికలుగును. పుణ్యకర్ముఁడైనను బాపకర్ముఁడైనను ఘనుఁడైనను నల్పుఁడైనను గుణవంతుఁడైనను గుణహీనుఁడైనను జ్ఞానవంతుఁడైనను జడుఁడైనను నాపురుషోత్తముని సేవింప ముక్తుఁడగును. పురుషున కాపురుషోత్తమ సేవచే మోక్షమన నెంతటిది! అన్యమానవుఁడైనను నా దేవునిదర్శ

నాదులవలన ముక్తుఁడగును. ఒక్కమాఱు మనస్సునందైనను జగన్నాథమునకుఁ బోవలయు ననెడి తలఁపు గలవానికిఁ గూడను గుణలేశ పరీక్షకుఁడగు నావిష్ణువు ముక్తి నొసఁగును. అంతియేకాదు పురుషోత్తమ యాత్రనాకు లేకపోయెనే యని పరితపించువానికిఁగూడ మహాకారుణికుఁడగు నాహరి ముక్తినిచ్చును. విధివశమున జగన్నాథ ప్రశంస నెత్తి ముచ్చటించినవానికిని నిర్హేతుక బాంధవుఁడగు హరి మోక్షమొసఁగును. అయ్యో! వీరు నాయానతిఁ బాలింపకున్నారు. చెడిపోవుచున్నారే యని వైషమ్యమును నిర్దయతయులేని శ్రీపతి తన్ను సేవింపని వారలకై శోకించును. అహహా! జగత్పతియగు నాపురుషోత్తముని ప్రసాదసంధానచాతుర్యము. ఒండొరులకుఁ గలియకయైనను లేని వివిధ వర్ణములవారి నైక్యమొనరించుచున్నది! ఏమి! ఆక్షేత్రమందలి మృత్తికాసారము! అది దేహమున సోకినంతనే మహాదరిద్రులు ధనాఢ్యులగుదురు. కుచేలురును సచేలురును గుభూషులును నగు వారలు స్వర్ణాంబరులును గిరీటాది మహాభూషణభూషితులును నగుదురు. అట్టి జగన్నాథ మాహాత్మ్యమును జెప్ప నేరికగును? లయకాలాంతకునకే కాదు మఱి యెవ్వరికిఁ గూడ జెప్పశక్యముకాదు. ఇట్లు సర్వవిధములు సమృద్ధమై యున్న పురుషోత్తమపురమునందుఁ బరాశరాత్మజుఁడు సర్వతీర్థములను సేవించెను. అంతనంతేవాసులతోడఁ గూడి యాతపోధన శిఖామణి తాపసతపోఫలుఁడును, నవ్యయుఁడును, నాదిమధ్యాంతరహితుఁడును, మేఘశ్యాముఁడును, జలజాక్షుఁడును, దయార్ద్రనయనుఁడును, శాంతుఁడును,ప్రసన్నవదనాంబుజుఁడును, కౌస్తుభ విరాజితుఁడును, శంఖచక్రగదాధరుఁడును, సర్వాలంకారసంయుక్తుఁడును, వనమాలావిభూషితుఁడును, పీతాంబరధరుఁడును, ధ్యేయుఁడును, నార్తాభయప్రదుఁడును, పన్నగాధీశశయనుఁడును, పన్నగాశనవాహనుఁడును, నారాయణుఁడును, మహాత్ముఁడును, నిత్యానందుఁడును

సనామయుఁడును, పురాణపురుషుఁడును, విష్ణుఁడును, సర్వదేవమయుఁడును; శివుఁడును, సర్వాత్మకుఁడును, వేదవేద్యుఁడును, పతితపావనుఁడును, కళ్యాణగుణసంపన్నుఁడును, దారుబ్రహ్మసనాతనుఁడును, స్వభక్తాత్మప్రదుఁడును, సుభద్రాబలభద్రాసహితుఁడును, యోగిసేవితుఁడును, సనాథనాథుఁడును, నీలాద్రినాథుఁడును, దేవనాథుఁడును, రమానాథుఁడును నగు జగన్నాథుని మునినాథుఁడును, కన్నులకఱవుదీఱఁ గాంచెను. అంతఁ బట్టరానిసంతసముచే దేహమునఁ బులకాంకురములు వొడమభక్తితో మరలమరల మ్రొక్కుచు నిట్లని నుతియించెను:—

కరుణాసాగరా! నీకు కేలుమోడ్పు! దీనబాంధవా! నీకు మ్రొక్కు! పుండరీకాక్ష నీకు వందనము! పురుషోత్తమా! నీకు నమస్కారము! జగదాధారా! నీకుఁ జేమోడ్పు! ధరణీధరా! నీకు దండము! భక్తమందారా! నీకు భజన! పావనాకారా! నీకు మోడుపు! పాపసంహార! నీకు పావన! పుణ్యచారిత్రా! నీకు కేకిసలు! నీవొక్కఁడవయ్యును నీటికుండలందు సూర్యుఁడు బహురూపుఁడై కాన్పించునటుల భూతములందు బహురూపుఁడవై కాన్పించుచున్నవాఁడవు. గాలిచేఁ దూలెడి దూదివలె నీప్రేరణచే నిది యెల్లఁ జలించుచున్నది. ప్రభూ! నీవు చిదాత్మకుఁడవు గాన మఱియొక ప్రభను గోరుట నీకు వలదు! అట్టికోరిక నీకెంతయు దవ్వు సుమీ! నామరూపాత్మకమగు నీజగత్తెల్ల నీప్రభచేఁ బ్రకాశించుచున్నది. నీమాయచే మోహితుఁడగు వాఁడెవ్వఁడు నీతత్త్వము నెఱుఁగును? ఆహా! నీవొక్కఁడవు; సర్వమవు; రూపివి; యరూపుఁడవు; సూక్ష్ముఁడవు; స్థూలుఁడవు; గుణమవు; గుణివి. అద్భుతములైన ధర్మములు పెక్కులు నీయందుఁ బ్రయుక్తములైయున్న యవి. ఇట్టిట్టని నిన్నుఁ గొలఁది యెఱుఁగుటకుఁ బ్రాజ్ఞుఁడగు వాఁడెవ్వఁడు గలఁడు నీవీ జగమును బ్రహ్మవై సృజియింతువు; విష్ణుఁడవై రక్షింతువు;

శివుఁడవై సంహరించుచుందువు; నీవొక్కఁడవయ్యును సత్త్వాదిగుణభిన్నము లయిన మూర్తి భేదములచేత మూఁడు దెఱఁగులుగాఁ జూడఁబడుదువు. చిదాత్మకులగువారలు భేదమోహములను బురస్కరించుకొని నిన్నాయిరువుర (శివబ్రహ్మల) కంటెనన్యునిగాఁ దలఁతురు. వారి కుత్తమమగు నీభక్తి యెక్కడిది ? మఱికొందఱు మూఢులు నీయవతార విగ్రహములకు గొన్నిటిని జూచి మత్స్యము మొదలగునవిగా బుద్ధిగొని యట్లు పలుకుదురు కాని ప్రభూ! నీవు కాని వస్తు వెక్కడిది ? వాక్కుల కగోచరుఁడవగు నిన్ను నుతియింప మొదలిడిన నాసాహసమును సహింపుము ! దేవా! లోకముకు ముక్త్యుపాయము నీవు దక్క మఱొకఁడు లేఁడు. ఇట్లు సత్యవతీ సుతుఁడు శిష్యులతోఁడఁ ద్రిలోకైకస్యనిస్తుతియించి యా దేవుని పాదతీర్థమును సేవించి కృతార్థుఁడయ్యెను.

ఇది స్కాందపురాణమునందలి శ్రీమద్రుద్రమున పురుషోత్తమ వర్ణనమనునది ద్వితీయాధ్యాయము

---

తృతీయాధ్యాయము

—§ వ్యాసుఁడు శ్రీకూర్మసింహాచల శ్రీకాకుళ క్షేత్రములను దర్శించుట. §—

సూతుఁడు శౌనకాదిమునులతో నిట్లనియెను:— తాపసులారా! అంత నామహనీయుఁ డనఘుడగు శ్రీకూర్మమునకుఁ బోయి శ్రీకూర్మనాయక దేవుని సేవించెను. సంఫుల్లహల్లకోదారమాలికా వనమాలియగు నా దేవుని ప్రసాదమహామహనీంద్రునకుఁ గలిగిన కాశీవిరహ సంతాపమును శాంతింపఁ జేసినది. అంత దేవతాముని గణసేవితమై, గంగాసదృశపుణ్యజలధారనూ పవితంబకమై, సర్వపాపవినాశనమై, కుం

దచందనమంగార చాంపేయాదివనాకులమై, లక్ష్మీవిద్యుల్లతాయుక్త భగవన్నీరదాశ్రయమై, సర్వసిద్ధికరమై, నిత్యోత్సవసమన్వితమై, గగనచుంబిశిఖరమై, సర్వశైలోత్తమమైయున్న సింహాచలమునకుఁ జనియెను. అందు భక్తోక్తకారియు, నార్తత్రాణపరాయణుఁడును, దయానిధియు, జగద్వంద్యుఁడును నగు శ్రీనృసింహదేవునిఁగాంచి భక్తిసమన్వితుఁడగుచు మ్రొక్కి నుతియించెను. ఆ దేవుని ప్రసాదమగు చందనమును గైకొని గాలవరాయణుఁడు కాశిఁ బాసివచ్చిన కష్టమును గడముట్టించుకొనియెను. అంత మునినాథుఁ డటనుండి కదలి నిటశిష్యులతోడఁ ద్రిలింగోత్కళదేశములకు సంధియగు వింధ్యాచలమునకును భీమమండలమునకును దాపుననున్న పీఠాపురముఁ బ్రవేశించెను. ఆపురోత్తమము నసుపుండాన్వితాఖండ క్రోశీమండలమునకు మండనమై నానా సమృద్ధిసంపన్నమై కేదారకుంభకోణాది పుణ్యక్షేత్ర సమమైయున్న యుత్తమక్షేత్రము. ఆనగరమున దేవతలు మున్నాట యజ్ఞవిధి మూర్తిభేదములతో నుండి సాధకులకు సకలఫలసిద్ధిని సమకూర్చుచుందురు. పీఠాంబాసతియగు దుర్గ సదానందాపరతయై యాపురము నేతనాయుధములను ధరించియుండును. క్షేత్రపాలకుఁడు దెసమొలతో విశాలోత్తుంగముగు బహిర్ద్వారమున నుండును. మఱియు నాపురమున మేటియుత్తమయగు గొంతితో మాధవుఁడు మోదమందుచుండును. ఏలానది తనతీరద్వయభూములందలి సస్యములను జక్కఁగా ఫలింపఁ జేయుచు వసుధాసుందరికి ముత్యాలహారవల్లివలె నాపత్తనము చెంతనె సంతతమును బాఱుచుండును. బ్రహ్మనదులకు భోగమునకై దక్షిణమునందీ యేలానదిని, మోక్షమునకై యుత్తరమున గంగానదిని మాత్రమే సృజియించెను. నాగరమి కనినం పోవచ్చును. గాని యూయేలేటిమాత్ర మడుగంటక లోకుల కుపకరింప సస్యములకు సదా సలిలమొసఁగు చుండును. అందుఁ బ్రాణులను హింసించు మకరాది

క్రూరజలజంతువు లుండవు సరియేకదా జనులుదాఁటి పోవ నౌకాప్ర
యత్నమును నక్కఱలేదు. అందెప్పుడును మధురోదకమే కాని లవ
ణోదకముండదు. ఆహా! ఈయేలేటికిఁ బెఱయేఱులెట్లు జతపడఁగలవు?
విమలక పాఱుచుండెడి యీయేలేటి నీటిలోఁ దొలుకారుమలుకాగు
లు సెందమునుజక్కఁగాఁ బండుచుండును. పరిశుద్ధసువర్ణకణములను బరి
హసించుసూక్ష్మతర ధాన్యరాసు లచ్చటఁ బర్వతోపములై యుం
డును, ఆయాపగాతీరగ్రామములను బుణ్యాత్ముక్షత్రియులు పాలించుచుం
డురు. అనేకబ్రాహ్మణాధారయగు నాతటినీ తీరభూమి వృత్తిక్షేత్ర
ములతోడను, నిష్ఫలములతోడను విరాజిల్లుచుండును. రాజపాలనముచే
గోదావరీమధ్యదేశ సమానమైన యీయేలానది యాకాశగంగయే;
పీఠికాపురమే స్వర్గమే; యందలివారలు దేవతుల్యులే, వారాంగనలు
సురాంగనలే: వీటికి నలుకెలకుల నలరారు సస్యములు నందనోద్యానతు
ల్యములే. అందుఁదములపాకశీవియ అల్లిబిల్లిగనల్లుకొనిన పోఁకమ్రా
కులు, జాజీకేతకి చంపకములు, నారికేళములు, పనసలు, నారంగములు,
నాగకేసరములు, కాంచనములు, వకుళములు సహకారములు, కర్ణికార
ములు, కురంటకీములు కృతమాలములు, కంకాళములు, తమాలములు,
సర్జకములు, నటములు, తాళములు, కపిత్థములశ్వత్థములు కదంబములు,
దేవదారువులు, జంబీరములు, తిలకములు, సాలములు, కదళులు, తుంబర
ములు, పిచుమందము, లామలకములు, కుందములు, ద్రాక్షలితులువులు,
తింత్రిణులు, కురవకములు, జంబువులు, మేరువులు మొదలగు వృక్ష
ములు లెక్కకుమిక్కిలి పూలతోడను బండ్లతోడను నిండియుండెను.
మఱియు నవ్వీట,గంధ చేను మొదలగు వానితోఁ గూడియుండినకూర
తోఁటలును, రాజులతోడను గలువలతోడను బల్లగలువల తోడను
జెన్నొందు చెఱువులును దేవళములతోఁ గూడినదిగ్గియలును, సత్రములు
ను, గల్వలును మొదలగుఁ బాలిగ్రామ పాకిమొదవులును, దశలిచదువు

గ్రామునసమీపమునకు వచ్చుచుండెను. ఆ మౌనీంద్రుఁడు వింధ్యాద్రి గర్వమును స్తంభింపఁజేసిన విచక్షణుఁడు; కలఁగ బాఱిన జలపూరమునకుఁ గతకఫలమైనవాఁడు; శివుఁడే యాతపోధనున కోంకారయుతమగు పంచాక్షరి మహామంత్ర ముపదేశించెను: జలరాశి జీవసమాతని హస్తమునఁ జుళుకభూతమయ్యెను; ఆతాపస శ్రేష్ఠునకు మలయపర్వత మహాయే గేహము: అతఁడు తామ్రపర్ణీజలముఁ గ్రోలికొనినవాఁడు; తపసాగ్రమణి యగుత సచ్చరిత ద్వీపోద్భవుఁడగు వ్యాసుఁడు సమస్తక్రియలు నిర్వర్తించుకొని ప్రాతఃకాలమున దక్షవాటీ యాత్రోద్యుక్తుఁ డగుచు నోంకారపురము (ఓదూరు) గనుకనుబోవు దారినిబట్టి భార్యయగు లోపాముద్రను వెంటనిడుకొని వచ్చుచుండిన మునివర్యునిఁ గొంతదవ్వుననె కనుఁగొనియెను. ఆయగస్త్యుఁడును భీమమండలమునందలి ద్వాదశక్షేత్ర తీర్థయాత్రార్థము చరియించి కుక్కుటేశ్వరుని దర్శింపఁ బీఠికాపురమునకుఁ బోవుచుండెను. అట్లు ప్రాతఃకాలమున దక్షవాటియ పట్టణమునందు శ్రీ భీమేశ్వరుని నిలిపి జపించి సాయంత్రసమయమునకును, దీర్ఘోదకములందు మునిఁగి పీఠాపురి కుక్కుటేశస్థానమునకు కాలముతోఁ బోవుచుండిన మహామహేశ్వరునిఁ దుల్యభాగా నదీప్రాంతమునందలి మహేశభవనాంగణమునఁ దపోధన శిఖామణియగు వ్యాసుఁడు గాంచి ప్రత్యుత్థానముచేసి యెదుర్కొనియెను. ఆకలశోద్భవుఁడును భస్మత్రిపుండ్రాంకిత ఫాలదేశుండై సువర్చసుఁడై రుద్రాక్షమాలికా చాలితకరుఁడై, దండధారియై, కృష్ణాజినోత్తరాసంగుఁడై, బాలార్కరుచి జటాధరుఁడై, ప్రావృషేణ్యాంబుదశ్యాముఁడై, దర్భహస్తాంగుళీయకుఁడై, పాలాశవీరుహప్రాంశు చారుదేహుఁడై, భాగవతాగ్రగణ్యుఁడై, బ్రహ్మవ్రతుఁడై, వీరమాహేశ్వరాచారవిధిజ్ఞుఁడై, సత్యుఁడై, సమస్త నీవారముష్టియై, పంచశిఖామణియై యున్న ద్వీపోద్భవుఁడు (వ్యాసుఁడు) వచ్చుచుండుటను

గాంచెను. అంతనాపురుషశ్రేష్ఠు లిరువురును నొకరినొకరు జూచుకొను టవలనఁ గలిగిన మనః సంతోషభారము భరింపలేకపోయిరి. అప్పుడు వారు నిరాఘాటమును నిర్దంభమునునగు స్నేహసంపదచేఁ బరస్పరము మహాబాహువులతో బిగియారఁ గౌఁగిలించుకొనిరి. ఆనంతరము నొకరి నొకరు కుశలప్రశ్నములు చేసికొనిరి. పిమ్మట వ్యాసశిష్యులు వైశంపాయనాదులు ససంభ్రమముగ భక్తిసౌహార్ద వినయములు గలిగి యగస్త్యునకు నమస్కరించిరి. అంత మహాత్ములగు నాద్వైపాయన ఘటోద్భవులిరువురును దుల్యభాగాతీరమందలి బిల్వారణ్యమధ్యమమున నొక చంద్రకాంత శిలాతలమునఁ గూర్చుండియుండి ప్రియసల్లాపములతోఁ గొంత ప్రొద్దుపుచ్చిరి.

ఇది స్కాందపురాణమునఁ గాశీఖండమున నైదవ యధ్యాయము.

---

## షష్ఠమాధ్యాయము

—◆అగస్త్యుఁడు వ్యాసునకుఁ గాశీ భాసించిన కారణమును దెల్పుట.◆—

సూతుఁడు శౌనకాదిమునుల కిట్లు చెప్పఁ దొడఁగెను:—

అంత వాతాపిదమనుఁడు పరాశరతనూభవుని విలోకించి చెలిమిచే నిట్లనియెను:—వ్యాసా! ఏమిది! మానసవ్యథచే నీమోమున విన్నదనమును, నేత్రముల దైన్యమును జూపట్టుచున్నవి. నాకిదియెల్లను దాఁచక చెప్పవలయును! వారణాశియందు లోలార్కునితో నీకేమియును వాగ్వాదము కలుగదు కదా! కోపముచే ఢుంఢివిఘ్నేశ్వరుఁడు నిన్నేమియు ధిక్కరింపఁడుకదా! ఆఁకలిగొన్నపుడు విశాలాక్షిచే నీవేమియు వంచింపఁబడ లేదుగదా! వ్యర్థముగా నీయెడను భైరవుఁడేమియు ననుచిత మొనర్పలేదుగదా! ఆమిన్నేటి యిసుకతిన్నియల నెట్లు

విడనాడఁ గలిగితివి! పరమస్థానమైన యాత్రక్రోశపంచకము నెట్లుపరిత్య జింపఁ గలిగితివి! ప్రాప్యమగునా యవిముక్త వసుంధర నెట్లువదలనేర్చి తివి! సత్పురుషధనంబగు నావిశ్వేశ్వరుని నెట్లువిడిచి వచ్చితివి! బాదరా యణ! దినదినమును దివ్యర్షిగణము విశ్వేశుని సేవింపముక్తిమంటపము నకు వచ్చుచుండునుగదా! ప్రతివాసరమును నచ్చటమహోత్సవములు ప్రవర్తిల్లుచుండునుగదా! ఆపాతాళగభీరయగు నాకాశగంగకు శుభంబే గదా! అచ్చటివారలు మా లోపాముద్రయిడిన యోటతోటల యందలి మల్లెపూవుల నీశపూజకై కల్పింతురు గదా! పుణ్యజీవనయు, సర్వలోకైక పావనియునగు నాగంగానదిని, నాత్రివేణీరశనమును, నా బాహ్యకక్ష్యాస్థలమును, నామధ్యాంతరకక్ష్యలను, భగవంతుండై, భక్తశేవధియై,జ్యోతిర్లింగ విగ్రహుండైయున్న యావిశ్వేశ్వరస్వామినిఁ దలంచినంతనే యాకాశీపత్తనమెల్లనాకిపుడుకన్నులకుఁ గట్టినట్లున్నది. ఓసువ్రత! ఆనందకాననమునఁ జంద్రికాదీపములచే నలరారుచుండెడి యినుకదిన్నెలపై నడుగేయు కాశికాపత్తనాధీశుఁడును గళానిధిశిఖా మణియు నగు విశ్వేశ్వర ప్రభుని గూర్చి పాడుచుఁ బులకాంకురసం దోహాభూషాలంకృత విగ్రహుఁడనై యాదిత్యసదిత్తునందు నిత్యమత్యం తప్రీతితో నృత్య మొనర్చెడివాఁడను. ఆకాశికా నగరప్రాంత జగతీ హారవల్లికయు, నశేషలోక విఖ్యాతనానాసింధుమతల్లికయు, రాజశే ఖరచూడాగ్రమల్లికాపుష్పమాలికయు, యోగీంద్ర విమలస్వాంతప ద్మాకర మరాళికయు, ముక్తిలీలావతీ ముక్తసౌధసోపాన పాళికయు, నజ్ఞానతిమిరవ్రాత చంద్రికయుఁ బుణ్యపేటికయు, నుజ్జ్వలస్వ సౌభాగ్య జనికాసుర దీర్ఘికయు, మృకండకన్యకయు నగు గంగ మాకు మంగళ మొసఁగుఁగాత! మహాధన్యుఁడగు కుంభసంభవుఁడు భక్త్యావేశముచే నిట్లువర్ణించివర్ణించివ్యాసునిహస్తమును దనహస్తమునఁబట్టుకొని యిట్లు నియెను:—వ్యాసా! నేనిప్పుడు భక్త్యావేశమునఁ బారవశ్యమునఁ బ్రసం

గముచే నిన్నుఁజూచి మాట్లాడఁదగినవిషయమెల్లనతకరించితిని. ఓసత్య వతీపుత్ర! నీ కీర్తిని సంప్రాప్తమైన తెలుఁగెల్ల నెఱిఁగింపుము ! నేనును మునిసేవితమును గంగాయమునలకు సంగమమును నైన ప్రయాగ యందు నంగుష్ఠమాత్రమేనేల మోపి నిశ్చలుఁడనై యోగీశ్వర ధ్యేయుఁడును, సదాశివుఁడును నగు విశ్వనాథుని ధ్యానించుచు ఘోర తపమొనరించితిని. అంతఁగృపానిధియగు నావిశ్వేశుని ప్రసాదముచే శక్తిమంతుఁడనై ముక్తిభూమియందు సుఖంబుంటిని. అంతలోనాత్మ వంచకములగు సముద్రపానాది వినోదములచే లోకముల కెఱుకయగుట వలన దైవప్రేరితుఁడనై వింధ్యకారణముగాఁ గాశినిఁ బాయవలసి వచ్చెను. నేనెల్లప్పుడును నైవల్యరాశియగు శ్రీకాశికాపురముననే నివ సింపవలయునని నిచ్చగించితిని; గాని పలువురు దులకు విఘ్నపఱచిరి. పర మధర్మజ్ఞ! నిచటనుండి కదలిరా నీకెబుద్ధియెట్లు పొడమినది! అనికుంభ జుఁడడుగఁగా వ్యాసుఁడు కాశీవిరహకారణము నిట్లు చెప్పనారంభిం చెను :— కుంభజా! కాశివిడచి వచ్చినకారణమును వివరింపుచున్నాఁడ మవినుము! నేనుతీర్థయాత్రాపరుఁడనై శమదమాన్వితులును, సాధువు లును నగు జైమిని పైలాదిశిష్యుల తోడ భూమండలమెల్లను గ్రుమ్మరి క్రుమ్మరి బహుతీర్థములను గాంచితిని. మహాత్మకా! నేనంత భయభక్తి యుతాత్ములగు నాశిష్యసంఘముతోడఁ బుణ్యరాశియగు కాశికా పురముఁ బ్రవేశించితిని. మేము ప్రవేశించిన ముహూర్తమెట్టిదో కాని యాసర్వేశపత్తనమున మేమెల్లర మేకుదినము లుపవాసార్తు లమై మిక్కిలి చింతిలితిమి. ఆదినములలో మేమెల్లరమునుగూడి యిల్లిల్లు దిరిగి తిరిగి "భిక్షాం దేహి" బిచ్చముపెట్టుఁడని యాచించు నపుడ దేమి చిత్రమోకాని యొక కడియన్నమైనను దొరకకుండవల యునా! శ్రీవిశ్వేశ్వర కారుణ్యమునకు విషయమై, దివోదాస మహా రాజ బాహుబల రక్షితమై, ధనధాన్యాయురారోగ్య ప్రజా పశ్వాది

తుందిలమై, నిత్యాన్నదానసంపన్నబ్రాహ్మణమందిరసంకులమై, నిత్యో
త్సవస్థిరతరమైయున్న కాశికాపురమున భిక్ష దొరకకుండుట
యద్భుతముకాదే! కలశోద్భవా! అంత నేనేమి చెప్పుదును!
సైపరాని యాఁకటిచిచ్చుచే వైశంపాయనుఁడు సుడివడియెను. సుమం
తుఁడు వాడు వాఱెను; పైలుఁడు పరితపించెను; జైమిని క్లేశపడి
యెను; దేవలుఁడు పరివేదించెను; దాల్భ్యుఁడు దిక్కులు చూడఁ
దొడఁగెను. అగస్త్యమునీంద్రా! అట్లా కాశికాపురమునం దెన్ని
విప్రగృహములున్నను భిక్షాలబ్ధి లేకుండుటచే క్షుధాతురులమై యేడు
నాళ్ళు గంగాతీరమున నిష్కారణముగా శుష్కోపవాస మొనర్చితిమి.
అంత నష్టమదినమునఁ బ్రాతఃకాలమునందు మిన్నేటి యిసుకతిన్నె
లందు మేము పండుకొనియుండిన కుశశయ్యలనుండి మేల్కాంచి
యనుష్ఠానతత్పరులమగుచుఁ గొంచెము ప్రొద్దుపొడువ మణికర్ణికకుఁ
బోయి యఘమర్షణస్నాన మాచరించితిమి; వాలుకాలింగసంతతికి
వందన మొనర్చితిమి. పీఠార్చనాశంభులింగశ్రేణికిఁ జేమోడ్చితిమి.
పంచబ్రహ్మపంచాక్షరాదికము లగు మంత్రోత్తమములను జపియించి
తిమి. నానాసిద్ధమునివ్రాతసాంద్రమైయున్న ఘంటాపథమునకుఁ
బోయి యంతర్గృహవీథిని బహిర్గేహమును దాఁటి లోలార్కునకును,
భైరవునకును, ఢుంఢివినాయకునకును, విశాలాక్షీప్రముఖదేవతాకోటి
కిని భక్తితోఁ గ్రమక్రమముగ నమస్కరించుచుఁ బోయి విరూపాక్షుఁ
డును మోక్షలక్ష్మీప్రదాతయు, భక్తాభీష్టప్రదుఁడును, భక్తాపధ్వాంత
భాస్కరుఁడును, తారకోపదేష్టయు, సర్వజ్ఞుఁడును, సర్వకారణుఁడును
నగు విశ్వేశ్వరుని సంప్రదక్షిణసాష్టాంగదండప్రణతిపూర్వకముగా
సేవించి ముక్తిమంటపమున నుంటిమి. అంత మధ్యాహ్నసమయము
కాఁగా మేమెల్లర మెప్పటియట్ల భిక్షాపాత్రములను గరములను
గైకొని పోవునప్పుడు పిచ్చుపెరుఁగు మా యాఁకటిచిచ్చునకుఁ జండ

మార్తాండతీవ్రాంశుకాండము నెచ్చెలియై మమ్మెంత వేధించినదని చెప్పుదును. ఏవిప్రునింటికిఁబోయినను లేదు లేదు! నమవుండు! నడువుండు! పొండు! పొండు! కూడదు! కూడదనెడి పలుకులు ములుకులై చెవిసోఁకెడివి. అట్లు ప్రతివిప్రగృహమునకును బోయిపోయి యాచించి యాచించి విభ్రాంతి చెందితిమి; కోపించితిమి; బడలితిమి; అడలితిమి; శోషిల్లితిమి. అట్లు కాఁగా క్షుధార్తిచే నాహృదయమునం దెంతయో కోప ముప్పతిల్లినది. అత్తఱిఁగుఁ బెరుఁగు క్రోధాంధకారముచేఁ ద్రుళ్లిపడుచు నేమియుఁ జూడకయే యొక ఎక శిష్యులు గడగడ వడఁక భిక్షాపాత్రము వ్రయ్యలుగా నొక పాషాణముపైఁ బటుకునఁ బడవైచితిని. అట్లు వైచిన నాకుఁ గ్రోధావేశమున నుదుటఁ జెమట పట్టెను; కటముకంపించినవి; బొమముడి వంకర వోయినవి. ఓలోపాముద్రాహృదీశ్వరా! అప్పుడు నేనేమని చెప్పుదును! బుద్ధినాశమునకుఁ గాఁబోలు నామది నెన్నఁడును లేని నైచ్యము పొడమినది. అప్పుడు మోక్షదాయకుఁడు విశ్వనాథుఁడని విచారింతునా! హిమాచలశిఖరోద్భవ గంగయని తాంతునా! ఢుంఢీముందూకజఠరుఁడు వినాయకుఁడని వీక్షింతునా! ప్రీడాశూన్యకటియని కాలభైరవునిఁ గనుఁగొందునా! సకలకళ్యాణకరవల్యమయ్యు నాకాశికాపురమున నెంత యత్నించినను గడి యన్నమైనను దొరకకున్నపుడు చర్చతో నేమిపనియని నపిఁయుంపఁబూని కమండలువు నిండియుండిన గంగాజలములను గైకొంటిని. అత్తరి తపోధనులగు శిష్యులు లలాటమున నంజలులుఘటించి "మునీంద్రా! క్రోధ ముపసంహరింపుమ"ని నాకెంతయో బోధించిరి; కాని ధర్మజ్ఞులైన వారెంత తెలుపుచున్నను నోరిమిలేమిచే మాపలుకికి కరము శాపజలములను గైకొనియే యుంటిని. పదునైనములు నిట్లుపాసముండుటవలనఁ గలిగిన తీవ్ర దుఃఖముచే నట్లు గర్వించి కుశపవిత్రముచే నొప్పు హస్తముతో భాగీరథీ

జలముల నందుకొనియుండి దుర్వారకోపకలుషీకృతమగు మానసముతో విచారణావిదూరుండనై యిట్లు శపియింప నుపక్రమించితిని:—

"మాభూత్త్రిపురుషీ విద్యా మాభూత్త్రిపురుషం ధనమ్।
మాభూత్త్రిపురుషీ భక్తిః కాశ్యాం నివసతాం సతామ్॥

కాశికాపురమునఁ గాపురముండు బుధులకు మూఁడుతరముల వఱకును విద్యయు, ధనమును, భక్తియు నుండకుండుఁగాక! యని శపియింపంబూనఁగాఁ జెప్ప నేమియున్నది! చంచలించు నాకరము శాపజలములను వహియింపలేక పోయినది.

ఇది స్కాంద పురాణమునందలి భీమఖండమున
పంచమాధ్యాయము.

---

## షష్ఠాధ్యాయము

—శ్రీఅన్నపూర్ణ యేడుదినములు శిష్యులతో నుపవసించిన వ్యాసునకన్నమిడుట—

మునిశ్రేష్ఠా! ఆక్షేత్రమునఁ గాశికానగరమందలి సోమవీథిని భవనాళి యందొకయింట నెఱయుచుండు తలయు, నేఁబదియేండ్ల ప్రాయమునుగల యొకసతీమతల్లిని సందర్శించితిని. [illegible] యో సౌందర్యమునింపారుచున్నది. అంత నా వెడఁదకంటి యుంకటనకనక లాడు సన్నగాంచి కంకణములు మెఱయుచుండ నింటితలుపు తెఱచి యంగుళీభూషణములతోఁడను ఘల్లుఘల్లని మ్రోయు సందియలతోఁడను నింపుసొంపారెడు యడుగుగెందామర గడపముందరనిడి వీణాక్వాణానుకారియగు సుస్వరమున «ఓవిప్రోత్తమా! శాప ముపసంహరించి యిటురమ్మ"ని పిలిచెను. ఆమాట చెవినిబడినంతనే సంతసమున నాశాప

జలమున నానలఁ బొఅజల్లి భక్తిపూరితమానసుఁడనగుచు నామె చెంతకుఁ జేరితిని. ఆమెకులమును గాని నామమునుగాని శీలమునుగాని తలపెట్టకయే వేదోపనిషద్వేద్యయు, శుభాకారయు, వరాననయు, నితాంతకరుణాపూర్ణవీక్షణయుఁ, బుణ్యలక్షణయు, వృద్ధసీమంతినియు, గాశికానగరమధ్యనివాసినియునగు నామెను విశ్వనాథశుద్ధాంతముగా మనసారభావించి మ్రొక్కితిని. పరులయాధిక్యమును బరీక్షించుటయందు మనస్సే సమర్థమైనదిగదా! అంత నావృద్ధసీమంతిని మంజుభాషిణియై చెంతనున్న నన్ను వీక్షించి యిట్లనియెను:—ఈ కాశియందు భిక్ష పుట్టలేదని కోపింపవలదు! నీమనశ్శుద్ధిని దెలియఁగోరి విశ్వనాథుఁ డిట్లు వెడఁగుపడఁజేసెను; గాని కాశికాపురమునఁ గూటికిఁ గఱవా! ఈ వారణాశియందు మధ్యాహ్నసమయమున బంగరుగొడ్డుతో నమృత పాయసము నన్నపూర్ణాదేవి యతిథులకుఁ బెట్టుచుండుననుమాట నీచెవిని బడలేదే! ఓ తాపసపుంగవా! పదునదినములన్నము దొరకకుండినంత మాత్రముచే బడలియుడలుచున్నవాఁడవే! తీవ్రకోపమున నీ ధైర్యవివేకములు ధ్వంసమైపోయెనే! శివభార్యయగు కాశిని హుంకరింపఁ జూచితివి? అయ్యో! మునికులోత్తంస! బాలచంద్రశిఖామణికిఁ బ్రియభోగపురంధ్రియగు నీనగరోత్తమము నీకింత కినుకయా! ఇట్లగుటయు సత్యమే! "ఆఁకొన్నవాఁడే పాపము చేయఁడ"ను నీతివాక్యము కేవలమైనదా! అట్లయ్యును గాశిపై నీకుఁ గోపింపఁజనదు. ఇంతకు నింతగా నిందుమౌళికి నీపై నెంతకోపము జనియించునో! విప్రుఁడవౌటచే నిందుకైనను నీ నేరమెంచరాదు! పలుమాటలేల! భిక్షకైకొన రమ్మ"ని కారుణ్యాయత్తచిత్తయగుచు నావృద్ధకామిని యనినంతనే శిష్యులతోడ క్షుధార్తుఁడనై యున్న నేనిట్లంటిని:—"అమ్మా! ఎంత కాలమున కీనగరమున హృదయోల్లాసకారణమును, సుధారసస్రావమును నగు వాక్యమెట్లో వినఁగలిగితిని. తల్లీ! మీ నిలయమునకు

భిక్షుకై నేనొక్కఁడనే రావలయునో! శిష్యులందఱతోఁ రావలయునో యేర్పరింపుము! అమ్మా! ఎట్లయినను నీవు పెట్టిన భిక్షమును క్షుధాతురులమగు మేమెల్లరమును బంచుకొని తిని ప్రాణములు నిలుపుకొందుము! వీరందఱవి మాత్రము ప్రాణములు కావే! నావియేనా ప్రాణములు. కాన వీరల నందఱను నిచ్చటనే విడనాడి యొక్క నేనొక్కఁడనే మీ యింటికిఁ జేరఁగలనా!" యని యనుటయు నాచంద్రవదన మంగళ స్మితసమ్ముఖయగుచు నాతో నిట్లనియెను:—"ఓసువ్రతా! శిష్యసందోహ సహితుండవై శీఘ్రముగా గంగాతరంగిణియందు మధ్యాహ్నస్నానమొనర్చి రమ్ము! ఇంతలో నేనీ యంతర్గృహమున కరిగినసమగ్రముగాభోజనము కల్పించిమీకందఱకు భూరిభోజనములిడి సంతృప్తిగావించెదను. పాపము! పదునాళ్ళనుండి యొక కడియన్నమైనను దొరకక యాఁకటిచేఁ బీడింపఁబడుచున్నారు. నేఁడీ మందిరమున మీరెల్లరును గడుపార భుజింపనిచ్చవచ్చిన యన్నమును సంపూర్ణముగాఁ గల్పింతున"ని నంతనే మేమెల్లరమును బట్టరాని సంతసమున "నమ్మా! అట్లేకానిమ్మ"ని వేగిరమేగి గంగానదిలో స్నాన మొనర్చి వేదములను బఠించుచు మరల నామె యింటికి వచ్చి సున్నము వేసిన జోడగుగులపై మొదట నేనుఁ గూర్చుండి యుండఁగా మునిగ్నాలు శిష్యులును గూర్చుండిరి. అంత లోన నుండి వచ్చుచుఁ బోవుచు నుండెడి మచ్చెకంటులకుఁ జెప్పఁగా వారలు మా యాగమన మాదేవికి విన్నవింపఁగా సకలాతిథి పత్నియగు నామె తన యంతఃపురమునుండి బంగారు పావలు మెట్టుకొని మెఱుపుదీవియను బురడించు మేని కాంతిగల యొక కొమ్మ తమ్మపడిగను బట్టుకొని కైదండయిడ మాయందఱకునెదుర యాసన్నయైవచ్చి బహుమానపురస్సరముగ బ్రియోక్తుల నిట్లనియెను:—"మహాత్ములారా! రండు! దయచేయుఁడ"ని నమోన్మాదింపఁ జేయుచుఁ జంద్రికాసుందరకౌశేయవితానశోభితమై,

కాలాగరుల సద్ధూమధూపసౌరభ్యసంకులమై, కర్పూర రచితాగంధ రంగవల్లీ విరాజితమై, కస్తూరి చర్చాసురభిచంద్రప్రస్తర కుట్టిమమై, యుత్తమమై,యున్న యొకచతుశ్శాలాభోజనగృహంబునకు మమ్మెల్లరను దోడ్కొనిపోయెను. అంత నాదేవి యాజ్ఞను శిరముల దాల్చి దివ్య పురంధ్రులు మాకెల్లరకును నానాశ్రేణీ కలితారమ్యములగు కనకపీఠిక లిడిరి. అప్పుడా దేవి యానతిబట్టి మేమెల్లరము వృద్ధానుపూర్వకముగా పీఠములపైఁ గూర్చుండి యుండగా వారలు మిగులపొడవులు, సాగ్రములు, మృదువులచ్ఛిద్రములు, నవీనములు నగు నరఁటియాకులు వేసిరి. అత్తఱి నాభిశాలాక్షి పంక్తిపంక్తికి విచ్చేసి గంధపుష్పాక్షతల తోడ నర్చించినది. ప్రయత్నపూర్వకముగాఁ గాలాగరుజధూపముతో ధూపమిడినది. దీపములఁ గర్పూరనీరాజనముల నర్పించినది. ఓవిప్రోత్తములారా! మీరెల్లరును శాంతిపరియింపుడి? చంద్రరేఖాశిఖామణికి భక్తితో నభిషేకింపుఁడి ! ఈయన్నపానములును నీ సకలపదార్థములును నిచ్చవచ్చినటుల మెల్లమెల్లఁగా భుజియించి తనివినొందుఁడీ! శరణుడగు కాశీపురవిశ్వేశుఁడు సాదరముగఁ జేయు నీప్రసంతర్పణమువలనఁ బ్రీతినొందుఁగాక ! యని మంజుభాషిణియై విప్రులుకూర్చుండిన పంక్తిపంక్తికిని దిరుగుచు నా దేవి భక్తివిశ్వాస తాత్పర్యాదరపూర్వకముగా నుర్వీగీర్వాణవర్గమును సంమోదింపఁజేసి యాపోశనములుపోయింపఁ దరుణులను బ్రేరేచెను. ఆయవసరమున నేమును బైలసుమంతుజైమిని వైశంపాయనాదిశిష్యవర్గమును నెమ్మనముల నిట్లు వితర్కింప నారంభించితిమి:—ఏమిది ! వడ్డినవిధమా కానుపింపదు; భక్ష్యాదులవాసనయా బయలుపడదు; పొగయా పొడ చూపదు; భాండసమృద్ధియా కానరాదు; సర్వమును భద్రముగానున్నది. అయ్యో ! ఈదేవియును శుష్కప్రియములాడుచున్నది. నేఁడునుమనకు భోజనము లేకుండుట నిజము. (పటిమమాటలివి !) శారదాబ్జసమవక్త్రయగు నీమెకు మాయ

యొక్కడిది! ఈమెయందు ప్రసాదమార్దవమును మాగ్ధ్యమును, సౌమ్య దృష్టియు వివేకమును, నిర్మలత్వమును, మాధుర్యమును, నుచితజ్ఞతయును గానవచ్చుచున్నవి; కానికల్లయొకింతయేనియును గానిపింపదు. ఇష్టాన్న పూపసూపాజ్య పదార్థములేవియుఁ గాన్పింపకుండుటచే నరఁటియాఁ కును జూచినంతనే కాయముగలతగించెడిది. పాత్రసంశుద్ధికై యుంగ సలాజ్యోపస్తరణము మాత్రముచేసి యట్లైమిన్నకుండిరి. ఇదియేమి మాయయోకానియన్నాదిక మేమియును గానరాకున్నది. శశాంక ఘుటికాకథమనకునిజమైనది. అట్లయ్యును నామె యొనర్చిన కర్మ మమాత్రమూసకొల్పుచునేయున్నది. గంధాక్షతాదుల నిచ్చివిప్రుల నందఱనర్చించినది; శాంతిపాఠము పేక్షించినది; విశ్వేశునకు మ్రొక్కి నది; పక్కతెరలగుఁల దీవనలందినది. అప్పద్మపత్ర నేత్రకవియెల్ల మిథ్యయగునా? అట్లైకానిమ్ము! విషాదమేల! నేఁడునుభోజనములేనిచో నీవాసరమును బూర్వవాసరమువంటిదే యగుఁగాక! యని మానినగ్యులముగు మేమెల్లరమును దలపోసికొనుచు నుండ నంతలో నా దేవి యానతిని తరుణులు నాపోసనములు వడ్డించిరి. ఆపెయు మమ్ము లను గాంచి "ఓవిప్రులారా! లెండు! లెండు! భుజియింపుఁడు! భుజియింపుఁడు! మీకమృతమగుఁగాక! ప్రొద్దుపోయినది" యని ప్రేముడితో వేఁడికొని మ్రొక్కెను. అంత నాదేవి యానతి యిచ్చి నటుల మేమెల్లర మాపోశనం బిడితిమి. అప్పటికైన నామె సామర్థ్య మెట్టిదో కాని చతుర్విధాన్నములును, చెరుకుతెలగులైన మిక్కిలి తియ్యపిండివంటకములును, సహిహృద్యములు, స్నిగ్ధములు, రసవంత ములునైన దివ్యాన్నములును, షడ్రసోపేతములు, రుచిమంతములు నగు వివిధపదార్థములును బాత్రములం దొక్కుమ్మడి పొడచూపెను. అప్పుడాఁకటిచిచ్చు పెచ్చుగొన బ్రాహ్మణోత్తములెల్లరు నిచ్చకొలఁది నానాపాపూప విశేషములను, ఘృతపాయసములను, సదుప్పొంగవణ

ములు మృదులములునగు గుడాన్నములను, హృద్యములగు బహువిధ శాకములును సాపడిరి. ఈవధు నన్నపూర్ణయే కాని మఱెవతియుఁ గాదనుకొని పంచభక్ష్యాన్నములను బరమప్రీతితో భక్షించితిమి. మఱియు సత్తఱి మేమెల్లర మాఁకలితీఱ ద్రాక్షేక్షుపానకములతో ఖండశర్కరా కదళీఫలములతో, హైయంగవీనముతో, గోక్షీరములతో, సూపములతో, మధువులతో, మోదకములతో, జంద్రధవళమగు దధితో నిశ్శంకముగాఁ గడుపార నారగించితిమి. మఱియు నపుడెవ్వఁడే పదార్థము నెంత వాంఛించునో యతనికంత పదార్థము నిటలేటియూఁకున్న నవతరించెడిది. మహాత్మా! అట్టి ప్రభావమెన్నడును జూడఁబోము. అనుగుదాసులెందు రిసనపుటందియలు గల్లుగల్లని మెరయుచుండ, బఱువుపాలిండ్ల బరువుఁ గానసియాడ, లేనెలకు నాటియగు నుదుటఁ బొడమిన చెమట ముత్తియములు సొంపునింప, మోదముపిసఁ జేసచేం గెలుఁగుజాఱువాలు, నీలాలయగు నన్నపూర్ణ కృపాసార సుధాధారాసారనిరీక్షణమై స్వయముగా నమృతాన్నము నిడుచుఁ బతిబంతికిని పిచ్చలవిడిగాఁ బచరించినది. అట్టి భోజనసమయమున నాజ్యధారాప్రవాహప్రతతశర్కరాసైకతాంచితమై పాయసాపూపసంపన్న శాల్యన్నరుచిరాభాసురమై స్వర్ణాభసూపసంపన్నమై, స్వాదువ్యంజనమంజులమై, ద్రాక్షాగోక్షీరపుండ్రేక్షుఖండఖండద్రవవిరాజితమై, నారికేళఫలాస్తోకపాకసాకల్యశోభితమై, రసానళీపానకాదిరసోత్కర్ష విజృంభితమై, శరత్సుధాకరజ్యోత్స్నాస్ఫురద్దధిపరిష్కృతమై యొప్పు భోజనోత్సవము దేవలునకు మోదమొనర్చెను; సూతునకుఁ గౌతుకహేతువయ్యెను; సోమహార్గునకు హర్షము నాపాదించెను. నాయుల్లమున నుల్లాసముగలిగించెను. అంత మే మెల్లరము హస్తములు గడుగుకొని యాచమించియూయ మ్మెనకపనుపున యూసౌధవేదిమీఁద విశ్రమించితిమి. అద్భుతమగు సి

యిచ్చటనే మసలఁ జూతువాయట్టి యీచట్టున నీ మోముపై నొక పెట్టు పెట్టెదను. నీచకర్మ! శ్రీకాశీపురిని నిందింపఁ జూచిన నీ కిప్పుడి ట్టిదండన యెట్టుచాలును" నికోపించి సర్వేశ్వరుఁడు కఠినముగాఁ బల్కెను. నే నాపురాణ దంపతుల యనుగులఁబడి యటనుండి కదలి వేరొక యెడకుఁ బోనున్నయెడ నంబిక నాతో నిట్లనియెను:—"కుమారా! వెఱవకుము! కృపగల్గి పదివేల విధములనైన ప్రాపై యయిన నిన్నెన్నటికిని మఱువను. మత్తేడకును జనుటమాని సుఖముగా శ్రీదక్షవాటికిఁ బోయి ప్రమోదాపూర్ణమానసుఁడ వగుచు శరణాగత వత్సలుఁడగు శ్రీభీమేశుని శరణము వేఁడుము! ఆదేవుని యనుగ్రహమున నీకు సకలాభ్యుదయములును సమకూడును" అని గౌరీయమ్మకమ్మనిమాట విశ్వేశుఁడు కోపించి పలికిన పలుకును వేసఁగిచే వేగుచుండిన దేహముతో నుండిన నాకు సుధావర్షమైనది. అంత నాయంబిక వాక్యములందు గట్టినమ్మకముంచుకొని శిష్యసంఘసమన్వితుఁడనై కాశీకానగరమును వీడి కదలి "ప్రణతక్లేశహారియగు భీమేశు నెన్నఁడు గాంచెదనా! నా మనఃక్లేశమెన్నఁడు శాంతించునా!" యని యుద్విగ్నుఁడగుచు వచ్చుచుండఁగా భాగ్యవశమున మహామహేశ్వరుఁడవగు నిన్నిప్పు డిచ్చటఁ గనుగొంటిని. నిజముగా నాకోరిక కొనసాగినది" ని వ్యాసుఁడు స్వవృత్తాంతము నగస్త్యునకు నివేదించి కన్నీరు కార్చెను. అగస్త్యుఁడును లోపాముద్రయు నట్లు చేసిన పరితాపముచే దుఃఖించుచుండిన మిత్రుని గాంచి కన్నీరు నించిరి. అట్లు వారంతరంగములఁ జనియించిన సంతాపము నెట్టకేలకు శాంతింపఁ జేసికొని మెల్లఁగాఁ గమండలువు నందలి జలముతోఁ గన్నీరు దుడిచికొని నిట్టూర్పులు పుచ్చిరి. అంతఁ గాశీవియోగ క్లేశమునఁ గనలోఁ దులఁదూగెడి కుంభసంభవునితో వేదవ్యాసుఁడిట్టులనియెను:—"సంయమీశ్వరా! నీవును నావలె భాగ్యము

లేమిని గాశీవిరహసంతాపమునఁ గుందితివి. నాకుదారి చెప్పుమయ్యా! మహాత్మా! శంభుఁడా గ్యాధీనుఁడు. దక్షపురీశ్వరుఁడు భీమనాథుఁ డాశ్రయ మొసఁగునా! నేను చేసెడి సేవ యనుగ్రహముతో స్వీకరించునా! ఓకలశోద్భవ! ఆ దేవుఁడు సర్వలోకసంసేవ్యుఁ డగు పరమేశ్వరుఁడుగదా! క్షోణీవతంసభూషణయగు కాశీకానగరిని బాసినకారణమున నాకునునీకుఁ నీకోమలాంగికి నీదుఃఖము సంప్రాప్తమైనది. మునీంద్రా! ముగ్గురినిగూర్చిన ముండ దైవమునకు మోమోటలేదా యేమి! భూతలమునఁ దీర్థరాజమని పేరుగాంచిన సప్తగోదావరము వేసఁగినిసమృద్ధముగా జలముండునా! మహాకాలములందు శివునిఁబూజింప యారామభూములందు పుష్పప్రసూనసామగ్రి సమకూడుచుండునా! నిత్యమాతిథ్యవేళను విప్రకాంత లాఁకలిదీర భిక్షయిడుదురా! కుసుమాస్త్రమహారాజరాజ్యలక్ష్ములగు దేవేంద్రుఁడర్పించిన యప్సరసలు తపోవిఘ్నము చేయకుండురా! కార్యసాధకులకుఁ గాలభైరవవిఘ్నేశ్వర వీరభద్రాదులు స్వాగతము చేయుదురా? ఒక్క వారాణసీ[illegible]దోషమునకై [illegible]సించి క[illegible]చేసి [illegible] ధిక్కరింపఁ గాశికాపురము నుండి వచ్చితిని. నా కాదుఃఖము భీమనాథుఁడు దిక్కై తీర్చునా? నా తల్లి విశ్వనాథకుటుంబిని, యన్నపూర్ణాదేవియే పంపఁగాఁ దనసేవార్థము నచ్చినాఁడను. అందుచే నేచేసిన సేవ మాన్యానుకూలమునన్నుఁ నకు భీమేశమహాప్రభునకు స్వీకరింపదగదా! మహాశైవశిఖామణి! దక్షవాటీపురాధీశుఁడు దయాలక్షితవీక్షచేఁ బ్రసన్నుఁడ నగు నన్ను వీక్షించునా? ఓయిల్వలాసురసంహార! సప్తగోదావరోత్సంగశరణుఁడు శరణాగతుఁడనగు నన్నుఁ జేపట్టునా! ఓవింధ్యమోవరతాత్మకా! సప్త పాతాళవిష్కంభమూలస్తంభము భయాకులుఁడనగు నన్నుఁ బాలించునా? ఓబ్రహ్మవిద్వర! దక్షిణాభ్రితటక్షోణీము డాలు ప్రభు వాశ్రితుడ నగునన్నుఁ గనికరమూని కంటికిఱెప్పవలెఁ గాచునా? ఓవింధ్యాహార్య

మహాపాపహా! హాలాహలానలాహారి దుస్సహమైన నాదు హృదయతాపము హరించునా? ఓకలశసంభవా! మార్తాండ పూజితుఁడు కాశిలోబడ్డమానభంగము మాయించి నన్నుద్ధరించునా? ఓయగస్త్య మహాముని! భుక్తిముక్తి ప్రదాయకుఁడగు శ్రీ భీమనాయకస్వామి నాతలఁపు సఫలముగాఁ జేయునా? యనిపలువిధములఁ జంచల చిత్తముతో నడుగఁ గలశజుఁడు శ్రీ భీమేశ్వర మాహాత్మ్యమును జెప్పఁ దొడఁగెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున సప్తమాధ్యాయము

---

## అష్టమాధ్యాయము

### —• అగస్త్యుఁడు వ్యాసునకు భీమేశ్వరమాహాత్మ్యమును జెప్పుట •—

అగస్త్యుఁడు వ్యాసునితో నిట్లనియెను —ఓమునీంద్రా! నీవు సకలధర్మములు నెఱిఁగినవాఁడవు; సర్వవిద్యలను వృద్ధినొందించినవాఁడవు; పురాణములనేక శాఖాంతామ్నాయమును నిర్మించిన చతురాననుఁడవు. నీకుఁ దెలియనితీర్థ మీభూతలమున నెందున్నది? నీక చింతాభరమేల? భీమేశ్వరమాహాత్మ్యము మాత్రము నీకుఁ దెలియనిదయా? దక్షపురక్షేత్రము జగమునందఖిల [illegible] ప్రసిద్ధముకాదే! నీవు మనోవిషాదముచేఁ దేలియున్నవాఁడవు బలె [illegible]చున్నవాఁడవు. అట్లయ్యును బహుపుణ్యమగు భీమనాథగా[illegible] నాబుద్ధికి గోచరించినంతవట్టు భాషించెదను. ఓమునీ పావన[illegible]త్రమా! నా[illegible]నాగరముంచి యాలింపుము! మోక్షమునకు స్థానమై, [illegible]యునకు భూమియై, సర్వబ్రహ్మపదమై, సర్వస్వర్గమై, త్రిలోకీలోచనా[illegible]దాయియై, భీమ

నాథమహాధామమై యున్న దక్షారామము దక్షిణాబ్ధితటమునఁ దన రారుచున్నది. అందలిసప్తమునిరాట్ప్రీతాప సంప్రాప్త సప్తగోదావరముతో భగీరథుఁడను నొకరాజన్యునిచేఁ దేఁబడిన గంగ యెట్లుపమింపఁజాలును! దక్షబ్రహ్మ మహాయజ్ఞదీక్షకు విఖ్యాతపుణ్యభూమియై, హరిబ్రహ్మేంద్రగీర్వాణమునీంద్రుల కాస్థానమంటపమై, సతీయోగానలోన్మేషమునకు సామిధేనియై, వీరభద్రనిరాఘాటధాటీనటనమునకు రంగభూమియై దివ్యామృతమయోద్దామభీమలింగమునకు నికేతనమై, భోగమోక్షమునకు స్థానమైయున్న దక్షారామ మహాపురము క్షేత్రాధిరాజమని సకలలోకములందు విశ్రుతమై యున్నది. సకలసమృద్ధిచే నాపత్తనమునకు సాటి మఱేదను లేదు. అతులప్రకాశసూర్యప్రతిష్ఠితుఁడును, దేవమౌళిప్రభారాజినీరాజితపదాంబుజుఁడును, సప్తపాతాళవిష్కంభనిర్భేదననిజోద్భవుఁడును, దివ్యామృతస్వయంభూరుజ్జ్యోతిర్లింగమయాకృతియునగుభీమేశ్వరుఁడు భోగమోక్షవితరణవిచక్షణుఁడై యానగరమునధివసించి యున్నవాఁడు. మఱియుఁబండ్రెండుయోజనములు విస్తీర్ణముగలిగిన పుణ్యక్షేత్రము ప్రసన్నుఁడు భక్తవత్సలుఁడు నగు భీమేశ్వరునిచేఁ బరమపావనమయినదియగుటచే భీమమండలమనఁ బడుచున్నది. అదిముక్తిచంద్రికకుఁ జంద్రమండలమై భోగలక్ష్మీవిలాసినికి లీలాసదన పద్మమై యుత్తమములగు కుండలాముఖము, సంవేదము, శార్దూలము మొదలగు శాఖోపశాఖా తీర్థములతోఁ గూడిన దక్షిణసాగరముచేఁ జెన్నారుచున్నది. అందలి సప్తగోదావర తీరమునఁ గ్రీడించెడి గజములముఖమునుండియుఁ, గరములనుండియు జలబిందువులు విడువమార్తాండ మండలముక్లిన్నమగును; తుల్యభాగా మహానదీ ప్రవాహధ్వనిచే దిగ్గజముల శ్రోత్రములు చెవుడువడుచుండును; ఏలానదీతటక్షేత్రములందుఁ బండిన పంటల రాసులు పర్వతములు పగిదిగాన్పించును. బహిర్ధరణిమండలము [illegible]పురసమీపోద్యానము

లందలి వివిధపాదపమేదురమున నల్లనగుచుండును. గోదావరీతీరభూములందలి యగ్రహారము లందువసియించు బ్రాహ్మణులు తాముచేయు యాగములకుఁ బిలువ దేవతామండలము వచ్చుచుండును; కౌంతేయ నదీప్రాంతములందలి కాంతారమధ్య స్థలములందు మునిమండలము మహేశ్వర పదధ్యానము నందాసక్తిగలిగి యుండును; కృష్ణానదియందలి యుత్తుంగసైకతస్థలములందు నిరంతరము సిద్ధమండలము తీర్థమాహాత్మ్యము కథించుచుండును; అట్లుపలు తెలుఁగుల వన్నెకాంచెడి యాభీమమండలము భూమండలమునకు సారభూతమై, సుప్రకాశమగు జంబూద్వీపమునకుఁ బ్రధానమాణిక్య ప్రదీపమై, రమ్యమగు భారతవర్షాఖ్యశాఖ కుత్తమఫలమై, భరతఖండదేశమునకు మనోహరమధ్య ఖండమై, యాంధ్రావనీ మానవతికుత్తమ కంఠభూషయై, కైవల్యఫలమునకుఁ బాదపమై, యశ్రాంతానంత కళ్యాణములకు స్థానమై, కైలాసాద్రికిఁ బ్రతినిధియై యనశ్వరమహైశ్వర్యమై, యనిందిత ప్రజాకీర్ణమై, యసమానాధిక వైభవమై, గణనాతీత విఖ్యాతప్రమథ వ్రాతసంకులమై, యవాఙ్మానసగోచరమై, మహాలింగనివాసభూమియై, దక్షిణకాశియై యెల్లపుడును సర్వసామగ్రితో విరాజిల్లుచుండును. అందు సంధ్యారుణజటాజూటవిశంకటస్థలమందలి సుధామరంద నిస్తంద్ర నవేందుసుమము గానఁబడును; విశాలఫాలమందలి యగ్నిశిఖాతిలకశ్రీ ప్రకాశించును; కంబుప్రతీకాశమగు కంఠమందలి నీలశోభవిజృంభించును; చారుకర్ణయుగ మందలి భోగికుండల ద్వయము నుతియింపఁబడును. మఱియు ఘోరసంసార దుఃఖవ్రాతాంధకారమునకు మార్తాండ మండలమగు నాభీమమండలమునందుఁ గ్రిమికీటనరాది సకలశరీరులకుఁ బ్రాణప్రయాణ వేళయందు భీమేశుఁడు చెవిలోఁదారకమంత్రమును జెప్పును. ఒకచోటఁ గోటిపల్లిసోమేశప్రకాశితమగు సమీపభూమియు, నొకచోటఁ దైర్థికానందవర్ధనియగు వృద్ధగౌత

మియు,నొకచోటఁ బీఠాంబికా పీనతుంగస్తన పీడితమై సాంద్రసస్యాళి శాలియై యున్న యేలాతరంగిణియు, నొకచోటఁ దీరాగణితలింగౌఘ పూజారాజన్నిజాంబుజమై పుణ్యసలిలమైయున్న తుల్యభాగా మహానదియు, నొకచోట స్నానాగతామరవ్రాతమహర్షిగణసంకులమై పావనతీర్థమై యున్న సప్తగోదావరమునుగలవు. ఈనదులన్నియు సతతము ప్రపూర్ణజలశోభితములగుచు శ్రీభీమమండల భూమిభామినికి భూషణాయితములై యున్నవి. పావనియగు గౌతమీగంగ త్ర్యంబకాచలశిఖరమునఁ బుట్టియు నార్యావర్తము నడచియు దండకారణ్యవసుధామార్గము నందియుఁ బ్రస్రవణ శైలమును దనతరంగములతోఁ దాడనమొనర్చియుఁ బట్టిసమున వెలసిన శ్రీవీరభద్రమహాప్రభుని సేవించియుఁ దీరమున నున్న సోమేశ్వరాలయ సమీపభూభాగమునకుఁ బోయియు, నన తభోగేశ నికటధరణికిఁ జేరియు, రుద్రపాదస్థలమును స్పృశించియుఁ గోటిపల్లిపురనాయకునకు సోమేశునకు మ్రొక్కియు గు ఢమాముఖతీర్థమును గుస్తరించియు, వామభాగమున తులు భీమను లముచే శోభించుచును సాగరమును సంగమించుచున్నది. శ్రీభీమమండల భాసమాన యగు గౌతమీగంగతో లోకమునందలి యన్యనదులు గౌరవమున నెట్లుసాటిరాఁగలవు? ప్రజల కు బ్రహ్మహత్యాది పాతకములెల్లను శ్రీభీమనాయక స్వామి కళ్యాణోత్సవమును గాంచినంతనే నశియించును. భీమనగరమునఁ గార్తికియందు జ్వాలాతోరణము దూరునాఁడు దేహాంతమున యమపురతోరణముదూఱఁడు. భీమేశ్వరునకు నివాసస్థానమగు నాదతువాటికయందు బావనములగు పండ్రెండు తీర్థములును, సప్తగోదావరమును గలవు ఆనగరవిస్తీర్ణము మూఁడుయోజనములు. అందలి నదశావులు నూతులలోనగు వానియందలి జలములా భాగీరథీజలములే. ఆనగరగోద్యానములందలి వృక్షములు సప్తగోదావర సలిలములచే సెసగి ఫల

పుష్పములతో నొప్పారుచుండును. అందువసించెడి గోరవంకలు పంచాక్షరీ మహామంత్ర జపమొనర్చును. మదించిన మగకోకిలలు నీలకంఠస్తోత్రమును బఠించును. తుమ్మెదకోదములు శతరుద్రీయపాఠమును వల్లెవేయుచుండును. పన్నగభోగులాసక్తితోఁ బ్రణవోచ్చారణ మభ్యసించుచుండును. ఆనగరోత్తమము విఖ్యాతములగు పుణ్యక్షేత్రములలో నుత్తమోత్తమమైనది. ఐంద్రసంపదకుఁ బుడమికంతకును నాధారభూతమైనది. దక్షప్రజానాథునకు మహాయజ్ఞోచితస్థలము. మరియు నది ప్రశస్తములగు పన్నెండు క్షేత్రములతోడను, బుణ్యతీర్థములతోడను జెన్నారుచున్నది. భోగమోక్షములకు నెలవైనది; యాత్రామాత్రాసక్తులగు వారలయశేష దోషముల నపహరింపఁ జాలినది; స్వయంభువగు శ్రీభీమేశలింగమున కధివాసమైనది. అట్టిదక్షవాటమును వర్ణింపమావంటి వారలకు వశమా? భీమేశధామ భూకాంతకు భూషయై, దక్షిణకాశియై యొప్పుదాక్షారామ పురమును నుతియింపఁ బద్మభవుఁడైనను జాలఁడు! ఓసత్యవతీసుత! దక్షపురమున నున్న శ్రీ భీమనాయకస్వామి భగవంతుఁడగు విశ్వనాయకుఁడే! సప్తగోదావరము సాక్షాజ్జహ్నుకన్యకయే! విఘ్ననాయకుఁడు ఢుంఢివిఘ్నేశ్వరుఁడే. దండపాణీశుఁడు దండపాణీశుఁడే! శ్రీకాలభైరవస్వామి కాలభైరవుఁడే! నందికేశుఁడు నందికేశుఁడే కాన దక్షవాటీనగరి కాశికానగరియేల కాకుండును? ఓపులినోద్భవ! భీమమండలభూమికిఁ బూర్వాదిదిక్కులందుఁ గల సీమాసంవిభాగమును వివరముగా వినిపించెదను వినుము! తూర్పునకు సీమసాగరమే! దక్షిణమునకు వృద్ధగౌతమియే, పడమరకు గౌతమీగంగయే; ఉత్తరమునకుఁ దుల్యభాగయే. మఱియు సిద్ధసాధ్యామరాదులు భోగమోక్షమహైశ్వర్యములను గాంక్షించి భీమమండలమున మర్త్యులై పుట్టవలతురు. మహేంద్రుఁడు రంభాద్యప్సరస్త్రీలతోడఁ గూడి నాక

మువలననుండివచ్చి భీమమండలినుండిన ద్వాదశతీర్థములందు నుత్సవము లొనర్చును. గ్రహమండలరాజుచే మార్తాండుచేఁ బ్రతిష్ఠింపఁబడినవాఁడు, సప్తర్షిప్రవరులు తెచ్చిన సప్తగోదావరజలముచే నిత్యమభిషేకింపబడువాఁడు, దివ్యమూర్తి, మహాప్రభుఁడు, తొలిమామయగు దక్షుని భవనారామభూమధ్యమున విహరించువేడ్కకాఁడు సర్వగణాధీశుఁడు, సకలలోకైకనాథుఁడు కృపానిధికర్తయగు భీమేశ్వరస్వామి సదాయందు భక్తులకుభోగమోక్షములొసఁగును. అందుచే భీమమండలము వసుమతీ మండనమై వాసికెక్కియున్నది. మఱియునందే యధ్వరము సాధ్వసముతో నిఱ్ఱిరూపముదాల్చి పఱిగిడెననియు, భాషావధూటికి జుగుప్సితయగు నంగవికృతి సంభవించెననియు, మూచ్చుచు నేఁ నాల్కలుకోయబడెననియు, బూషారువదనము బోసిపోయెననియు, భీమమండలి నుండెడి ప్రాచీనమునులు వీరభద్ర విజృంభణమును వివరింతురు. ఓ వ్యాస! ప్రసంగవశమున నేనించుక తెల్పితిని, గాని శ్రీభీమేశ్వర మహాత్మ్యమునెల్లఁ జెప్పఁగల నేర్పు కాఁ డెవఁడు? విశ్వేశుఁడు చేసిన యవమానముచే విహ్వలుఁడనైయున్న వాఁడవుగాన నేఁడు నేను నిన్నిచ్చటువిడిచి పోవుట యుచితముకాదు. మనమిద్దఱమును గలసి ద్వాదశక్షేత్రతీర్థయాత్రా ప్రసంగమునఁ దుక్కటీశ్వరుని దర్శింతము. నేఁడు నీతోఁగూడియే మనల దక్షవాటమునకే పోనెంచితిన' ని యగస్త్యమునీంద్రుఁడు దక్షపురీముఖుఁడు కాఁగా మునిశార్దూలులిద్దరును లోపాముద్రయు శిష్యులందరును యథేష్టాలాపతత్పరులగుచు దక్షపురికిఁ బయనమైరి.

ఇది స్కందపురాణమందలి భీమఖండమునం దనిమిదవ యధ్యాయము.

---

## నవమాధ్యాయము.

—♦ వ్యాసాదులు సాంపరాయపురాగ్ర శిలాల మొదలగు స్థానములను జూచి దక్షవాటమునకు బోవుట ♦—

అట్లు వ్యాసుడును నగస్త్యుడును లోపాముద్రయును శిష్య సంఘమును దుల్యభాగాతీరమందలి వృక్షశ్రేణిచే విరాజిల్లు సాంపరాయపురీ మార్గమును బట్టిపోవుచుం జూతాటవిని దాటిరి. సోమేశ్వరుని దర్శించిరి. ఓంకారనగరము (ఓదూరు) న నున్న బ్రహ్మను విష్ణువును నీశానుని నుతియించిరి. శిలా (శివల) గ్రామవరాగారుడగు ఫణిభూషణునకు మ్రొక్కిరి. అంత భీమేశుని విలోకింప మిగుల వేడుకపడుచు వ్యాసుడు దక్షవాటికను బ్రవేశించుట కొక సుముహూర్తము గనుంగొన నొకానొక సువిభక్తస్థలమునం గూర్చుండియుండిరి. సర్వతంత్రవేత్తయగు మైత్రావరుణి ఘూసమయమునం గాలశుద్ధిని విమర్శించి బాదరాయణునకు కిట్లనియె:— ఓ సత్యవతీ తనూజ! ఉషఃకాలము గార్గిసిద్ధాంతము; శకునము బృహస్పతిమతము; చిత్తనైర్మల్యము నీమతము; విప్రవాక్యము విష్ణుమతము. అభిజిత్కాలము సర్వసిద్ధాంతసమ్మతమైనది. ఆకాలముననే విరూపాక్షుడు త్రిపురములను జయించెను; దేవతావ్రాతము పాల్కడలిని ద్రచ్చి యమృతమును బడసెను; దేవేంద్రుడు దివ్యసింహాసన మెక్కెను; కాన యిప్పుడు మనము పయనము చేయుదము! నీవును యోచింపుము! ఇచ్చటనే యుండి యోగవిద్యామహాబలమున నాకాశమార్గమునం బోయి పుణ్యమగు భీమమండలము నెల్లను సూర్యుడాకాశమధ్యమునకు వచ్చెడి వేళయగు నభిజిత్కాలము వఱకును వీక్షింతము! ఓ మునీశ్వరా! నీవును నేనును లోపాముద్రయును యోగశక్తిచే గగనమునుండి సాగరముతోం గూడిన భీమధామమును

జూడఁగలము. ప్రొద్దుపొడిచి యిప్పటికి రెండుగడియలుమాత్రమేమైనది. దక్షపురమా మిక్కిలిదాఁపున నున్నది. చెచ్చరఁబోయి చేరవచ్చును. పుణ్యక్షేత్రమగు నీయోంకార నగరమున మనోహరమగుచు నుండిన త్రికూటదివ్యభవనమునందు మునులనెల్లర నుండనిండు? లోపాముద్ర యును మనమిరువురము మాత్రమే యాకసమున కెగసిలోచనసుఖ మొసఁగుచున్న భీమమండలము నంతయును గాంతమని యగస్త్యుఁ డనినంతనే మహాదరపూర్వకముగాఁ గృష్ణద్వైపాయనుఁడును సంగీక రించెను. అంతఁబరమర్షిచేఁ గలిగినపరము హర్షముతోఁ గూడిమహా పరిభావముతో గగనమండలమున నుండి భుక్తిముక్తి రమా కాంతకు లీలాభవన పద్మముగుచు గన్నులపండువు గావించు భీమమండలమునం తయుఁ దిలకించిరి. అప్పుడు కుంభసంభవుఁడా భీమమండలమును సం వీక్షించి డెందమున నుప్పొంగుచు వ్యాసునితో నిట్లనియెను:—

'ఆంధ్రభూమండల మధ్యమ మొకి వికసించిన పద్మము, అందుసప్తగోదావరతీర్థము మనోరమమైన మకరందము; బ్రహ్మసంవేద్య ముఖ్యములగుతీర్థములు రేకులు; దివ్యస్థలములుకింజల్కములు, మహోదధి వేలానాళము, కళ్యాణభోగకరనల్యసామగ్రి సౌరభము? పుణ్య నగరి యగు దక్షవాటికకర్ణిక? శ్రీభీమనాయకస్వామి శుభాకృతియగు రాజ హంస. మఱియు మనోహరజల పూరితములై జగత్ప్రసిద్ధిగన్న గౌతమీ సింధుకాంతయు కణ్వనదులును తుల్యభాగయు నేలేఱుమగలయీపుణ్య భూమిభవతాపమునుశమింపజేయు నౌషధమైయున్నది. ఓపారాశర్య మునీ! పరికింపుము!ఆపారావారము మహత్తరమగుచులక్ష్మీపతికి శయ్యా గృహమును నల్లుఁడునుమామయునునై, శంకరునకునివాసముగమును, బుష్పవ నమునుమహాసనమునునై, విబుధులకుమహాన్నదానగృహమై, పక్షముగల పర్వతములకు నిర్భరాశ్రయమై, వాహినులకు గమ్యస్థానమై, ముత్తియ ములనునక్షత్రములకాకసమైయవిచ్ఛిన్నబడబాగ్నులమునకు ఘనపానీయ

శాలికమై, దేవేంద్రునకు గజాశ్వాదిఫలప్రాప్తిమై, కూటకచ్ఛపరాజన్మునకు వేశంతస్థానమై, వసుంధరావిలాసినికి మేఖలాదామభూషణమై, మత్స్యకచ్ఛపనక్రాద్రి మహాసత్వ సమాకులమై, తరంగనికరాభంగధ్వని వ్యాప్తదిగంతమై, యారసాతలగంభీర వారిపూరవిశాలమై, డిండీరఖండసందోహప్రభాధవళితాంబరమైయున్నది. మునీంద్రా! కాంచితివా! ఆసాగరవీచీపరంపర బ్రహ్మాండమండలీ సౌధమునకింద్రనీల స్థంభపంక్తులై పారిక్షితభుజంగ యాగప్రాప్తసర్పావళికి సమములై వజ్రభిన్నాంజనాపర్వత శ్రేణికుపమములై, ప్రళయజంఘామారుత ప్రోద్ధూతమేఘములకు సన్నిభములై యంబుదాయనమును జుంబించుచున్నవి. మఱియు నోమానవులారా! కాశికాపురమునఁ గడతేరిన యంతఁగాని పడయఁగారాని కైవల్యసుఖమును దురంతభవ సంతాప శాంతిసంధాన చతురుఁడు, చంద్రమౌళియును బ్రహ్మాసంవేద్యస్వామి క్లేశమక్కఱలేకయే లీలాగతిని ప్రాణులకుఁ గలిగించుచున్నాఁడు; కాన శీఘ్రముగ గండు! రండని పిలిచెడినదువు గౌతమీనదిసాగరమునఁ గలయు స్థలమునఁ బుట్టిన యలలరవళి విననచ్చుచున్నది. అదిగో! సంవేద్యమహాక్షేత్రము అచ్చట బ్రహ్మేశుఁడు నెలసియున్నవాఁడు. అదే! కోటిపల్లి. అందు మోక్షదుఁడగుసోమేశుఁడు మొగరించియున్నవాఁడు. అదిగో! భోగమోక్షసాధనమగు దక్షారామము. అదియే! అభ్రంకషమగు భీమనాథప్రాసాదముండిన ధరణి. అదిగో! సప్తమునులు తెచ్చిన సప్తగోదావరస్థలము. అదే! పట్టిసమహాస్థానము. అందుఁ జంద్రకళాధరుఁడు వీరభద్రప్రభుఁడు ప్రకాశించుచున్నవాఁడు. అదె! పద్మపర్వతము. అందు మార్కండేయమహామునికుల దైవతమగు మహాదేవుఁడు మరగియున్నవాఁడు. అదియె! భాసమానమగు కుమారారామము. ఆహర్మ్యరేఖ భీమేశస్వామి మందిరవాటిక. అదే! కుక్కుటేశ్వరస్థానము; దానిచెంత నున్నసమున్నతసౌధమువాలంకా

గిణీశక్తియోత్థానభవనము. అతఁడే! లోకనాయకుఁడు, భక్తవరదుఁడు మాకులదైవతమునగు సల్వాలపురీశుఁడు, అతఁడే! కొండలీశ్వరుం డలుఁ డగు సంగమేశ్వరస్వామి. అనియే పుణ్యమగు కుండలాముఖతీర్థమును హస్తముతోఁ జూపిచెప్పి దివాకరుని వీక్షించి నిక్షువాటికకుఁ బోవనుము హార్ద మాసన్నమగుచున్నదికాన వేగముగఁ బోదమని వారు పువ్వరోక్తమాటలు మునులముంగలనిగిరి. అంతసంశితవ్రతులగునా మునులెల్లరునుగూడి సాక్షాత్కైలాసకుధరమగు దాక్షారామపురమునకుఁ బోయిరి. అది ద్రాక్షాగుద్రాక్షతిలకప్లక్షామలక చంపకములతోడను, నారంగనాగ పున్నాగనాగ కేసర కేసరములతోడను, మల్లీమధూక మాకందకుందమందారచందనములతోడను, నక్తోలతాలహింతాలతమాలకృత మాలకములతోడను, గుదాలసాలహింతాళకరవీరకురంటకములతోడను, గదళీబదరీభూర్జఖర్జూరామ్రనన్నైకములతోడను, శమీశారద శాండిల్యశింశు పాశోకకింశుకములతోడను, వటోదుంబుర జంబీరజంబూనింబకదంబకములతోడను, లవంగైలాలతాలుంగ లవలీమాతులుంగకములతోడను, గపిత్థలోధ్రపనసపాటలీపారిభద్రికములతోడను, ఫలపుష్పదళాసతములగు వివిధ వృక్షములతోడను విరాజిల్లు నుద్యానవనములతో శోభిల్లుచున్నది. మఱియు సర్వతస్సాంద్రపుండ్రేక్షుకాంతారసంశోభితమును, గళ్ళాధిలోక న్యాకీర్ణబిల్వకాననభాసురమును, దిగ్భాగవ్యాపిసౌరభ్యకుసుమారామరాజితమును నాగవల్లీలతాశ్లిష్ట క్రముకోద్యానదీపితమును, నుదారఫలసంపన్న నారికేళవనాంచితమును, సుపోతకీసూనశాదిశాకమూల వనాకులమును, కమలోత్పలకల్హార చారుకాసారమంజులమును, నానాసస్యచయానూనఫల సంపత్సముజ్జ్వలమును, బహుక్షీరప్రదానేక గోబృందశతసంకులమును, వేదశాస్త్ర పురాణాదివిద్యాసంపన్నద్విజోత్తమమును, నౌదార్యశౌర్యగాంభీర్యాది రాజరాజమండల

మును, ధనాధీశ్వరసాదృశ్యబృందసహస్రకమును, నశ్రాంతద్వీపాంతరప్రభూ
పానమానసక్తజఘన్యజమును, రూపలావణ్యతారుణ్యాగణ్యపణ్యాంగనాం
గణమును, గంధకర్పూర కస్తూరీసౌరభవ్యాప్తదిఙ్ముఖమును, మణిస్వ
ర్ణాదిసద్వస్తు ప్రపూర్ణవిపణాపణమును, జంగమాచలవిభ్రాంతిప్రదాయి
మదవారణమును, మనోమరుత్సారరంగదభంగురతురంగమును, మా
ర్తాండశ్యందనోద్దామమణిహేమశతాంగకమును, హార్యతుశౌర్యదుర్వార
మహావీరభటవ్రజమును, సుధాంశుస్పృష్టప్రాసాదసౌధప్రాకారగోపుర
మును, నాకసాతలగంభీర పరిఖాకారసాగరమును, నిత్యకళ్యాణసంపన్న
నానాసదనవాటకమును, నానాదేశాగతానేకవ్యవహారిసమాకులమును
నానాతైర్థికమహావిస్మయకారణమును, బుణ్యాంబుపూర సంపూర్ణతీర్థ
కుండ శతోజ్జ్వలమును, ననేక దేవతాగారసహస్రికవిరాజితమును
మహేశ్వరధ్యానసక్తతపస్విప్రకరాశ్రయమును, శైవవైష్ణవగాణేశసౌ
రశాక్త పరికాశితమును, వందిమాగధసందోహ కోలాహలవిజృంభిత
మును నర్తకీనర్తక ప్రాతినాట్యోత్సవసమంచితమును, నశేషవాద్యని
ర్ఘోషబధిరీకృత దిగ్గజమును, సురకిన్నర గంధర్వసిద్ధసాధ్యాది సేవిత
మును, నిత్యోత్సవేక్షునాసక్తవైమానికవృతాంబరమును, నానావిధ
మహాభోగ మోక్షసంపదలంకృతమును, నానాభువన విఖ్యాతనానా
క్షేత్రోత్తమోత్తమమును, చక్షురుత్సవదాయకమును నగు శ్రీదక్షవాటీ
నగరమును వీక్షించి యానులెల్లరును బరమహర్షము నందిరి.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున నవమాధ్యాయము.

# దశమాధ్యాయము

—♦ వ్యాసాదులు దక్షారామము ప్రవేశించుట. ♦—

అట్లు ద్వైపాయన ఘటోద్భవు లిద్దఱును రమ్యమగు దక్షపురమును జొచ్చి కర్ణికారాంబికా (గోగులమ్మ) మహాకాళి గుడికి నాలుపట్టిన విధముగానున్న సూర్యవీథికిఁ జనిరి. అంత నాపరమమునులకు నానందము వచ్చు పెరుఁగ భీమశంకరాలయ పశ్చిమద్వారము నాశ్రయించిరి. అప్పుడు శిష్యులతోఁడఁ బరమహర్షము నందుచున్న సత్యవతీసూనుని గాంచి యగస్త్యుఁ డిట్లనియెను:—. ఓ సత్యవతీతనూజా! కాంచితివా! ఈ దక్షవాటీపురము దక్షిణానందకాననమై వీక్షణానంద జనకమై స్వర్గవాసులకును గామ్యమై యున్నది. కనుఁగొంటివా! గోపురములు గోమేధికమయములై యాకసము నంటుచున్నవి. అందలి స్వర్ణకుంభశతానీకము తేజమున నాదిత్యమండలమును దిరస్కరించుచున్నది. ఇచ్చట దివ్యరత్న నిబద్ధములగు దేవాలయములందు దేవతావర్గము వసియించుచుండును. అచ్చటఁ బ్రతిదినమును నచ్చరలు నృత్య మొనర్చుచుండును. వివిధవస్తు పూర్ణములగు సంకీర్ణ యరుఁగులపై గంధర్వ యక్షవిద్యాధరాదులు కూర్చుందురు. ఉత్సవములందు వినవచ్చెడి శంఖభేరీమృదంగాది ధ్వనులను వినువారలకు సకల పాపములు సమసిపోవును. శంభుని యవసరములందు సూర్యమండలనిభములగు స్వర్గవాసుల విమానములు గణనాతీతములై యుండును. పవనునిభార్య కరాగ్రజాగ్రన్మాణిక్యకంకణక్వాణమంజులముగాఁ గసవూడ్చును. ఇందిరాసుందరి కెంగేలి లీలారవిందమునఁ గమ్మఁదేనియ కలయంపి చల్లును. ఆకాశగంగ తామ్రపర్ణీసమన్వితయై స్ఫురన్మాణిక్యములతో రంగవల్లి తీర్చును. కాలుని యంతఃపురకామిని కాలాగరుజనామములతోఁ గనునియముగా నంత

టను ధూపమిడును. సప్తపాతాళ నాగేంద్రచంద్రముఖులు ఫణిమణి
ప్రభాదీపస్తంభములగుదురు. ఇంకను దేవతావనితలు ప్రతిమహోత్స
వమునందును దమకుఁ దగిన క్రియలయం దాసక్తలగుచు భీమేశుని
శుద్ధాంతమగు నీ దక్షవాటీపురమున నుండుదురు. సంధ్యాకాలములందు
సమస్తలోకపాలురును సద్భక్తితో సర్వేశసందర్శన సముత్సుకులై
చనుదెంతురు. గాంధర్వవిద్యా నిపుణులగు గంధర్వులును దేవ
తలునుగరీయమగు గాంధర్వముతో గరళకంఠుని మాహాత్మ్య
మును గానముచేయుచుందురు. తపస్వులగు వాలఖిల్యాది మహాత్ము
లెప్పుడును మిగుల నాసక్తికలిగి బ్రహ్మము నే ధ్యానించుచుందురు.
మఱియు నిందలి ద్వాదశతీర్థములును సకలజనుల కిచ్ఛామాత్రమున
భోగమోక్షముల నిచ్చును. ముజ్జగములందును వన్నెగాంచిన పంచ
తీర్థములునుగలవు. వానిని దలంచినంతనే సర్వపాపములును నశించి
పోవును. అందు గౌరిమానినియై యోగాగ్నిచే దేహమును త్యజించినద
యు, జగన్నుతమును నగు దక్షయాగాగ్నిత్రయతీర్థము మొదటిది. ఆమో
ఘా తనమనోభీష్టమునొసంగినదియు, ఉత్తమమును నగు సకలేష్టసంసిద్ధ
నామకమును తీర్థము రెండవది. లోకపావనమగు సోమేశ్వరతీర్థము
మూఁడవది. అందవగాహించిన నరుల సకలపాపముల సదక్షీణింపఁ
జేయును. ధాత్రీధరోత్తముఁడగు హిమవంతుఁడు వరమందినదియు, ఫల
దాయకమును నగు హైమవతీతీర్థము నాలవది. మనుజులకు సకలకల్యా
ణములను సిద్ధింపఁజేయునదియు సర్వసాధనమైనదియు నగు సప్తగోదా
వరతీర్థమైదవది. మఱియు నీపంచతీర్థములందును మునిఁగిన పంచజనుని
పంచేంద్రియసముద్భవములగు పాపపుంజము పాయును. శిష్టులును, విబు
ధులును నగు ఘనమాన్యమానవులా తీర్థములను ముక్తికాంక్షచే సేవింతురు.
బాదరాయణా! ఈతీర్థములకెల్ల నేనెట్లు పేర్కొననేర్తును! వానియందుండి
వెడలెడు వాయువుసోకినఁ గీటకములును ముక్తి గలుగును. ఇట్లగుటను

దక్షవాటీమాహాత్మ్యము నభివర్ణించుచుండ బాదరాయణుఁడును శిష్యు లతోడ నాదరముగ వినుచుఁ బ్రదక్షిణప్రక్రమముగ భీమేశ్వరాలయ మునకుఁ బోవునపుడు దక్షిణభాగముననున్న సప్తగోదావరమునకుఁ జనిరి. ఆమహాపుణ్యజలములందు యథావిధిగా స్నానమొనర్చి సత్య వతీసూనుఁడగస్త్యునితో నిట్లనియెను:—"ఓకుంభజా! మున్నిందుగా ద్వాదశక్షేత్ర శివలింగములను దర్శించుట యుత్తమపక్షము; కాన నా కాశివలింగములను వీక్షించుప్రక్రమమును, వానిమాహాత్మ్యములను సవి స్తరముగాఁ జెప్పుము! ఓమహేశ్వరోత్తమా! నీవింతకుమున్న చిరకాల మీదక్షవాటమున నివసించితివి యుండుటచే నీకాతీర్థములెల్ల నాడినవి కావే!" యని ధీమంతుఁడగు పారాశర్యుఁడు పలుకఁగా భగవానుఁ డగస్త్యుఁడు సంప్రీతుఁడగుచు నిట్లనియెను:—"ఓపారాశర్యా! పూర్వ జన్మపుణ్యపరిపాకమున భవమోచకయగు శివకథ విననిచ్ఛనొందు చున్నావు. పూర్వము నేను కుమారముఖమున విన్నవిధముగాఁ దీర్థ మాహాత్మ్యమును నీకుఁ జెప్పెదను. ఋషిసంఘనిషేవితమై, విఖ్యాత మైయున్న యింద్రేశతీర్థమును, సాధకులకు సకలసిద్ధులొసఁగు సిద్ధేశ్వర మహాతీర్థమును, యోగలక్ష్మీప్రదాయకమగు యోగీశతీర్థమును, భక్త మనోభీష్టప్రదమగు కాలేశతీర్థమును, శాంతిదాంతిప్రదాయకమై విమల మైయున్న యామేశతీర్థమును, విశ్వస్తుత్యమును, పావనము నగు నీర భద్రేశతీర్థమును, బ్రహ్మాఘసంహారమగు బ్రహ్మేశతీర్థమును, సకల మహాదుష్టభూతులపచ్చ్యుతిపాతేశ్వరతీర్థమును, గౌరీకాననగిరోపవనమగు కుక్కుటేశ్వరతీర్థమును, సర్వార్థఫలప్రదమగు సోమనాథేశ్వరతీర్థమును, సేనానుగ్రహకారణమగు శ్రీమహేశ్వరతీర్థమును, లోకత్రయవిశ్రుత మగు రామేశ్వరతీర్థమును గలసి ప్రధాన తీర్థములు. మఱియు నీదక్ష వాటమున గూఢములును నిగూఢములును గూఢాగూఢములును నిధ సిద్ధులనగు తీర్థములు పెక్కులున్నవి. ఓపులినోద్భవా! గంధర్వ

లును, గిన్నరులును, సిద్ధులును, సాధ్యులును, విద్యాధరులును,సురలును, గరుడులును, ఖేచరులను, నాగులును, యక్షులును, దానవులును ద్వాదశ క్షేత్రతీర్థమధ్యమహీతలమున భక్తితో నిలిపిన శివలింగములు కోట్లకొలఁది నున్నవి. పరివేషమునకు మధ్యమమున నున్న భాస్కరు నివగిది భీమనాథుడు ద్వాదశక్షేత్ర పరివేషోదరమునఁ బరిఢవిల్లుచున్న వాఁడు. ద్వాదశక్షేత్రములను వికసించిన పత్రములతోడను సప్తగోదావరఝురమును మనోహరమకరందముతోడను గూడియున్న దక్షవాటీనగరమను నూతనపద్మమునకు నడుమను భీమనాయకుఁడు రాజహంసమై యున్నవాఁడు. అనాదినిధనమై సముజ్జ్వలమై యున్న భీమలింగజ్యోతిపద్మ జాంఘుని రత్నదీపాంకురమై యున్నది. అది సకలజనప్రియవర్ధనమై, సకలతాపహరణ దక్షమై, శుభశోభావిభావసువై యమృతసాగరమున నుదయించెను. నిజముగా సుధాకరకళాధరుఁడు సుధాకరుఁడై యవతరింపకుండిన బృందారకమహామానిబృంద హస్తపద్మములు ముకుళించునా? అమృతాబ్ధిజాతుఁడై యమృతాత్ముఁడై యున్నభీమేశునకు సేవకవాశ్రిత భవరోగ విభంజన మెంతటిది? లోకనాధుఁడై, గౌరీనాధుఁడై, కృపానిధియై, శ్రీనాథనాథుఁడై త్రయీనాథుఁడై, మన్నాథుఁడై యున్న భీమనాథుని భజియింతును. భవుఁడు, భవానీభర్త, భవభంజనుఁడు, భవరోగాగదంకారుఁడు శైలాత్మజేశుఁడు, భోగమోక్షదుఁడు, భుజంగభూషణుఁడు, భర్గుఁడు, భ[illegible]సము ప్రభుడు, భగవంతుఁడు, భూషితాంగుఁడు, భగనేత్రపహరణుఁడు, భద్రుఁడు భువనస్తుత్యుఁడు, భక్తాభీష్టఫల ప్రదుఁడు, భస్మాంగరాగ దీప్తాంగుఁడు భూతేశుఁడు, భూరివిక్రముఁడు, భాగీరథీచారుమౌళి, భారతీపతిసేవితుఁడు, భామాసేవిత వామాంగుఁడునగు భీమనాధుని భజియించుచున్నవాఁడను. భవ్యబుద్ధులు భీశాశక్తికై భజింతురు. భువిని భీమేశుని భజియించువారలకు భావనాతీత భద్రములు సంభవించును. రాజాధి

రై, రాజశిఖామణియై, రాజిల్లెడు దక్షపురీరాజును సేవింపవిబుధో త్తములు విచ్చేయుచుండురు. ప్రియశుద్ధాంతవనితా సహితులై మహీధరులు పూరారిసేవకై యరుదెంతురు. ఆయుధములను బూనియువహితులైశైలకన్యకకుఁ గావలియున్న నందిముఖ్యగణేశు లెల్లరును దక్షవాటికకును గాపుందురు. కల్పాంతసమయములందు స్వశుద్ధాంతమగు దక్షవాటికయందు ద్వాదశ మార్తాండ మండలోదగ్రతాపము కలుగకుండుఁగాక! అసర్గళోదగ్ర సప్తజంఝూమారుతోద్ధతి లేకుండుఁగాక! పుష్కలాదిమేఘము లద్భుతముగ వర్షింపకుండుఁగాక! సప్తసాగరము నిరాఘాటముగాఁ బ్రసరింపకుండుగాక! యని విశ్వాధ్యక్షుఁడగు భీమేశ్వరుఁ డవహితస్వాంతుఁ డగుచుఁ బ్రమథనాయకులచేఁ దన యానతిని జాటింపఁ జేయును. సమస్త భువనప్రభుఁడగు భీమనాయకునకు ధరాధిరాజకన్యయందున్న యాదరమే దక్షవాటికయందును గలదు. భైరవుఁ డర్ధరాత్రమునఁ బ్రహరి దిరుగుచుండును. ప్రమథగణమును, బూర్వాది ద్వారపాలురును, వాసవాది దిక్పాలురును దక్షవాటీ మహాపురియందు నడురేయి భీమనాయకాలయమును బాయకుందురని శివభక్తిపరాయణుఁడగు నగస్త్యుఁడట్లు ప్రసంగవశమునఁ జెప్పినపిదపఁ ద్రిలోకవసుధాసతికి మంగళభూషణమై, పరమపావనమైయున్న భీమమండలమునఁ బుధోత్తములచేఁ బరిగణింపబడె ద్వాదశక్షేత్ర శివలింగముల నర్చింప నాసక్తి గలిగి యిట్లని చెప్ప మొదలిడెను:—"మహోత్సవములందు దేవతలు భీమేశుని సేవింప శాంబరీశక్తితో మర్త్య వేషమును దాల్చి దక్షవాటికి విచ్చేయుదురు. అచ్చటి మహోత్సవములందుఁ గుమారుని మయూరము మేఘనిర్ఘోషగంభీరమగు డిండిమధ్వని విని కౌతుకముతో నర్తించును. మఱియు నా భీమేశనగరమున మహోత్సవములు ప్రవర్తిల్లునపుడు గలసి వర్తించెడి మర్త్యాంగనలయొక్కయు నమర్త్యాం

గనలయొక్కయు భేదము కృష్ణమేషాని మేషములవలననే తెలియ శక్యమగును. రాత్రులందు మణిహర్మ్యాగ్రభాగములను ముగ్ధాంగనలు తారకలను ముత్తియములని పట్టఁబోవునెడ వల్లభులు వారలను గాంచి హసింతురు. దక్షప్రజాధినాథున కుత్తమగృహారామమై సర్వలోకాధినాథునకు శ్రీభీమేశ్వరునకు మహాంతఃపురమై, కైవల్యఫలమునకుఁ బాదుపమై యొసఁగెడు నీ దక్షవాటీనగరియం దెల్లయెడలను దేవతలు తిరుగాడుచు దానిని గాంచుచుందురు. శ్రీభీమనాథునకు గౌరియు, గగనగంగయుఁ, గాశియు, దక్షిణకాశియు ననునాలుగే సమముగాఁ బ్రియము లైనవి.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున
నవమాధ్యాయము

---

[illegible] మాహాత్మ్యము

—◆ దేవేంద్రుఁడు దాక్షారామమున శివలింగములను బ్రతిష్ఠింపఁజేసిన
నాకాంగనలకుఁ జెప్పుట ◆—

: అగస్త్యుఁడు వ్యాసునితో నిట్లనియెను:— "దేవేంద్రుఁ డొకప్పుడు స్వర్గమునుండి దక్షారామమునకు విచ్చేసి దృఢాంగుండగుచు సుమహాదరమున భక్తాభీష్టప్రదాయి యగు శంభుని బ్రతిష్ఠించి మహోత్సవము గావించెను. ఆ దేవుని ప్రసాదమున మనోభిలషితమునందెను. అంతట నా దేవరాట్టు లోకపాలురను దేవతలనుగాంచి పరమహితుండై యిట్లనియెను:— ఓ దేవతలారా! లోకపాలురారా! మీరెల్లరును జగత్ప్రభుండగు భీమనాథుని నగరమునం దాదరముతో శంభులిం

గములను బ్రతిష్ఠింపుఁడి! జగద్గురుఁడగు నీలకంఠుని బ్రతిష్ఠించువాఁడు పాపాత్ముఁడయ్యును నిస్సంశయముగా శంభుపదము గాంచును. సాధారణస్థలమందును శివలింగస్థాపనమాత్రకాని శివలింగవిలోకనముకాని, శివలింగస్పర్శనముకాని, శివలింగసమర్చనముకాని, స్వర్గసంప్రాప్తిహేతువగునప్పుడు భోగమోక్షనికేతనమగు దక్షవాటికయందెంత విశేషముండునో చెప్పనగునా! కాన మీరెల్లరును దక్షిణాబ్ధితటక్షితియందు లోకప్రభుఁడు, చంద్రవశాళియు నగు నీశానుని నిలుపుఁడు! అట్లొనర్చి వేదోపనిషద్వేద్యమును రహస్యమును నగుశివాఖ్యవస్తువును సేవింపుఁడి! అందుచే మీకెల్లరకు నిష్టసంసిద్ధి కాఁగలదు. దర్శనమునకంటె స్పర్శనము శ్రేష్ఠము; స్పర్శనమునకంటెఁ బూజనము మేలు; పూజనముకంటెఁ బ్రతిష్ఠ యనంతఫలము నొసఁగును; కాన యో దేవతలారా! పురాసురవిదారియు, హాలాహలాసియునగు దేవునిఁ బ్రతిష్ఠింపుఁడి! ఈప్రపంచమెల్ల లింగమయము, లింగప్రతిష్ఠితము, లీనార్థగమకము లింగము, సృష్టిస్థితిలయస్థలము లింగము, సాధకులకు లింగప్రసాదములేక భోగమోక్షము లేయోగమువలనను సిద్ధింపవు. లింగాజ్ఞలేక యెద్దియు నిలువఁజాలదు సరికదా తృణాచలమైనను సంచలింపదు. ఇది ధ్రువము. అందుచే మీరెల్లరును భక్తితత్పరులగుచు మట్టితోనైనను, బేడతోనైనను, నీటితోనైనను లింగములను నిల్పి సేవింపుఁడి! యని దేవరాజు వాచించినంత వారందఱును దమతమ నామధేయములతో శంభులింగములను బ్రతిష్ఠించిరి. సర్వవిద్యాగురుఁడగు గురుఁడు బోధించుచుండ నాగ్నేయదిగ్భాగమున దేవేంద్రుఁడు తనపేర నొక దివ్యలింగమును బ్రతిష్ఠించెను. ఆ యింద్రేశుఁడును నింద్రుఁడు భక్తితో నొనర్చిన గగనగంగాకనకకమలపూజను బ్రీతితోఁ గైకొనియెను. భోగిరాజ విభూషణుఁడు జగద్వంద్యుఁడునగు నాయింద్రేశుఁడు తనచెంతను జపముచేయు పుణ్యశీలురకు భుక్తిముక్తులు

తప్పక యొసఁగును. ఆపాకశాసనుఁ డేఁటేటను జాతరకేఁగుదెంచి సప్త గోదావరమున నీరాడి తెల్లనిమందారపుష్పములతో నాదేవునిఁ బూజించును. సప్తగోదావరజలములందుఁ ద్రిషవణస్నానమాచరించి యింద్రేశుని భజించువాఁడు స్వర్గమునకుఁబోవును. ఒకమాఱు జపించినను, మ్రొక్కినను, సేవించినను, దరిసించినను, జుట్టుతిరిగినను, మహేంద్రేశుఁడు ప్రసన్నుఁడగును. ఐంద్రపదమభిలషించువాఁ డింద్రేశసన్నిధిని బంచాక్షరమంత్రమును జపించిన నిష్టసంసిద్ధి నిస్సంశయముగాఁ గగును. సప్త గోదావరేంద్రేశసమీప స్థలమునఁ జేసిన స్నానదాన జపాదికములొక్కొకటి కోటిగుణితఫలమిచ్చును. సిద్ధేశ్వరస్థానమును సిద్ధలింగ మధిష్ఠించియున్నది. సర్వార్థసిద్ధికై సిద్ధులాసిద్ధలింగమును బ్రతిష్ఠించిరి. అందుచే నాదేవునకు సిద్ధేశ్వరుఁడను పేరువచ్చెను. ఆసిద్ధేశ్వరుఁడు తన్నారాధించెడి సిద్ధసాధ్యగంధర్వవిద్యాధరులకుఁ జతుర్వర్గఫల మొసఁగును. ఆసిద్ధేశ్వరస్థానము దేవర్షిగణసంకులమగుచు దక్షప్రజాపతి యాగదేశమునకుఁ దూర్పుదెసగా నున్నది. ఆసిద్ధేశపదమునందుఁ గావించెడి యజ్ఞదానతపోహోమజపాది కర్మములం దొక్కొకటి కోటిగుణితమగును. మఱియుఁ బావనమగు యోగీశ్వరస్థాన మొకటి కలదు. అందు సనకాదులచేఁ బ్రతిష్ఠింపఁబడిన యోగీశ్వరేశ్వరుఁడు గలఁడు. ఆస్థానము సాధకులకుఁ గల్పతరువై, భవసాగరమునకుఁ దరణియై, యణిమాద్యష్టభూతిఫలప్రదమై యున్నది. మంకణుఁడను మౌని యా యోగీశ్వరేశ్వరుని సంసేవించి ముక్తిని బ్రాప్తింపఁజేయు బ్రహ్మవిజ్ఞానమును బడసెను. మర్త్యుఁ డొక్కతడవ సప్తగోదావరజలములందుఁ గ్రుంకి జగత్పూజ్యుఁడగు నా యోగీశ్వరేశ్వరు నర్చించినఁ గలికల్మషము లెల్లఁ బాసి యమర్త్యపదవి నధిగమించును. మఱియు శుభదమని పరికీర్తింపఁబడు యమేశ్వరస్థాన మొకటి గలదు. అందు యముఁడు

ప్రతిష్ఠించిన యమేశ్వరమహాలింగము గలదు. మానవుఁ డొకమారు జగత్పతియగు నా యమేశునిఁ గాంచినంతమాత్రమున మహత్తరమగు యమభయమునుండి తొలఁగును. ఇది ధ్రువము. యజ్ఞతటాకమునఁ బ్రుంగి యమలింగసన్నిధిని నూటెనిమిదిమారులు మృత్యుంజయ జప మొనర్చి, మృత్యుంజయుఁడగు శంభుని బ్రార్థించినసాధకునకు నపమృత్యు భయము లేకుండును. యమేశతీర్థమునందు మనుజుఁడు శ్రాద్ధపిండోదకాదు లిచ్చి నరకకూపములందుఁ బడియున్న పితరుల నుద్ధరించును. మఱియు నుదారమగు కాళేశ్వరస్థాన మొకటి కలదు. అందున్న మహాకాలుఁడు కాళేశ్వరుఁడు కామితార్థముల నెల్లఁ గలిగించుచుండును. ఆమహేశ్వరుని చెంతఁ జేయు స్నానహోమజపాదికము లొక్కొకటి కోటిఫలము నిచ్చును. మఱియు లక్ష్మీప్రదమని ప్రశస్తి వడయు వీరభద్రస్థాన మొకటి కలదు. అందు శ్రీవీరభద్రాదిదేవవీరులు ప్రతిష్ఠించిన శ్రీ వీరభద్రలింగమును సేవింప నగునకు సిద్ధసన్నిధిని గాణాపత్యవిభవము ప్రాప్తించును. శ్రీదక్షవాటికనగరమున వీరభద్రేశుని సేవించువారిచే ధర్మార్థకామమోక్షముల నందుదురు. ఆ వీరభద్రేశుని స్థలమున సాధకులకు భక్తియుక్తిచే సగ్నిహోత్రాదిక్రియ లెల్లను బహుఫలప్రదములు. శ్రేయముగోరువారు యజ్ఞతటాకతీర్థమున యందును, బశ్చిమముననున్న పద్మినియందును మునుకవేసి వీరభద్రేశ్వరుని సేవింపవలయును. మఱియు బ్రహ్మేశ్వరస్థాన ముత్కృష్టమైన దని యభివర్ణింపఁబడుచున్నది. అందుఁ బరబ్రహ్మచే బ్రహ్మేశ్వరుఁడు సుప్రతిష్ఠితుఁ డయ్యెను. పూర్వ మొకప్పుడు బ్రహ్మాదిదేవత లందఱును భీమేశుని దర్శింప వేడుకపడి బ్రహ్మలోకమునుండి దక్షారామపురమునకు వేంచేసిరి. సప్తగోదావరాది పంచతీర్థరాజములందు మునిఁగిరి. ద్వాదశదివ్యలింగస్థలములను వీక్షించిరి. దివ్యామృతమయుఁడు జ్యోతిర్లింగమూర్తి సదాశివుఁడు సమస్త దేవతావ్రాత

సార్వభౌముఁడు సనాతనుఁడగు భీమేశ్వరునిఁ గన్నులారఁగాంచి పరమానందతుందిలులై యిట్లనిరి :— " ఈ దక్షారామమహాపురము సకలావని మండలమునం దత్యుత్తమక్షేత్రమై, జగన్మనోహరమై యున్నది. ఇందుఁ బ్రాలేయాంశుకళాధరుఁడు హిమాచలతనయకు జీవితనాయకుఁడై ప్రతిసంధ్యయందును నప్సరోబృందము సేవించుచుండ గోదావరీపయోరాసివాయువర్ధిష్ణుభూషణుఁడై వసించుచున్నవాఁడు. ముందు సప్తగోదావరమును, బ్రక్కను యజ్ఞవాటిక మును, మధ్యమమున శ్రీభీమేశ్వరస్వామియును గల దక్షవాటికకు సమమగు పుర మెందుఁగలదు? ఆహా! ఏమిభాగ్యము! ఏమిభాగ్యము! ఈదక్షవాటీపురవాసులు భీమనాథేశ్వరుని సదా కన్నులకఱవుదీరఁ గాంచుచున్నారు. ఈదక్షవాటీశ్వరుఁడుదయార్ద్రహృదయుఁడైప్రాణాంతమునఁ బ్రాణులకుఁ జెవిలోఁ దారకమంత్రమును జెప్పును. శ్రీభీమేశ్వరమహాలింగ పరబ్రహ్మమునకు భవనమై, కల్పాంతోపద్రవసాగర శీతలోకమునకు నౌకయై, జంబూద్వీపభూమి కాంతాలలామకు వరభూషణమై, ద్వాదశక్షేత్రతీర్థాంచ త్సత్రపవిత్యగపద్మమై శివకీర్తియై, శివక్షేత్రమై, శివమూర్తియై, శివప్రియయమై యొసఁగెడి దక్షవాటీపురమునకు సమమగు తీర్థము భూతలమునఁ బొడచూపదు. మంకణమహాసీశుని సంకల్పసిద్ధిహేతువును, భువనైకవిభూష యునగు దక్షవాటికకు నమస్కారము! భర్గనటాఖండనాట్యరంగమహాభూమియుఁ, గాశీపురసమానయు నగు దక్షవాటికకు నమస్కారము! దక్షిణ దిక్కాశియు దక్షయాగార్హభూమియు, శివదేవియు, మోక్షధామమునునగు దక్షవాటికకు నమస్కార మ"ని బ్రహ్మాది దేవతలందఱును హస్తపద్మములను శిరమునఁ గీలించి దక్షవాటికకునమస్కరించిరి. అంతభక్తితో దక్షవాటీమహాపురమునబ్రహ్మ శివలింగమును బ్రతిష్ఠించెను. సప్తగోదావరజలములతో నాబ్రహ్మను

నకు మంత్రపూర్వకముగా నభిషేకించెను; బహువిధోత్సవములను గావించెను. అది మొదలు విశ్వాత్ముఁడు బ్రహ్మపూజితుఁడునగు బ్రహ్మేశుఁడు భక్తవత్సలుఁడగుచు భక్తులను గృపతోఁ బాలించుచుండును. అంత దేవగంధర్వసిద్ధసాధ్యోరగాదులు తమతమ నామధేయములతోఁ శివలింగములను బ్రతిష్ఠించిరి. బ్రహ్మప్రతిష్ఠితుని బాలచంద్రశిఖామణిని బ్రహ్మేశుని మహాభక్తితోఁ బురుహూతుఁడు పూజించెను. బ్రహ్మయును బురుహూతప్రతిష్ఠితుఁడగు నింద్రేశుని భక్తిపారవశ్యమానసుఁడగుచు భజించెను. సకలాఖిలలోకనమున దక్షప్రజాపతిని పలువు పలుమార్లు నుతించెను. ఆదక్షుఁడును నాత్మప్రశంసకు మది పొంగి భారతీపతికిఁ బ్రణమిల్లెను. దేవతలెల్లరును తమతమ నామములతోఁ బ్రశస్తములగు శంభులింగములకుఁ జేమోడ్చి దుగిసుని యానతి గొని దివికిఁ జనిరి. బ్రహ్మయును దాను నిల్పిన బ్రహ్మేశునకు భక్తిని శిరమునంచి మ్రొక్కి సత్యలోకమునకుఁ జనియెను. బ్రహ్మప్రతిష్ఠితుఁడును, బ్రహ్మగోచరుఁడునునగు బ్రహ్మేశునిఁ బూజించు బ్రాహ్మణాదులు బ్రహ్మవిష్ణ్వీశధామములందు సుఖించెదరు. భక్తచింతామణియగు బ్రహ్మలింగసన్నిధిని నరులకుఁ దపోధ్యయనాదులచే సాధింపఁబడని దొక్కటియు నుండదు. మఱియుఁ గపాలేశ్వరస్థానము త్తమమైనదని నుతింపఁబడుచున్నది. లోకపాలకుఁడగు నాకపాలేశుఁడు ముక్తిప్రదుఁడు. మున్ను కాలభైరవుని కరకమలమునుండి కమలాసనకపాలపాత్ర దుకికిలి యఘవిదారిణియగు సప్తగోదావరజలములను బడియెను. అంత నాస్థానమున సద్యోజాతుఁడును సదాశివుఁడును, గృపాలోకపాలితాశ్రితమండలుఁడును నగు కపాలేశుఁడుద్భవించెను. ఆ దేవుని సేవించిన పుణ్యపురుషులకు గాంచినంతనే మనుజుల మహాపాతకకోటి దూరమునుండియే తొలఁగిపోవును. పరమపావనమగు నాకపాలమోచనతీర్థమునందుఁ జేసిన దానహోమజపా

దిక మొక్కొక్కటి కోటి ఫలమునిచ్చును. మఱియు జగన్నుతమగు వరుణేశ్వరనామకస్థాన మొకటి కలదు. అందు వరుణేశమహాలింగము వరుణునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. వానలు లేనపుడా దేవునకు వేయి పూర్ణజల కుంభములతో నభిషేక మొనరించిన మంచి వానలు కురియును. మఱియుఁ గుక్కుటేశ్వరనామకస్థాన మొకటికలదు. అందలి కుక్కుటేశుఁడు ముముక్షువులకు భజనీయుఁడు. తొల్లి యాయందు రేఖాకోటీరునకుఁ గుక్కుటపక్షులతి భక్తితోఁ బ్రదక్షిణించి యాదేవుని కృపచే మోక్షమందినవి. శరణాగతవత్సలుఁడు తరుణాబ్జధరుఁడు కరుణావరుణాలయుఁడు నగు నాచరణాయుధనాథుని వీక్షింపుఁడీ! మహీతలమున మోక్షనామమగు కుక్కుటేశ్వరస్థానము కాశీకేదారగోకర్ణకుంభకోణములకు సాటియై యున్నది. ఆదేవుని సన్నిధిని హోమదేవార్చనాతిథిశ్రాద్ధదాన వ్రతాదికము కోటిగుణితము. మఱియు సర్వదేవనమస్కృతమగు సోమేశ్వరస్థాన మొక్కటి గలదు. అందు సుధామయునిచే సోమునిచే నాసోమలింగము నిలుపఁబడినది. ఆసోమతీర్థ జలమునందు మునుక వేసి సోమేశుని భజించు నరుఁడు కైలాసమున కరుగును. అందుచే మహర్షులెల్లను భక్తివశ్యులగుచు మహాదేవుని సోమేశుని సేవింతురు. మఱియు సర్వదేవ నమస్కృతమగు మాహేశ్వరతీర్థ మొక్కటి గలదు. అందు మునివరులును సిద్ధాదులును మాహేశ్వరదేవుని నిల్పిరి. ఆ దేవుని సన్నిధిని దత్త మగునదియు నిష్ట మగునదియు హుతమగునదియు నధీతమగునదియు బహుఫలము నిచ్చును. గయయందువలె మహేశ్వరతీర్థమునందును మానవులు శ్రాద్ధపిండప్రదానాదులచేఁ బితరులకుఁ దృప్తి గావింతురు. మఱియు లోకపావనమైనదని కీర్తింపఁబడు రామేశ్వరతీర్థ మొక్కటి గలదు. అందలి రామేశ్వరుఁడు సాధకులకుఁ గామితార్థముల నొసఁగును. మఱియు

నా రామేశ్వరసన్నిధియందున్న రుద్రపాదగయయందుఁ బితృయజ్ఞ మొనర్చినవారు మహాఫలము నందుదురు. ఇంకను నధికముగాఁ జెప్పనేల? శ్రీభీమనాథునకును సప్తగోదావరమునకును నడుమ నొనర్చిన కర్మమనంతఫలము నిచ్చును." పులినోద్భవ! పండ్రెండుతీర్థము లేయని పలుకనేల? దక్షవాటీమహాస్థలమునఁ దీర్థముకాని ప్రదేశ మెచ్చట నున్నది? సప్తగోదావరతీరభూమికిఁ గాశీకానగరముకాని, గయాకేదారాదిక్షేత్రములుగాని, సాటికానపుడితరములా సాటియగు నవి! ఈ దక్షవాటికయే యుత్తమమైనది. అందు రామేశస్థాన మభ్య ధికమైనది. అందుసారమును ధర్మప్రదమునునైనది రుద్రపాదమహాస్థలము

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునందు

పన్నొకండవ యధ్యాయము

---

## పండ్రెండవ యధ్యాయము

—♦ అగస్త్యుఁడు వ్యాసునకుఁ బంచతీర్థములను వివరించి చెప్పి భీమేశ్వరాలయమునకుఁ దోడ్కొనిపోవుట ♦—

మరల నగస్త్యుఁడు వ్యాసునితో నిట్లు వాక్రుచ్చెను:—ఓ మునీంద్రా? పంచతీర్థములనుగూర్చి సవిస్తరముగాఁ జెప్పెదను! సావధానుఁడవై వినుము! వానిని దలఁచినంతనే సర్వపాపములు క్షయించును మున్ను దక్షప్రజాపతి యజ్ఞముచేసిన స్థలమున సతీసతి తనతండ్రి కావించిన యవమానమును సైపనోపక యోగాగ్నిచేఁ దన దేహమును త్యజించినది. అది మొదలాస్థానము దక్షయోగాగ్ని త్రయతీర్థమని జగమున నుతింపఁబడుచున్నది. అందు ముక్కవైచినవారలు

ముక్తినొందుటకు సందియము లేదు. అది మేదినింగల సకలతీర్థములం దుత్తమమైనది. దేవతలు కిన్నరులు గంధర్వులు సిద్ధులు చారణులును దానిని సేవించిరి. అచ్చట దేవతార్చనముగాని శ్రాద్ధదానాదితి జపాదికముగాని యొకతడవ సలిపిన సాధకుల కవియనంత ఫలమిచ్చును. అక్లే యఖిలేష్ట సంసిద్ధినామకమను నుత్తమతీర్థ మొకటికలదు. అందెల్ల ప్పుడును నరులకు సకలాభీష్టములును సిద్ధించును. పూర్వ మచ్చటనే పార్వతి చంద్రకళాధరుని సంతసింపఁజేసి యా పరమాత్మున కర్ధాంగి యయ్యెను. నాఁటినుతనాతీర్థ మఖిలేష్టసంసద్ధినామకమని క్షోణీ మండలమునఁ బ్రసిద్ధి వడసెడిని. అందు మునింగిన నరులకుఁ దేహాంత మున శాంభవపదము చేకూఱును. అందలి మహేశుఁడు తన్ను భజించువారలు కోరెడి యర్థము దుర్లభమైనదయ్యును గృపతో సిద్ధింపఁజేయును. ఇది నిక్కువము. మఱియు నచ్చట భక్తితో నొనరించిన హవ్యకవ్యాదిరూపకమగు కర్మము లేశమాత్ర మైనను వీసరవోవక మేరుతుల్యమగును. మఱియు సర్వదేవ నమస్కృ తమై, పుత్రపౌత్రాయురారోగ్యభోగభాగ్యఫలప్రదమై, పుణ్యమై యొప్పు సోమేశ్వరతీర్థ మొండు గలదు. పూర్వము సోముఁడు సకలా శ్రితవత్సలుని మహాదేవుని నారాధించి వరమందెను. నాఁడు మొదలు కొని యా తీర్థము బుధసేవితమై సోమేశ్వరతీర్థమని విఖ్యాతమగు చున్నది. అందుఁ గ్రుంకి యాసోమేశ్వరస్వామికి మ్రొక్కిన సకల పాప ములడఁగును. మునులు విషయాసక్తి వీడి శంసితవ్రతులగుచు ముక్తి గోరి యెల్లపుడు నాసోమేశు నారాధించుచుందురు. సోమధరుఁడును సోమామరపాపదమును నగు నా సోమేశ్వరుఁడు కువలయ మున భక్తియుతులగు నరులకుఁ గల్పవృక్షమై యుండును. మఱియు దేవకిన్నరగంధర్వసిద్ధసాధ్యనమస్కృతమై, పరమపావనమై యొప్పు హైమవతతీర్థ మొకటికలదు. పూర్వము పర్వతరాజు హిమవంతుఁడు

"జగత్రాతయగు మహాదేవుఁడు తన కల్లుఁడు కావలయు"నని సంకల్పించుకొని పదునాలు దివ్యవత్సరములు సుదారుణముగా సప్తగోదావరతటమున నతినిష్ఠతోఁ దపమాచరించెను. అందుచే మహేశ్వరుఁడనుగ్రహముతో నందుదుద్భవించెను. నాఁటినుండియు నాతీర్థము హైమవతమను పేరఁ బరగుచున్నది. అది సకల తీర్థోత్తమమై, బుధసేవితమై, నరులకు భుక్తి ముక్తి ఫలప్రదమై యున్నది. పూర్వము మహాత్ముఁడగు వసిష్ఠుఁడు మంకణున కాశీతాచలవరదుఁడు మనుజులకుఁ గల్పవృక్షమనియు, హైమవతతీర్థమున స్నానమొనరించి హిమవదీశ్వరునకు మ్రొక్కిన నీలోకమున సకల భోగములను గుడిచి యంతమున శంభుపురమునకుఁ బోవుననియు నాహిమాద్రీశుని మధ్యాహ్నభోగఘంటారవము వినిన నరుఁడు ముక్తి కళ్యాణఘంటానాదము విననియు, నుపహారసమయమందలి ఘంటాస్వనమాలించిన మనుష్యుఁడు యముని మహిషకంఠ ఘంటారవమాలింపఁడనియు, హిమాచలేశ మహాతీర్థమునఁ జేసిన శ్రాద్ధపిండప్రదానాది క్రియలు బహుఫలప్రదములై పితరులకుఁ దృప్తి గలిగించుననియుఁ జెప్పెను. సప్తగోదావరతీర్థము సర్వతీర్థములం దుత్తమోత్తమమైనది. శంభుఁడు లోకహితమునకై స్వయముగా నందుద్భవించెను. పూర్వము సప్తమహర్షులును సువ్రతులై లోకపావనమగు నాతీర్థమును భీమేశ్వరాభిషేకమునకై తీసికొనివచ్చిరి. దాని యాధిక్యమును జెప్పఁ జతుర్ముఖుఁడైనను జాలఁడిప్పుడు పెలవారలా పేర్కొనువారలు! సప్తగోదావరము గంగ్రముఁడు; పాషాణములు జనార్దనులు; వాలుకాసంతతి ఋషులు; వృక్షములు దేవతలు. ఆసప్తగోదావరతీర్థము కాశికాపురమందలి మణికర్ణికకుఁ దోడైనది; భీమనాథదర్శనము కాశీవిశ్వేశ్వరదర్శనమే! ఆసప్తగోదావరమున స్నానమొనర్చి జగద్వంద్యుఁడగు భీమనాథేశ్వరేశ్వరున కొక్కమాఱు మ్రొక్కిన నరునకుఁ గైవల్యము

కలుగును. బ్రహ్మేంద్రాది దేవతలును మునులును దృఢవ్రతులై ప్రతి దినమును సప్తగోదావరమున స్నానముచేయ విచ్చేయుదురు. ఆసప్త గోదావరతీర్థమున సాధకులకు స్నానదానజపాదికము గణనాతీత ఫల మునిచ్చును. ఇందులకు సందియము వలదు. సప్తగోదావరస్నాన మును, భీమేశదర్శనమును బుణ్యముచేయనివారలకు దుర్లభమైనవి. సప్తగోదావరమున నీరాడిన నరుఁడే సకల పుణ్యములను సాంగముగా సల్పినవాఁడు. ఘోరసంసార సంతాపజ్వరము శాంతింపఁజేయ సప్త గోదావర సలిలము నరులకుఁ బరమౌషధము. ఆసప్తగోదావరతీర మందలి మణి సోపానపంక్తులు ముక్తి లీలావతీ సౌధదివ్యసోపాన పంక్తులు. సూర్యోదయమున నంధకార బృందమెల్ల నడఁగినపగిదిఁ బాపబృందమెల్ల నాసప్తగోదావర స్నానమున నమసిపోవును. సప్త మునులును స్వయముగా సప్తగోదావరమును దెచ్చి భక్తియుక్తులై భీమలింగమును బ్రతిష్ఠించిరి. ఆమహేశ్వరుఁడు తన్ను భజించువారల కోర్కెలను గొనలుసాగించుట కీవులబ్రమూఁకై యున్నవాఁడు. ఒక్క మాఱు దేవుని నభిషేకించినను, బూలతోఁ బూజించినను, సంసేవిం చినను దలఁచిన తలఁపులు తలకూడును. భీమేశ్వర పార్శ్వమందలి పంచలింగపదములను, బంచతీర్థములను సేవించినవారల పంచమహా ఘోరపాతకములు పటాపంచలగును. అందలి కాసారములందైనను, డిగ్గియలందైనను, స్రోతులందైనను, గాల్వలందైనను గ్రుంకినఁ బంచ తీర్థములాడిన ఫలము కలుగును. భీమేశపత్తనమున నగస్త్యేశుఁడు, రామేశుఁడు, నాకులేశుఁడు, గణేశ్వరుఁడు, పాతాళ భైరవుఁడునను దేవతా పంచకమును, నీపంచతీర్థములను గాంచిన ద్వాదశక్షేత్రములను సందర్శించిన మహాఫలము సంభవించును. ఆదిమూలమగు మూలస్థా నేశ్వరలింగమును విలోకించిన నీక్షేత్రమందలి యన్యలింగములను దర్శిం చిన ఫలమబ్బును. సప్తగోదావరమును, భీమేశుని, నాకులేశ్వరుని, రుద్ర

పాదస్థలమును భక్తితో సంస్మరించిన నరుఁడు ధన్యతముఁడగున"ని కుంభజుఁడు దక్షపురాధిక్యమును, భీమలింగవైభవమును, సప్తగోదావరోత్కర్షమును, ద్వాదశక్షేత్రగౌరవమును, బహుతీర్థప్రభావమును వ్యాసునకు వినిపించి మరల నిట్లనియెను:—ఓకృష్ణద్వైపాయన! సర్వలోకాధినాయకుఁడగు భీమేశ్వరుని సేవింప మనమెల్లరమును బోవలయును. మధ్యాహ్న భోగవేళయగుచున్నది. అదే! యాలింపుము! నాట్యసౌధాంతరమున గంభీరమృదంగనాదము వినవచ్చుచున్న ద"ని లోపాముద్రతోడ నగస్త్యుఁడును, శిష్యులతోడ వ్యాసుడును భీమేశునిఁ జూడవచ్చిరి. అంతఁ ద్రిపురాసురసంహారము కాలకూటాగ్నిభక్షణము దక్షాధ్వరధ్వంసము, పంచాయుధవధోద్ధతము, జంభాంతకభుజాస్తంభ దంభోళిస్తంభనము, దేవదారువనక్రీడ, యురులింగసముద్భవము, గౌరీకళ్యాణకేళి, గజాసురఖండన, మంతకౌద్ధత్యహరణము, జలంధర మారణ, మంధకాసురభంగము, మృత్యువక్షస్తాగ్రతాండవము, బ్రహ్మ శీర్షవిచ్ఛేదము, శరభాకారజృంభణము మొదలగు శంకరచరిత్రములను బాగుగఁ బాడెడి గంధర్వనాయకులతో నిండియుండి రమ్యమగు మండిన భీమనాయకాలయ విశాలమంటపోదారద్వారమును దపోధన పుంగవులు ప్రవేశించిరి. అంత భృంగి మహానాట్యనిత్యారంభవిజృంభణమును, త్రయస్త్రింశత్కోటి సంఖ్యాబృందారకసమాకులమును, జతుష్షష్టికళాయుక్తవాణీస్ఫూర్తి ప్రకాశితమును, సింద్రదత్తాప్సరః కాంతాసహస్ర పరిశోభితమును, నసంఖ్యాత జగత్ఖ్యాతప్రమథవ్రాతసంకులమును, గమనీయప్రభాకర్ణచక్షుఃశ్రవదాయకమును, గైలాసశైలసంకాశమునునగు భీమనాథుని కళ్యాణాచలమంటపమును బ్రీతితోఁ గాంచిరి. దానికిఁ బూర్వభాగమున విపులమై, చంద్రకోటి సమప్రభమై, యభ్రంకషమై, శుభ్రరోచిర్మణిస్తంభవిరాజితమై, లోచనానంద దాయకమై, యున్నలోకనాథుఁడగు భీమనాథుని యాస్థాన

మంటపము నవలోకించిరి. పదపడియాసంయమి నాయకులు బహిర్గేహ ప్రదేశమునందున్న పరివార దేవతల కెల్లరకు భక్తితోఁ బ్రణమిల్లిరి. దర్ప హారియు దక్షూపహారకుండును నగు దండపాణీశ్వరుని దాంతులగుచు దండప్రణతి పూర్వకముగాఁ గైవార మొనరించిరి. అంతఁ దాపసభాగ్యమై నందిబాహుదండ మండలి సౌవర్ణ వేత్ర తాడనమునకు భీతిల్లిపలాయి తులగు చుండిన యమరగుండల మున్నెడిన శ్రీభీమేశమహాప్రభుని మందిరమహాద్వారమును జొచ్చిరి అప్పుడు భక్తితో మహాత్ములగు ఋషి పుంగవు లంతర్గృహమును బ్రదక్షిణించిరి; భీమనాథుని వల్లభయగు పార్వతికిఁ బ్రణమిల్లిరి; కుమారగుహు నారాధించిరి; గజాననునకుఁ గైమోడ్పులిడిరి; సర్వమంగళయను దుర్గామహాదేవిని నుతించిరి; ఆశాత టశాటీకుని, నటునకు భైరవుని వీక్షించిరి; సర్వలోకపావనాత్మకుఁ జతుర్ముఖునకుఁ జేమోడ్చిరి; సర్వలోకైక రక్షకుని, లక్ష్మీరమణుని సేవించిరి. అట్లు క్రమముగా పరివార దేవతలను బొగడిరి అంతట మేరుపర్వత ప్రతీకాశమును, సహస్రార తిరస్కారి స్వర్ణకుంభ విరాజితమును, విశ్వ దిఙ్మండల వ్యాపి తేజః పుంజసముజ్జ్వలమును, దివ్యమాణిక్య కలితమును, చంద్రమండల చుంబియు నైయుండుటచే నొక ప్రతిక్షణమును గౌతుకమున వైమానికులచే వీక్షింపఁబడునదియు సాక్షాత్కైలాసన్నమై యున్న భీమనాథుని స్వర్ణప్రాసాద మెక్కిరి. అందు జగద్వంద్యుండై పరిపూర్ణకృపానిధియై, సుప్రసన్నుఁడై, దీనబంధువై, భక్తవత్సలుఁడై, వరదుఁడై భక్తార్తిధ్వాంత భాస్వంతుఁడై, భక్తానంతఫలప్రదుఁడై, భక్తానుకూల సంచారుఁడై, భక్తభక్తిపరాయణుఁడై. భక్తాధీనుఁడై, భక్తసుఖుఁడై, భక్తచేతోవిహారియై, భక్తోక్తకారియై, భక్తేతరసుదుర్లభుఁడై, శీఘ్ర ప్రసన్నుఁడై, సులభుఁడై, సాత్త్వికుఁడై, శుద్ధవిగ్రహుఁడై, తమోగుణ నియంతయై, తారకుఁడై, తాపహారియై తారకమంత్రైక దైవతమై, తాపసాశ్రయమై, తారకోపదేష్టయై, జ్ఞానసంపత్ప్రదాతయై, సర్వాభీష్ట

శ్లో॥ భక్త్యాభజంతి యం దేవం భక్తవ్రతాభివృద్ధయే
భార్గవీ భారతీ ముఖ్యా భీమేశం తం భజామహే।



సీ॥ లక్ష్మి వాణియు మొదలగు ♦ లలనలెల్లఁ । బ్రియులు వర్ధిల్లఁ దనయులు ♦ పెంపుగాంచ
నిత్యమును గొల్తు రెవ్వాని ♦ నిష్ఠతోడ । నట్టి భీమేశు భజియింతు ♦ మహాగహంబు॥

ప్రదాతయై, భోగమోక్షప్రదాయకుఁడై, హరిబ్రహ్మాదిసేవ్యమానుఁడై నిరీశ్వరుఁడై, మహేశ్వరుఁడై, మహాదేవుఁడై, మహామూర్తియై, యనవరత ముపాసించువారల యపరాధసహస్రముల నెఱిఁగియు విస్మరించువాఁడై యున్న భీమనాథేశ్వరుని భక్తితోఁ గాంచిరి. అంత వారలకు దేహములందు పులకాంకురములు పొడసూప సాష్టాంగదండప్రణామ మాచరించి యంజలిపుటములు ఘటించి యిట్లు స్తుతించిరి:—దేవదేవ! మహాదేవ! నీలగ్రీవ! సనాతన! భావనాతీత! భూతేశ! భీమనాథ! నీకు నమస్కారము. సర్వజ్ఞ! సర్వదేవేశ! సర్వాత్మ! సర్వకారణ! విశ్వేశ్వర! విరూపాక్ష! భీమనాథ! నీకు వందనము; కాలసంహార! కాలాత్మ! కలికల్మషనాశన కామితప్రద! కామారి! భీమనాథ! నీకభివాదనము; శంభు! శశాంక కోటీర! శరణాగతవత్సల! శివ! శంకర! శాంతాత్మ! భీమనాథ! నీకు మ్రొక్కు; నిర్వికల్ప! నిరీహ! నిరుపద్రవ! నిరాకార! నిర్మలాకార! భీమనాథ! నీకుఁ గేకిసలు; భూమిశతాంగ! దిగ్వస్త్ర! వ్యోమకేశ! మహాత్మక! భామాశోభితవామాంగ! భీమనాథ! నీకుఁ గేలుమోడ్పు; అనాథనాథ! మన్నాథ! దీననాథ! దయాసింధో! గౌరీనాథ! జగన్నాథ! భీమనాథ! నీకుఁ గేలుమొగ్గ; మోక్షప్రద! సూర్యాక్ష! పుండరీకాక్ష పూజిత! దక్షనాశ! ఫాలాక్ష! భీమనాథ! నీకు జోహారు" అని పెక్కు తెఱంగుల నుతియించిరి. బంగారుపూవులతోఁ బూజించిరి. సప్తగోదా వరనదీ కనకాంభోజపూజ గావించిరి. ప్రార్థించిరి. సకలోపచారము లొనర్చిరి. మహామాహేశ్వరులును ధన్యులును నగు ద్వైపాయన ఘటోద్భవు లావిధమున భీమనాథేశ సమారాధనతత్పరులైరి.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునఁ బండ్రెండవ యధ్యాయము.

---

## పదుమూఁడవ యధ్యాయము.

—• వ్యాసుఁ డగస్త్యుని వీడ్కొల్పి శిష్యులతోడ భీమనాథుని సేవించుట •—

పెన్నిధిగన్న పేదచందమున నట్లు ద్వైపాయనమౌని శ్రీభీమ నాయకునిఁ గాంచి పరమానందము నందెను. అంతఁ బారాశర్యుఁడు మహాత్ముఁడగు నగస్త్యమునిపుంగవుని వీక్షించి పరమప్రీతుఁడై సగౌరవముగా నిట్లనియెను:— ఓయగస్త్యమునీంద్ర! నీప్రసాదముచే భీమమండలమును గంటిని; ద్వాదశక్షేత్రములను, బంచతీర్థములను గాంచితిని; దక్షనగరిని వీక్షించితిని; భీమనాయకుని దర్శించితిని; ధన్యుఁడనైతిని; కృతకృత్యుఁడనైతిని. ఓమహాత్మా! కుంభసంభవ! నీవిఁకఁ బుణ్యమగు నీ మహాక్షేత్రమునందు దీనిస్థలమునఁ బత్నితోడఁ దపోనిష్ఠాపరుఁడవై యుండుము. నేను నిచ్చటనే యుండి విశ్వేశకృతధిక్కారమువలనఁ జనించిన ఖేదము వాయ సేవకవత్సలుఁడగు భీమేశుని సేవించెద"నని చెప్పి యా యగస్త్యుని వీడ్కొల్పెను. అంత వ్యాసుఁడు భీమేశసేవానిరతుఁడగుచు శిష్యులతోడఁ గూడి పంచతీర్థములందును స్నానమొనరించి శంభులింగసన్నిధిని బ్రణవాన్వితమగు పంచాక్షరీ మహామంత్రము జపించుచును; నలుదెసలందుఁ బ్రఖ్యాతములగుసోమేశ్వరములందు భక్తితోఁ గ్రమముగాఁ బ్రదక్షిణమొనరించుచును; మణికర్ణికాసమమగు కుక్కుటేశమహాతీర్థమునఁ గ్రుంకి కుక్కుటేశుని భజించును; పుణ్యమగు నోంకారనగరమందుఁ ద్రికూటోదరమున నున్న బ్రహ్మవిష్ణుమహేశ్వరులను గీర్తించును; తుల్యభాగాతరంగిణియందు మునుఁగును; గోదావరియందు బ్రుంగును;సాగరమందోలలాడును; సప్తగోదావరమందు స్నానమొనరించును; నిత్యము శంకరు నర్చించును; భీమేశమహిమాకేళిచే సంమోదించును; భీమేశచరణకమలముల కెప్పుడును బ్రణమిల్లును. ఆమునివర్యుఁడు మాతృగర్భగృహోత్పన్న

మను సుహాఖేదము వివర్తింప మహాదేవుని మహాగర్భగృహము నాశ్ర యించును. అనిశము పరమేశ్వరుని సేవాపర్యుత్సుకతచే చిత్తము నందు మాటిమాటికిఁ "దానత్యంతధన్యుఁడ నైతిన"ని తలఁచుకొను చుండును. శివా! శంభూ! విరూపాక్షా! మహేశ! భగవానుఁడా! యని రోమాంచపటలి ధరించి హర్షగద్గదనిస్వనుఁడై కరతాళ వితానముతో లజ్జాభిమానము లుజ్జగించి మాటిమాటికిఁ గొంతెత్తి శంభు గీతములను బాడును. దక్షవాటీశ! భీమేశ! సదాశివ! దయానిధి! మహాప్రభూ! నన్ను రక్షింపుమని విన్నపము చేయును. మఱియు నా మానిసిఁ డీశ్వరాధీనమానసుఁడై బాలోన్మత్తపిశాచము వలె సిగ్గు వీడి యంగడివీథులందుఁ దిరుగాడును. ఆసంయమీంద్రుఁడు సుధా కాంతితో దీపించు భీమలింగమునకు బాహుద్వయమునఁ బరిరంభ మొనరించును. ఆమహాతపస్వి తన జటాగుచ్ఛము విరియ నిందుశిఖా మణిపీఠమునకు భాలతలమును దాఁకించుకొనును; దక్షనగరీమహా క్షేత్రమును ప్రదక్షిణించును; పాతాళ భైరవప్రముఖు లగు దేవతలను గాంచును. ఓభీమనాథా! నేను కాశికాద్రోహిని, విశ్వపతిదూషితుఁ డను, పాపిని రక్షింపు మని యంజలి ఘటించును. నీలకంఠా! పాప సంహార! పాపములకు నీపాదపద్మసందర్శనము దక్క వేఱొండు ప్రా యశ్చిత్తము లేదు. ఓప్రభూ! నీవు సకలశరీరులకుఁ బ్రాణప్రయాణ వేళ తారకమును గర్ణమూలమునఁ గథింతువు. ఓదేవా! కలియుగ మునఁ బుణ్యహీను లగువా రెంత యత్నించినను నీదర్శనస్పర్శనములు వారలకత్యంత దుర్లభములై యుండును; వభదీయ నివాసమగు నీదక్ష వాటీమహాపురియందు నివసించెడి మానవులకు భోగమోక్షఫలమన నెంతటిది! దేవేశుఁడవు మహేశ్వరుఁడ వగునిన్ను శిష్యులతోడఁ గూడి సేవించుచున్నాఁడను. దక్షవాటీపురాధిపా! శరణాగతమందారా! భీమేశ్వరా! కరుణాసింధూ! నేను విశ్వేశునికోపముచేఁ గాశికానగర

మునను౦డి కదలి వచ్చితిని. రక్షింపుమని విన్నవించుకొని మునివరుఁడు నిత్యసేవాపరాయణుఁడగుచుఁ బరమేశ్వరుని భక్తితృష్టాతిరేకమున నిట్లు నుతింపఁ దొడఁగెను:— ఓ భీమేశ్వరా! నీవీవిశ్వమునకీశ్వరుఁడవు. అమితపరాక్రముఁడవు, విశ్వమే నీ కాత్మము; విశ్వమునే భుజింతువు; సృజింతువు; పండితుల మనఃపద్మములకుఁ బ్రభాకరుఁడవు! జ్ఞానశాస్త్రములచే నెఱుఁగఁదగినవాఁడవు; నీకు నమస్కారము! దక్షుని యాగమును ధ్వంసము చేసినవాఁడా! నమస్కారము! త్రిపురాసురులనంత మొందించినవాఁడా! నమస్కారము! హాలాహలమును భక్షించినవాఁడా నమస్కారము! మూఁడవకంటను మన్మథుని రూపుమాపినఁవాఁడా! నమస్కారము! పార్వతీపతీ! బ్రహ్మాదిదేవతాప్రభూ! నిన్ను భజించు వారల యశుభాంధకారమునకు సూర్యుఁడవు. పరమేశ్వరా! నీకు నమస్కారము. పర్వతనివాసా! నాగేంద్రభూషా! నారాయణుఁడు తన నేత్రపద్మమున నీపాదద్వంద్వమును బూజించెను. నీకు నమస్కారము. అనంతశక్తీ! భగవానుఁడా! సకలోకపనిషత్తులను వనితల శిరోరత్నములు నీపాదపీఠము నంటుచుండును; నానాజగన్నాటకములకు సూత్రధారుఁడవు. నీకు నమస్కారము. ఓవృషకేతనా! అత్యంతపాతకుఁడైనను నొకసారియును నీలింగమూర్తిపైఁ బడవైచిన నచిరకాలముననే భోగాపవర్గములనందుచున్నవాఁడు. నీకు నమస్కారము పరమపురుషా! బ్రహ్మమలు శ్రేయము గలుగఁ దమశిరఃకిరీటములందు వెలిఁగెడి రత్నదీపములతో నీపాదపీఠమునకు నివాళింతురు! నీకు నమస్కారము. నిరీశ! నిరంతక! నిస్త్ర్యల్యధామ! నిరుపద్రవ! నిస్సంగగమ్య! నిరాశ్రయ! నిర్వాణనాథ! నీకు నమస్కారము. భక్తానురక్త! అనుపమప్రభావ! భవ! ఉగ్ర! దుఃఖార్ణవకర్ణధార! భూరిప్రభావ్యాప్తనభోవకాశ! భూతేశ! భీమేశ! నీకు నమస్కారము. భీమేశుని నామా

మృతము గ్రోలు జిహ్వాయే జిహ్వా; శ్రీదక్షవాటీశ్వరమూర్తియందు లగ్నమగుదృష్టియే దృష్టి; దక్షిణసాగరతీరవాసుఁడగు భీమనాథుని కథారసమును గ్రోలెడి శ్రవణమే శ్రవణము; తారకబ్రహ్మోపదేశకుఁడగు భీమేశుని మూర్ధార్చనమున నొప్పెడి హస్తమే హస్తము; మన్మథహరుఁడగు భీమేశునకుఁ బ్రదక్షిణము చేయు పాదములే పాదములు; అంబికానాథుని పాదపద్మములపై నిలుపఁగోరిన చిత్తమే చిత్తము. పెక్కుమాటలేల? క్షీరసాగరమున జనించిన హాలాహలముచేఁ బీడింపఁబడిన లోకములను రక్షింప గళమునఁ గృష్ణోగ్రచిహ్నమును ధరించిన ప్రభువు నాశ్రయించెదను. ఓ చంద్రమౌళీ! దొరికిన భిక్షచే నాఁటి చిచ్చు నడఁచుకొనియు, భోగశక్తిచే విషయాభితర్షమును దొలఁగించుకొనియు, నిస్పృహులు నిన్నుపాసింతురు; కాన నిన్ను సేవింతును. తీరములందనేక మునీశ్వర సహస్రములతో నిండియుండిన సప్తగోదావరజలపూరమున స్నానమొనర్చి విమలాంతరంగుఁడనగుచు కరుణాసాగరుని భీమనాథుని భజింతును. దాసజనులకు దృష్టాదృష్టఫలము లొసఁగఁగ దేశనిష్టాపరతాంతరాత్ముఁడగుచునుండిన వామదేవుని శరణుచొచ్చెదను. భర్గా! నీముంగల గంధర్వులు యక్షు లురగులు సిద్ధులు సాధ్యులు గీర్వాణులు విద్యాధరులు కిన్నరులు మొదలగువారలు నమ్రులై మహోన్నతి నందుదురు. ఇదె నీకుఁ బ్రణామిల్లెదను. వసిష్ఠాదిగరిష్ఠమౌనిశ్రేష్ఠార్చితశ్రీచరణకమలుఁడై, యాశ్రితజనరక్షానిష్ఠుఁడై, జేష్ఠుఁడై, శ్రేష్ఠుఁడై, భానుకృతప్రతిష్ఠుఁడైయున్న భీమేశ్వరుని భజింతును. ఓ భీమనాథ! నీవు మోహమునడఁచినవాఁడవు; గజాసురుని జయించినవాఁడవు; ఉపమానము లేనివాఁడవు; అనల్పగుణములను బేరొందినవాఁడవు; హృదయాంధకారమును దొలఁగఁద్రోసినవాఁడవు; బుధులందఱు నిన్ను నుతింతురు. బ్రహ్మకపాలమును జేతఁబట్టినవాఁడవు. నిన్ను భజింతును. ఓ భీమేశ!

నీవాదిమధ్యాంతరహితుఁడవు; అభ్రకేశుఁడవు; దురంతసంసారహరుఁడవు; ఈశుఁడవు; యమాంతకుఁడవు; దాంతుల మనస్సునందు వసించువాఁడవు; శాంతుఁడవు; గొప్పవాఁడవు. నిన్నెల్లప్పుడును హృదయమునఁ జింతింతును. ఓమహేశ! నీవు కుందేందుమందారసుధారసాభుఁడవు; కందర్పకోటి ప్రతిమానరూపుఁడవు; బృందారకవంద్యపదారవిందుఁడవు; చిదానందమయుఁడవు; నీకు వందనమొనర్చెదను. ఓభీమేశ్వరా! నీవు మేరుపర్వతధనువునందలి వాసుకి గుణమున నారాయణాస్త్రమును సంధించి యాకసముననుండియే త్రిపురాసురులను సంహరించిన యద్భుతవీరవర్యుఁడవు. నిన్నారాధించెదను. దక్షపురాధినాథా! నీవు మోక్షప్రదుఁడవు; క్షోణీధరేంద్ర కన్యావక్షోరుహాస్తనకటాక్షవీక్షణుఁడవు; ఉక్షేశవాహుఁడవు; ప్రణతాంబుజాక్షుఁడవు. నిన్ను సదావీక్షించుచుందును. ఓ భీమేశా! నీవనాద్యుఁడవు, ఆద్యుఁడవు, భవరోగవైద్యుఁడవు, విద్యాధినాథుఁడవు, విబుధాభివాద్యుఁడవు, విద్యోతమానుఁడవు, సద్యోజాతుఁడవు, విశ్వవేద్యుఁడవు. నీకుఁ బ్రణతి. భీమేశా! నీవు హిమనగతనయకల్లుఁడవు; ఆర్తులను రక్షించువాఁడవు; కపాలమును గరమున వహించినవాఁడవు; నీలవినీలకంఠుఁడవు, భాలనేత్రాగ్నిచే హృద్భవుని భస్మముచేసినవాఁడవు. నిన్నుఁ గొనియాడెదను. ఓ మహాదేవా! నీవు కైలాసవాసుఁడవు; చంచలాత్ములకు దూరమున నుండువాఁడవు, తాపత్రయపర్వతవజ్రపాణివి; గంగాచారుజటాజూటుఁడవు; తమోహరుఁడవు. నీకు మ్రొక్కెదను. ఓశంకరా! నీవు కేవలము సంగనవు కాని, పురుషుఁడవు కాని, యుభయాత్మకుఁడవు కాని, కానివాఁడవు; భూతజాతమును బుట్టించువాఁడవు. నిన్నాశ్రయించెదను. ఓప్రభూ! అనర్గళమగు నీ యాజ్ఞచే నెప్పుడును నీజగములు వర్తిల్లును; సితాసితవిగ్రహుఁడవు. నిన్నుఁ దక్క నన్యదైవమును దలఁపను. ఓభీమనాథ! హరిబ్రహ్మాదులు నీయాజ్ఞాబలముననే

తమతమ యధికారములందనహితులై యుందురను ఖ్యాతి వడసిన వాఁడవు. నిన్నుఁ దక్క నన్యదైవమును భజింప నొల్లను. ఓ యీశానా! అవ్యాహతశాసనా! నీయానతి లేక యీజగమున నత్యల్పమగు తృణాగ్రమైనను జలింపదు కాన నిన్ను వదలి యన్యదైవమును భజింపను. ఓ వృషభవాహనా! సచ్చిదానందమయుఁడవయ్యును సృష్టింపశక్తితోడ లీలలను బొందుచున్నవాఁడవు; కాన నిన్నుఁ దక్క నన్యదైవమును భజింపను. ఓహరా! అంధకారావృతమగు వస్తువు సూర్యప్రకాశముచేఁ బ్రకాశించునటుల నీప్రకాశముచే నీజడము భాసిల్లుచున్నది. స్వయంప్రకాశుఁడవు, తమోతీతుఁడవు; కాన నిన్ను వదలి యన్యదైవమును భజింపను. ఓ విశ్వాత్మకా! సర్వనియామకా! యంత్రగానిచే యంత్రము త్రిప్పఁబడునటుల సర్వజగచ్చేష్టలు నీచే నడపఁబడుచున్నవి; కాన నిన్ను దక్క నన్యదైవమును భజింపను. ఓ శుద్ధస్ఫటికసంకాశ! నీవశరీరుఁడవయ్యును భక్తులను ననుగ్రహింప స్తోత్రపాత్రమగు శరీరమును దాల్చితివి; కాన నిన్నుఁ దక్క నన్యదైవమును భజింపను. ఓ యుమ్మతాంగా! నీవు శిరమున గగనగంగను, కిరీటమునఁ జంద్రుఁడను నర్ధదేహమునఁ బ్రియయు, లలాటమున నగ్నియు, గళమున విషమును గలవాఁడవు; కాన నిన్నుఁ దక్క నన్యదైవమును భజింపను. ఓ భీమేశా! దీనబంధూ! సమస్తలోకాశ్రయపాద! బ్రహ్మాదిదేవవంద్య! నాయపరాధము సైఁపుము! గౌరీపతీ! శ్రీదక్షవాటీశ్వరా! భోగలక్ష్మమోక్షప్రదానదక్షమసత్కటాక్ష! విశ్వమూర్తి! భక్తవ్రజాధీన! దయాధినాథ! నన్నురక్షింపుము! తండ్రీ! నీవు జగద్గురుఁడవు, దయార్ద్రచేతస్కుఁడవు, కృపతో నాయపరాధమును సైఁపుము! కృపాపరుఁడగు తండ్రికిఁ బుత్రుఁడొనర్చిన యపరాధము సైఁపఁదగదా! ఓ శివా! జనులయపరాధకోటులను సహించెడి శీలము నీకున్నపుడు నాయపరాధము సైఁపుమనుట సూర్యప్రకాశమునుగనుఁగొన దీపము వెలిగించుటయే

యగు. ఓభీమేశ్వరా! నేను మహాపరాధమొనర్చినవాఁడ నయ్యును క్షమాభూషణుఁడవగునీకోపమునకు బాత్రుఁడను గాను. అట్లుకా నీభూషణమునకు సత్త్వముచే మహాప్రకాశమున్నది. ఓపశుపతీ! నరులపాపములను మఱపించెడినీక్షమాగుణమును నేనేమని పొగడనేర్తును! దుర్బుద్ధులగువారలును నిన్ను పాసించినంత నే క్షమాదిగుణముల నొప్పుచుందురు. ఓదక్షపురవాస నిన్ను భజించువారలకే ధ్వంసములగుచుండ శీతలమగు గంగాజలమును, ఘోరమగు నగ్నిని, సుధామయుఁడగు చంద్రుని విషమును సమముగా ధరించుచున్నవాఁడవనునది చిత్రమే కాదు. ఓప్రభూ! నీవు కేవలులగువారలయపరాధముల నెల్లఁ గాచుటయే కాక పాపములొనర్చువారల కెల్లరకు నహేతుకబాంధవుఁడవై శుభమిచ్చి రక్షించుచున్నాఁడవు; ఓమహేశా! ప్రాణులకు నీవే తల్లివి; తండ్రివి; బాంధవుఁడవు; విద్యవు; గురుఁడవు; నివాసమవు; విత్తమవు; బలమవు; తాతవు; సఖుఁడవు; దైవమవు ఇంకను నదియు నిఁక నేల? సర్వమును నీవే! ఓమహాదేవా! చూడ వేడుకపడెడి నటుఁడు తెఱలో నున్న నట్టునిఁ జూచిన పగిది నీవు బుద్ధియను తెఱలో నున్నను నిన్ను జ్ఞాననేత్రముచే బాగుగాఁ జూచుచున్నాఁడు. ఓసప్తగోదావరతీరవాసా! విషయాభిలాషయను మదగజప్రౌద్ధత్యమునఁ గలఁగఁబాఱక స్వచ్ఛముగా నుండు సుధీమానసమను మానసమున రాజహంసవగుచున్నాఁడవు. ఓశూదిమూర్తి! అద్దమునఁ దనమూర్తిఁ జూచుకొనునటుల సత్సంగతిఘర్షణమున రాగాదిమలములు పోవుటచే విశుద్ధమగు స్వచిత్తముకురములందు బుధులు నిన్నుఁ జూతురు. ఓభీమనాథ! దరిద్రులభాగ్యనిమీలితనేత్రులును తమముందు స్ఫురించుచుండిన దానిని గానలేకుండిన చందమున నే విమూఢులు సతతము తమ హృత్ప్రదేశదేశములం దీశ్వరుఁడవై యున్న నిన్ను గానరాకున్నారు. ఓచంద్రరేఖామకుట! అనవరతయోగాభ్యాసప్రవీణులగుమహాత్ములు నిర్మల

బోధశక్తితో ధ్యానింపఁ దగినదియు, శ్రేష్ఠమైనదియు, సత్యమైన దియు నగు వస్తువవు నీవే! ఓపరమేశా! నీవు గోటికొనను బ్రహ్మ శిరమును గిల్లితివి; ముకుందుఁడు తన నేత్రకమలముతో నీపాదపద్మ మును బూజించెను. నేత్రాగ్ధ్వారమున సకలదేవతలను వెలిపించితివి; కాన నీకంటె నధికుఁడగు దేవుఁడెందున్న వాఁడు! ఓభీమేశ్వరా! దేవ తలెల్లనును సమగ్రశక్తితో శేషాహిరాజనుండి రాభిరామములకు నీకోమలాంఘ్రులకుఁ దమకిరీటములనెడలి మందారపుష్పమరందజల ములతో నభిషేకింతురు. ఓభీమేశా! సముద్రమును మథింపఁగాఁ బుట్టి, దేవతలకు వెఱపు గొలిపి ఖిన్నులఁ జేసి బాధించిన మహావిషము నీకంఠదేశమున నింద్రనీలమువలె భాసిల్లుచున్నది. ఓపురారి! బ్రహ్మాదిదేవతలు మృదంగాదులను ధరించి సేవిం చుచుండ నక్షత్రముల భ్రమింపఁజేయు గంగాజలకణములచే బ్రహ్మాండమెల్ల వెల్లనగునట్లు నాట్యమాడుచున్నాఁడవు! ఓనృపాంక! సంకర్షణరుద్రమూర్తివై పాతాళలోకమునుండి వెడలి దంష్ట్రాగ్నిజ్వాల నాశనమును దెలిచి బ్రహ్మాండఖండములనెల్ల గ్రసింతువు. ఓభర్గా! నీవు కల్పాంతమేఘనాదకఠోరమగు స్వరమహాట్టహాసముచే గర్వోద్ధతుఁ డగు, హస్తాగ్రవజ్రభయంకరుఁడగు నట్టి జంభరిపువును వినీతునిఁ గావించితివి. ఓదేవదేవా! నీస్తాగ్ని స్తంభతనుఁడవగు నీదు క్రిందు మీఁదులను మహాప్రయత్నముతోఁ గనుఁగొనఁ జని వెడలిన విరించి నారాయణులకు దూరస్థుఁడవైతివి. ఓహర! నీవు గిరిని చాపముగను శేషుని గుణముగను, విష్ణుని బాణముగను, భూమిని రథముగను, బ్ర హ్మను సారథిగను, సూర్యచంద్రులను రథచక్రములుగను, దేవగణ మును భటులుగను జేసికొని త్రిపురములను హరించితివి. ఓయద్రిక న్యాకుచశాతకుంభకుంభద్వయాలింగన! నీకు జేజే! ఆర్తసంరక్షణ! శ్వర! శంభూ! మహాదేవా! మహానుభావా! నీకు జేజే! దక్షిణ

కాశీనివాస! అంధకగజకాలజలంధరాది శత్రుతిమిరమునకు సూర్యుఁడవు; ఆశ్రితులమనోరథములను సిద్ధింపఁ జేయఁ జాలినపారిజాతమవు. నీకు జేజే! భూమ్యాద్యష్టమూర్తి! త్రినేత్ర! ప్రమథేశ! రుద్ర! గిరీశ! మృత్యుంజయ! దేవదేవ! నీకు జేజే! కైలాసగిరింద్రవాస! మహాప్రభూ! శంకర! శూలపాణి! స్వయంభూజ్వాలలింగమూర్తి! శ్రీదక్షవాటీశ్వర! భీమనాథ! నీకు జేజే!" యని భక్త్యావేశమున మునివరుఁడు భీమేశ్వరుని నుతించుచుఁ బింగజటాజూటము చలింప నాట్యమాడెను. అప్పుడానందాతిశయమున నామునివర్యునకు గంఠము డగ్గుత్తికనసియెను; కన్నులాసంచి బాష్పపూరితము లయ్యెను; సర్వాంగములు పులకించెను. అంత నవన్యమానసుఁడగుచు నుండఁగా నభోవీథినుండి యశరీరవాణి యిట్లనియెను:—ద్వైపాయనమహామునీ! దయామయుఁడు, భక్తవత్సలుఁడు, మహాదేవుఁడు నగుభీమేశుఁడు నిన్ను రక్షించెను; నిత్యమును సుఖముగా నిచ్చటనే నివసింపుము! ఈయిందుమౌళి సుప్రీతుఁడై నీతప్పుగాచెను; భీమనాథుని భజింపుము! నీకుఁ గార్యసిద్ధి కాఁగలద"ని యశరీరవాణి పలుకఁగ మహాముని యగు సత్యవతీతనూజుఁడు విని శర్వాణీవల్లభుని స్మరించి మ్రొక్కి నితాంతసంతోషతరంగితహృదంతరుఁడగుచు శిష్యులను జూచి యిట్లనుః—పైలా! దక్షపురీశుఁడు మనకుఁ గల్పవృక్షమయ్యెను జుమీ! సుమంతా! పార్వతీకాంతుఁడు మనకుమహాతపఃఫలము చుమ్మీ! జైమినీ! ఈభీమనాథమహాప్రభుఁడు సుప్రీతుఁడయ్యెను జుమా! దేవలా! మహాదేవుఁడు మన యెడ దయతోడ నున్నవాఁడు చుమ్మీ! వైశంపాయనా! దేవేశుఁడు మనకు బహుశుభము లొసఁగును జుమ్మీ! ఈతని యనుగ్రహమున మనమెల్లరమునుగృతార్థులమైతిమ"ని బాదరాయణుఁడు పరమానందముతో మనోరమమగు దక్షారామమున శిష్యులతోడఁగూడి నివసించెను. వాల్మీకివ్యాసులకు స్తోత్రపాత్రములగు

శ్రీమద్రామాయణ దశకోటిరామాయణములే కలిమలాపహములని"
సూతుఁడు చెప్పఁగా శౌనకాదులు విని యాతనిని గొనియాడి మరల
నాతనిచేతనే భీమేశమాహాత్మ్యమును విన వేడుక పడిరి.

ఇది స్కాందపురాణము నందలి భీమఖండమునఁ బదుమూఁడవ యధ్యాయము

---

పదునాల్గవ యధ్యాయము

—• నారదుఁడు భరద్వాజాదిఋషులకు భీమేశునియొక్కయు
సప్తగోదావరముయొక్కయుఁ బుట్టుకలను జెప్పుట •—

నైమిశారణ్యమునందలి ఋషులు సూతున కిట్లనిరి:—"ఓ సూత!
నీవు ధర్మవిదులలో శ్రేష్ఠుఁడవు మహామతివి, వ్యాసశిష్యుఁడవు.
శుభములొసఁగునట్టి భీమేశ్వరమాహాత్మ్యము నీచే వింటిమి. మరల
నిప్పుడు భీమలింగముయొక్క పుట్టుకయును, సప్తర్షిప్రభావమున
సప్తగోదావరము వచ్చుటయును, భీమేశప్రతిష్ఠయును గూడ నీవలననే
వినవలచితిమి: కాన కలదంతయు మాకు వచింపుము! వ్యాసుని
యనుగ్రహమున నీ కట్లు పలుకఁగల నేర్పు గలద"ని వేఁడికొనినంతనే
యాతఁడు ప్రీతుఁడై యిట్లనియెను:—"ఓ ఋషివర్యులారా! ఇది
వఱకు బేరొందినది కుంభజుఁడు వ్యాసునకుఁ జెప్పిన యాత్రాక్రమము.
తొల్లి నారదుఁడు మునులకుఁ జెప్పిన దంతయు వాక్రుచ్చెదను. ఆల
కింపుడి! పూర్వోక్తకథాక్రమముగనే మీ ప్రశ్నముల కుత్తర మిచ్చె
దను. తాపసోత్తములారా! వినుఁడీ! మొదట వ్యాసుఁడు శిష్యుల
తోడఁ గూడి కాశికిఁ బోయెను. అంత వశిష్ఠాత్రిభరద్వాజభార్గవాంగి
రసాదిమునులు "మేమును వ్యాసుడుండిన కాశికాపురమునకే పోయె

దమని నిశ్చయించుకొని తీర్థయాత్రాపరాయణులై పుణ్యతీర్థములను గాంచుచుఁ బోయిపోయి కాశీకానగరమునకుఁ జేరిరి; గంగలో స్నానమొనర్చిరి. అంత సంతసముతో నాతపోధనులెల్లరును మహాదేవుని విశ్వేశుని సేవించిరి. క్షేత్రోత్తమోత్తమమును, కైవల్యలక్ష్మీ సంస్థానమును నగునీకాశీయందు ''సంసారక్లేశనాశనమునకై నీవు మిగుల సంసక్తుఁడవు కమ్ము! నీవు మిగుల సంసక్తుఁడవు కమ్ము''ని పరస్పరమనుకొని మునులెల్లరును మోదకాంతితో దీర్ఘకాలమాకాశీ మహాక్షేత్రమున నివసింప నిశ్చయించుకొనిరి. అంత నానగరమునఁ గృష్ణద్వైపాయనముని వెదకివెదకి యెందును నాతనిజాడఁ గానరాక యందలి యతులను గాంచి యిట్లనిరి:—''ఓ కాశీనివాసులారా! ఈమహాస్థలమునందెందును శ్రీ వ్యాసమునిఁ గానరాకున్నారము. ఆమౌని యెచ్చటికేగెనో చెప్పుఁడీ'' యని యడుగ నావసిష్ఠాదులగుముముక్షువు లిట్లనిరి:—''అయ్యా! మేమా విశ్వేశద్రోహిస్థితి యెఱుఁగము. అతఁడీకాశియందుండఁ దగినవాఁడా? అతఁడెందున్నాఁడో! వాని పరామర్శముతో మాకేమిపని పొమ్ము! పొండ''ని వ్యాసుఁడు చేసిన మహాపరాధమంతయుఁ దేటపడఁ జెప్పిరి. ఆ వసిష్ఠాదులగుముముక్షువులు మాట విని తమలోఁ దామిట్లు విచారింపఁ దొడగిరి:—''అయ్యో! విశ్వేశుఁడే యేల తనకుఁ దానే కోపింపవలయును. ఏడు దినములన్నము పుట్టక శిష్యసందోహసహితుఁడై యుండి బాదరాయణునిఁ బలుపాట్లఁ బడఁజేసి యెట్టకేలకు కోపిష్ఠియై యాబాదరాయణుని ధిక్కరింపవలయు? అట్టివాఁడు మనలనుమాత్ర మిచ్చటఁ గృపాపరుఁడై ప్రాణములతో నిలువనిచ్చునా? కాన కృష్ణద్వైపాయనుఁ డెచ్చట సుఖముగానున్నాఁడో మనమును నచ్చటనే వర్తించుట యుచితము''నుకొని వారెల్లరును గాశీపురమందుండి కదలి శాఖోపశాఖల నతని మార్గమును బట్టికొని దక్షారామమునకు విచ్చేసిరి.

అంత నామునులెల్లరును నాతీర్థరాజమునందలి తీర్థయాత్రాక్రమము తెలిసికొననేరక నారదునిఁ బూజించి యిట్లనిరి:—దేవమునీశ్వరా! బ్రహ్మాండ మండలమున నీవెఱుఁగని తీర్థము లేదుకదా! మాకిప్పుడీ తీర్థయాత్రావిధిని, దక్షవాటీతీర్థమాహాత్మ్యమును, సప్తగోదావర కథను, భీమేశ గౌరవమును దెలుపుమ' ని యాదరముతోఁ బర మేష్ఠి తనూభవుని నారదుని మునులడుగ నాతఁడు సంతుష్టాత్ముఁడై వారడిగినది యెల్లఁ జెప్పదొడఁగెను:—పుణ్యమగు సప్తగోదావరతీర్థము నానాతీర్థోత్తమోత్తమమైనది. భీమనాథేశ్వరస్వామి ప్రీతుఁడై దాపితీర మునఁ దనకుఁ దానవసించియున్నవాఁడు. ఓ ధార్మికులారా! సప్తగోదా వరమునకును భీమనాథేశ్వరునకును శబ్దభేదమేకాని యర్థభేదమేమియును లేదు. సప్తగోదావరమున స్నానమొనర్చి సప్తసప్తి (సూర్య) ప్రతిష్ఠితుఁ డగు భీమేశ్వరుని దర్శించిన నరునకు సప్తజన్మకృతపాతకములు నశించి పోవును. ఓ సువ్రతులారా! సప్తగోదావరమున స్నానముచేయునపుడు ప్రయత్నముతో నీ మహామంత్రద్వయమును బఠింపవలయును:—

"సప్తగోదావరం తీర్థం సర్వతీర్థోత్తమోత్తమమ్।
అత్ర సన్నిహితో రుద్రో భీమనాథేశ్వరేశ్వరః॥
నమస్తే భీమనాథాయ సప్తగోదావరాంభసే।
పాపేంధనాగ్నయే తుభ్యం నిమజ్జామి హర త్వయి॥"

ఈసప్తగోదావరతీర్థము సర్వతీర్థములందుత్తమోత్తమమైనది. ఇందు భీమనాథేశ్వరుఁడు సన్నిహితుఁడై యున్నవాఁడు. భీమనాథా! నీకు నమస్కారము. సప్తగోదావరజలమా! నీవు పాపమనెడి యింధన (వంటచెఱకు) మునకగ్నివి; నీయందు మునుఁగుచున్నాఁడను. నాపాప ముల నెల్ల హరింపుము! ఆదియుగమున సద్భక్తితో గౌతమాది సప్తమహర్షులు భీమేశ్వరాభిషేకమున కీసప్తసింధువును దెచ్చిరి. జనులీ సప్తగోదావరతీరమున నివసించినను నందలి సలిలమును గ్రోలిన నల

లతో నాడినను, దానిపై నుండి వెడలెడిగాలి పీల్చినను, దానిని గీర్తించినను ధన్యులగుదురు. వాహినీశిరోభూషణమై యగణ్యమై యుండెడి యీసప్తగోదావరమును సాదరముగ వీక్షింపుఁడి! అందవగాహింపుఁడి! అందలిస్వాదుజలములను గ్రోలుఁడి! పదపడి పాతాళభైరవునకు బ్రణమిల్లుడి! నందికివందన మొనర్పుఁడి! నదీభర్తను కునాకులేశ్వరునకు నమస్కరింపుఁడి! తాండవవిఘ్నేశునకు దండమిడుఁడి! కుమారున కభివాదన మొనర్పుఁడి! విష్ణునిసేవింపుఁడి! మహాప్రభునివిరూపాక్షుని నారాధింపుఁడి! నాగేంద్రునకు నమస్కారమిడుఁడి! గిరినందనికిఁ గేలుమోడ్పుఁడి! అంత వేఱు చింత లేక మహాలింగమగు భీమనాథేశ్వరుని భజింపుఁడి! అట్లొనర్చిన వానికి జన్మజన్మాంతరార్జితములును సర్వేంద్రియసముద్భవములును నగు సర్వకలుషములు నశించును. మఱియు సప్తగోదావర తీరమందలి రామలింగేశ్వరుని సేవింపఁ దెలిసియుఁ దెలియకయుఁ జేసిన దోసములెల్లఁ దొలఁగును. ద్వాదశక్షేత్రములందలి శివలింగములను దర్శించుటవలనఁ గలుగు పుణ్య మీ రామలింగమును దర్శించినఁ గాఁగలదు. ద్వాదశక్షేత్ర తీర్థయాత్రాపరాయణులగు మానవులు పాపులయ్యును మృతినొందగనపిదప యమాలయమును డాయఁజనరు. ఓ తాపసులారా! దక్షవాటమున దేవేంద్రాదిదేవతలు ప్రతిష్ఠించిన శివలింగములు గాన్పించియును గాన్పింపకయును లెక్కకు మిక్కిలుచున్నవి. ఇంకను నానాస హేతువులగు నగ్నిష్టోమాదులా వలదు; చరణములకు శ్రమము కలిగించుకొనుచుఁ దీర్థములవెంటఁ దిరుగుటయా వలదు; ద్రవ్యనాశనమునకుఁ గారణములగు గోదానాదులా వలదు; కృశింపఁజేయు కృచ్ఛ్రచాంద్రాయణాదులా వలదు; దూరముననుండి స్మరించినను దురితములను హరించువాఁడును, సమీపముననుండి స్మరించిన సకలార్థముల సమకూర్చువాఁడును, ప్రాణావసానవేళ మోక్షదీక్షనొసఁగెడి ముఖ్యదేశికుఁడును, దక్షవాటీపురమున కధ్యక్షుఁడును

నగు భీమనాయకుని భజింపుఁడి! తారకబ్రహ్మమంత్రైక పేటికయగు శ్రీదక్షవాటియందు శివమాళులు సుఖాసీనులై "ప్రాగ్జన్మమునందు నేను కుంజరమను, నేను భుజంగమను, నేను పాఠీమను, నేను కపిని, నేను మేషమను, నే నచ్ఛభల్లమను, నేను కీటకమను, నేను మండూకమను, నేను జంబుకమను, నేను కర్కటకమును, నేను శశమను, నే నేణమను, నేనువృశ్చికమను, నేను శార్దూలమను, నేను వృకమను, నేను ఖడ్గమృగమను, నేనుఖంజరీటమను, నేను మశకమను, నేను నరుఁడనని తమలోఁదాము చెప్పుకొందురు. ఆదక్షవాటియందలి తీర్థప్రదేశమునఁ గాని గేహమునఁ గాని వనమునఁ గాని యజ్ఞవాటమునఁ గాని శ్మశానమునఁ గాని మృతినొందిన శరీరులు శివులగుదురు. కాశికాపురమున విశ్వేశుచందము దక్షిణకాశియందుఁ బరమేశ్వరుఁడు భీమశంకరుఁడు దయానిధియగుచుఁ బ్రాణప్రయాణవేళ సకలజంతువులకు మోక్షార్థానుశాసనకు చే నక్షయసుఖ మిచ్చును. మహీతలమునందా దక్షనగరము శ్రీభీమేశాగ్రభూమిజాగ్రత్సప్తగోదావరి జలవీచిపరంపరా ఘోషతర్షోద్వేజితపాతకమై, మహాక్షేత్రమై, లక్ష్మీభద్రాసనమై, క్షోణీచూడామణియై విరాజిల్లుచున్నద"ని భీమేశమాహాత్మ్యమును, దక్షనగరగౌరవమును, సప్తగోదావరోత్కర్షమును నారదుఁడు చెప్పఁగా మును లెల్లరును విస్మయాక్రాంతచేతస్కులై సప్తగోదావరమున స్నానము నర్చిరి. జగద్వంద్యుని భీమేశ్వరుని దర్శించియు నమస్కరించియు, మరలమరల నుతించియుఁ గృతకృత్యులై, మహాధన్యులై, పరమానంద తుందిలులై, యాత్మారాములై చరించుచు దక్షవాటియందు వసించు వ్యాసునిఁ గాంచిరి. దక్షారామాయణుఁడైన యాబాదరాయణుని వలనను నాపుణ్యక్షేత్రమునందలి వివిధాద్భుతవిశేషములను దెలిసికొని పరమానందమునందిరి.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునఁ బదునాల్గవ యధ్యాయము.

---

## పదునైదవయధ్యాయము.

—:దక్షవాటీశునకు భీమేశుఁడను బిరుదము వచ్చిన క్రమమును వశిష్ఠుఁడు మంకణునకుఁ జెప్పుట:—

సూతుఁడు మరల శౌనకాది మహర్షులతో నిట్లనియెను:— అంత నామునులెల్లరును దక్షవాటమునఁ దీర్థతత్పరులై చరించుచు నొకచోటఁ బావనమగు వాహినీతీరమునందలి బిల్వకాననలతావితతి గృహామధ్యమమునఁ బద్మాసనమును దీర్చికూర్చుండి నాసాగ్రమున దృష్టి నిల్పి హృదయమునఁ బార్వతీపతిని ధ్యానించుచు మహాప్రభావసంపన్నుఁడై మహామాహేశ్వరోత్తముఁడై యున్న కుంభసంభవునిఁ గాంచిరి. అంతఁ గొంతవడి యామమౌనీంద్రునితో నిష్టసల్లాపసఖ్య మనుభవించి వారందఱును గూడి తీర్థగౌరవమునుఁ జెప్పుమన నిల్వలాసురసంహారుఁడగస్త్యుఁ డాతాపసశ్రేష్ఠులను గాంచి సగౌరవముగా నిట్లనియెను:—"గంగాతీరభూమికి దక్షిణసాగరతటభూమి సాటి, మణికర్ణికకు సప్తగోదావరతీర్థమీడు; కాలభైరవునకుఁ బాతాళభైరవుఁ డుద్ది, విశ్వనాథేశ్వరునకు భీమేశ్వరుఁడు జోడు; మోక్షలక్ష్మికి మోక్షరమ యెన; మహాభోగమహిమమునకు మహాభోగమహిమముజత; కాన తుల్యములగు కాశికిని దక్షవాటికిని దారతమ్య విచారణ నాయ్యమైనది కాదు. ఘుమఘుమారంభహుంకార ఘోషముతో జలకల్లోలహస్తములెత్తి బహువిధపాతకములను జంకించు సప్తగోదావరమును వర్ణింప నెవరికగును?" అని కుంభజుఁడు చెప్పఁగా విని యామమౌనీంద్రుని వీడ్కొని పురప్రదక్షిణమొనర్చి భీమేశ్వరుని దర్శించి కృతకృత్యులై యొకరమ్యస్థలమున వసిష్ఠుని ముందిడుకొని యామునిపుంగవులెల్లరునుఁ గూర్చుండిరి. అంత శివభక్తినిధియు, శ్రీమంతుఁడును, ఋగ్యజుస్సామపారగుఁడును, సదాశివకథాగోష్ఠి పరితోషిత

మానసుఁడును, జగత్ప్రసిద్ధుఁడును నగు మంకణుఁడు మొదముతో నామునిమండలమును వీక్షించియు వలగొనియు మ్రొక్కియు నంజలియొనర్చియు నిట్లనియెను:—"ఓసాధులారా! మీదర్శనమున సుకృతినైతిని; కృతకృత్యుఁడనైతిని; భాగ్యవంతుఁడనైతిని. ఓదృఢవ్రతులారా! నాజన్మము సఫలమయ్యెను; నాతపముపండినది; నేను బహుజన్మార్జితపుణ్యపరిపాకమువలన బహుతీర్థములను గాంచినవారలును, తీర్థభూతులును నగు మిమ్ములను గనుఁగొంటిని. మీయందలి కృపాబలముచే నేనును తీర్థమున్నైతిని. ఇదియెల్ల నిక్కువము. దేవదేవుఁడగు భీమనాథుని పావనమాహాత్మ్యమును వినవేడుక నాహృదయము నిండియున్నది: కాన నేఁడు మిమ్ములను జేరి యాచించుచున్నాఁడను. మీలో నొకఁడాగుహ్యము నానతీవలయును"ని యామునులను బ్రార్థింపఁగా వారెల్లరును బ్రీతితో వసిష్ఠమునిని బ్రార్థించి యామాహాత్మ్యమును జెప్ప నియోగించిరి. అంత వాక్యవిశారదుఁడగు నాసంయమీంద్రుఁడా ఋషుల యనుమతి నంది మంకణునితో నిట్లనియెను:—"ఓమంకణా! భూమియు గగనమును దిశలను నిండిన భీమమగు విషాగ్నిని మ్రింగుటచే నీదేవుఁడు భీమేశబిరుదాంకితుఁడయ్యెన"ని వసిష్ఠుఁడు చెప్పిన వచనమును మంకణుఁడు విని తత్కథాశ్రవణోత్సుకుఁడై మరల నిట్లనియెను:—"ఓమునీశా! ఆదేవాదీశుఁడా కాలకూటము నెట్లు మ్రింగెనో యాకథాక్రమమెల్లఁ దెల్లముగాఁ దెలుపుమ"ని మహాత్ముఁడగు మంకణుఁడు వేఁడికొనఁగా వసిష్ఠుఁడదియెల్లను గ్రమముగా నిట్లు చెప్పనారంభించెను:—"ఓమంకణా! తొల్లి జలంధరుఁడు, బాణుఁడు, బిడాలుఁడు, ధూమ్రలోచనుఁడు, విద్యున్మాలి హిరణ్యాక్షుఁడు, తారకుఁడు, మహిషాసురుఁ, డంధకుఁడు, కాలకేయుఁడు, నివాతకవచుఁడు, బలి, గజాసురుఁడు లోనుగాఁగల బలశాలురగు రాక్షసుల

కును పాకశాసనపావకపరేతరాజపలలాశిప్రాచేతసపవనపౌలస్త్యపశుపతి ప్రధానులగు వేల్పులకును దాయాదసంబంధమున వైరముపొడముటచే నొండొరులను జయింపనిచ్ఛవొడమినది. అంత దుర్వారులగు దైతేయవీరులనోడింప దేవేంద్రాదిదేవతల శక్తులగుటచే మిగులఁ జింతింపసాగిరి. అప్పుడు దేవనాయకుఁడు దైత్యవైరియగు విష్ణునిప్రసాదమువలన దైత్యులను వధించెడి యుపాయమూహింప క్షీరసాగరమునకుఁ బోయెను. అత్తఱిఁబయోరాశియందు జనార్దనుఁడు యోగనిద్రను వీడి రవికరబోధితమగు పద్మపత్రములవలె గన్నులు తెఱచెను. అప్పుడు కదనోద్యోగమును విద్వేషించి జయోద్యోగము నభిలషించుచు దివ్యాయుధములైదును సేవించుచుండెను; కృపాకటాక్షసంవీక్షాసుధాలహరికాప్లుతులును, సౌఖశాయనికులును నగు సనకాదులత్యాదరమునఁ జూచుచుండిరి; అగ్రమునఁ బక్షీంద్రుఁడంజలిపుటము సంఘటించి భ్రూలతాచాలనామోఘశాసనమునకై ప్రతీక్షించుచుండెను; లక్ష్మి తన యూరురంభాస్తంభయుగమునఁ జరణాంబురుహద్వయముంచి యొత్తుచుండెను. అట్లు మనోహరమగు నాక్షీరపయోరాశిశయ్యాగారమున రత్నప్రభాకీర్ణఫణాశ్రేణీవిచిత్రోపబర్హకమగు భోగిరాజమహాభోగశయనమున శయనించిన శుభాకారుఁడౌ సురనాయకుని గాంచెను. అంత దేవేంద్రుఁడు లోకహితైషియగు నా నారాయణునకు నతియొనర్చి రాక్షసులయౌద్ధత్యము నంతయును విన్నవించెను. ఆదానవారాతియు నారహస్యమునెల్ల నాలించి యామఘవానునకు హితకార్యముపదేశించి యాతనిని స్వస్థచిత్తునిగఁ జేసెను. శతమఘుఁడును క్షీరాబ్ధిశాయియనుమతి వడసి సిద్ధసంకల్పుఁడగుచు శీఘ్రముగా నిజనివాసమున కేగెను. అంత దక్షుఁడగు నారాయణుఁడా దేవదానవులకు మాధ్యస్థ్య మవలంబించి సంధియొనర్చి యుభయసమ్మతముగ సజలమేఘస్వానగంభీరసన్నిభస్వనమున నిట్లనియెను:—

"ఓ శుద్ధబుద్ధులారా! మీకీదుర్విచారము లేల? ఘోరసంగ్రామ రంగములం బడి మృతినొందుట శ్రేయమా? అయ్యో! అన్నదమ్ములగు మీరు కుడిచి కూర్చుండి యొడలెఱుంగక యర్థమునకై వ్యర్థముగాఁ గుమ్ములాడఁ గూడునా? ఓ దేవదానవులారా! మీకుఁ గళ్యాణమగుఁగాక! ఇకనైన వివేకము కలిగి కోపము విడఁచుకొని యన్యోన్యవైరమును మానుఁడు! మీరెల్లరును భద్రసౌవర్ణపీఠములపైఁ గూర్చుండి త్రైలోక్యరాజ్యము నచ్ఛిద్రముగా ననుభవింపవలయును; గాని యుద్ధమునకు సంసిద్ధమగుట తగదు! మనమెల్లరమును సుధాపానమొనర్చి దుస్సహమగు జరామరణములను బోఁగొట్టుకొందము! జరామృత్యుత్రాసహరమగు నాసుధారసము జలరాశి మథించిన మనకు లభించునుగాని వేఱుతెఱంగున లభింపదు; కాన బలసంపదతో నాదికచ్ఛపమును మూలాధారమహాపీఠముగను మందరనగమును మంథానముగను, ఫణినాయకుని సూత్రముగను జేసి ధైర్యోత్సాహములతో దేవదానవులు క్షీరాబ్ధి మథింపవలయునని" నారాయణుఁడు పలుకఁగా విని దేవతలును పూర్వదేవతలును పల్లె యని కడువేడుకతోఁ బాలకడలి ద్రచ్చ నిచ్ఛగించిరి.

ఇది స్కాందపురాణము నందలి భీమఖండమునఁ బదునైదవ యధ్యాయము



## పదునాఱవ యధ్యాయము

— దక్షవాటీశుఁడు హాలాహలముం గ్రోలి భీమేశనిసుదమునంచుట —

అంత నారాయణుఁడు సత్త్వోత్సాహములతో విజృంభించి చతుర్భుజాస్తంభములతో గండోపలశబ్దప్రపూరితదిగంతమును, నుత్తుం

గశృంగోల్లిఖితస్వర్గగర్భాండకర్పరమును నగు మందరాద్రిని గందుక
ముకరణి నెత్తి తన మూఁపునఁ బెట్టికొని క్షీరాబ్ధియందుంచి దేవదాన
వములకు మహాసంతోషము సంఘటిలఁ జేసెను. అంత బలిప్రముఖ
దైత్యులును దేవతలును నింద్రాదిదేవతలును దమ్ము విష్ణుఁడు ప్రేరే
చుచుండఁ గూర్మనాథుని మూలాధారముగను, మంథరాచలమును
మంథముగను, ఫణీంద్రుని వాసుకిని దరిత్రాడుగను, మారుతముల నాక
త్రాళ్ళుగను జేసి పాలకడలిని ద్రచ్చఁ దొడఁగిరి.. అట్లు సన్నాహము
లతోడను, నుత్సాహములతోడను, ప్రమదములతోడను, మదముల
తోడను, ధైర్యములతోడను, నహంకారములతోడను, భయంకరహుం
కారములతోడను, నుల్లాసములతోడను, మహాబలములతోడను, దేవ
తలును బూర్వదేవతలును మహాంబుధిని మథించునపుడు సూత్రాయ
మాణసర్పేశవేష్టనవ్యక్తచిహ్నమును దండాయమానమును నగు
మంథరాచలమత్యద్భుతముగా భ్రమించి కొట్టుకొనుటచే నక్రపాఠీన
కుళీరమకరాదులు క్షోభించుచు వివశములై భ్రమించినవి. అంతర్మ
గ్నములయిన పటుక్షోణీధరముల కుక్షిక్షోభింప ఱెక్కలు ముణుఁచుకొని
ప్రమంగి యణఁగినవి. మంథాద్రిమథ్యమానాబ్ధి నుద్భవిల్లిన ఘుమ
ఘుమారావములచేఁ జతుర్దశభువనములును జెవుడువడినవి. అప్పుడు
పాపతేని బిట్టునిట్టూర్పుగాడ్పులచే నింధనము నందగ్ని ప్రజ్వరిల్లినటుల
దుగ్ధాబ్ధిని భయంకరమగు హాలాహలముద్భవించినది. అంత నది
భుగభుగధ్వనులతో దిగంతములకు వ్యాపించెను; నిరంతరధూమజాల
ములతోడఁ గూడి సాంద్రముగా లేచు భయంకరవిస్ఫులింగములతో
నిఖిలదిశలను నిర్దహించెను; ప్రత్యగ్రతమతాపింఛద్రుమగుచ్ఛచ్ఛటాట
విని బ్రహసించు నీలజిహ్వాలెల్ల యెడలను బ్రసరింపఁజేసెను; ఛటచ్ఛ
టాశబ్దములతో రోదసీకుహరమును విదళించెను; అసహ్యజిహ్వాపటల
ములతో బ్రహ్మాండకర్పరమును గ్రసించెను; మహాఘోరములగు

నుల్కాపాతములతో దిశాముఖములనుదహింపఁజేసెను; నిరంతరోష్ణముచే సప్తాధోలోకములనుదపింపఁజేసెను. అట్టిభుజగభృంగసంకాశము నీలజీమూతసన్నిభమై, కల్పాంతాగ్నిప్రతినిధియై, కాలమృత్యుసమమై మహాకోలాహలభీలమై, భువనములు నిండియుండెను. అప్పుడు బ్రహ్మ భయాకులుఁడై తాళసన్నిభమగు తనభుజాస్తంభ మెత్తి బ్రహ్మణ్యామొనరించెను; దేవతలును బూర్వదేవతలును నితాంతభయవిభ్రాంతులై సూత్రఫణీశ్వరుని వదలి పూర్వదిక్కులకుఁ బరుగిడిరి; సకలలోకములు హాలాహలమహాభీలకోలాహలసమాకులములై తల్లడిల్లినవి; సువర్ణవర్ణుఁడగు విష్ణువు కాలకూటాగ్నిసంపర్కమున నీలవర్ణుఁడయ్యెను: బ్రహ్మాండములెల్ల వేఁడిమిగలమై తెఱఁగయ్యెను; దిశలెల్ల దగ్ధములైనవి; నభము జ్వాలాకబళితమయ్యెను; భువనములేమను మాడిపోయినవి. అట్లంతటను హాలాహలమహాజ్వాలము విసవడి పెచ్చు పెరుఁగునపుడు పయోరాశిప్రాంత విశ్వంభరాస్థలమున భీమనాథేశ్వరుఁడు తలలోని పువ్వైనను వాడిపోక నిరుపద్రవముగా స్వర్ణసింహాసనమెక్కి యుండెను. ఆ లలాటలోచనుని శరణాగతవత్సలుని దక్షవాటాధినాయకుని శరణుచొచ్చి హరిబ్రహ్మేంద్రామరు లిట్లనిరి:—
గౌరీశ! చంద్రకోటీర! శూలపాణి! అంతకాంతక! ఫాలలోచన! సర్వేశ! కరుణాపూర్ణమానస! మహాదేవ! దక్షవాటీశ్వర! శంకర! కాలకూటాగ్నిపీడితులమై వేఱుదిక్కులేక యడలుచున్నారము. రక్షింపుము! రక్షింపుము!" అని భయవిహ్వలులై మొఱలిడియెడి యింద్రాదిదేవతలను, బలిప్రముఖదనుజులను విలోకించి మహాహరుఁడు ప్రపన్నార్తిహరుఁడై యభయహస్తమును బ్రసారించి "భయపడకుఁడి! భయపడకుఁడి!" అనిచెప్పి మహాజగదీశ్వరుఁడు మహాహుంకారముతో సకలలోకప్రపూర్ణమగు నా హాలాహలవిషానలమును గరాగ్రమున గ్రహించెను. అయ్యెడ నాచంద్రశేఖరుని పాణిపంకజమధ్యమ

మున మహాజ్వాలామాలాకులమగు గరళము మధురకరమయ్యెను. అంతట విషభృద్భూషణుఁడగు నాజగత్త్రాత యావిషమును సిద్ధుఁడు రసమయీఘుటికను మ్రింగినచందమున మ్రింగఁ జూచునపుడు పార్వతి యాస్మరవైరికంఠమును దన బాహులతలతోఁ బిగ్గఁ గౌఁగిలించుకొని యిట్లను:—"ఓ దేవేశ! ఈకాలకూటవిషాగ్నిని నీదు కంఠసీమను నిల్పి సర్వలోకములను రక్షింపుము! అట్లు చేయక కుక్షిలోని కే పోనిత్తువేని దవానలము వనమును గాల్చువిధమున నీకుక్షినుండిన లోకములను దప్పక నాశము చేయును; వెలికిఁ దెచ్చితివేని బహిస్థిత లోకములను భస్మము గావించును. నేననునది సత్యముకాన దానిని నీకంఠసీమను నిల్పుము!" అని యంబికపలుకఁగా లోకనాయకుఁ డగు నాశంభుఁడు ప్రియావచనము నాదరించి సకలలోకములను సంరక్షింప విశ్వక్షోభకరమగు విషమును దనకంఠకోణమున నిల్పెను. అంత నది సర్వేశుని కంఠమున సర్వప్రత్యయకారణమగుచు జగద్రక్షణ సామర్థ్యమునకు సాక్షియై కానుపించెను. మఱియు నది చంద్రమౌళి గళమున నింద్రప్రకల్పితవిభూషణమై యలరారుచున్నది. అట్టి యలంకరణమగు భూషణము మహాత్ములగువారల కెవ్వరికి నుండియుండ లేదు. ఆ త్రాణసంభవమగు నట్టిచిహ్నమే విభూషణము కదా! త్రిపురవైరి విషమును భక్షించిన యీపుణ్యకథను భక్తితో విను వారలకు మహాభయము లేకుండును.

ఇది స్కాందపురాణమున భీమఖండమునఁ

బదునాఱవయధ్యాయము.

———

## పదునేడవ యధ్యాయము

—♦ భీమేశ్వరుని యానతిని సురాసురులు విఘ్నేశునిఁ బూజించి మరల సముద్రమును మథించి మందారాదులను బడయుట ♦—

అంత బృందారకులందఱును గాలకూటమును మ్రింగి సర్వలోకరక్షణ మొనర్చిన పరమేశ్వరుని నిట్లు వినుతించిరి:--ఓ దేవా! మహోపద్రవకారణ మగు హాలాహలానల మారగించి సచరాచరమగు నీజగమును గాచితివి. అశేషభువనాధీశా! శరణాగతసంత్రాణపరతంత్రాత్మతాగుణము నీయందె నెలకొని యున్నది. సర్వలోకైకసంరక్షావ్యవహారపదమునకు నీనీలకంఠముఁ గాన్పించెడి నీలిమ గుఱుతయ్యెను. ఓ కాలకంఠ! లోకములను భీతిల్లఁజేయు కాలకూటవిషమును మ్రింగి భీమనామమును గైకొంటివి. సమస్తదిక్పాలులు నీయాజ్ఞకు లోఁబడి యుందురు. ఓ వేదవేద్యా! వేదములన్నియును నీదు నిట్టూర్పుగాడ్పులు. సర్వదేవగణాధీశ! సర్వలోకైకనాయక! దక్షవాటీపురీధామ! భీమనామ! మహాప్రభూ! దేవదేవ! మహాదేవ! దేవవంద్య! దయానిధి! లోకరక్షకళాదక్ష! శర్వ! సర్వజ్ఞ! శంకర! కాలకూటాగ్నిసంపర్కవినీలద్యుతికంధర! లోకజననికి నంబికకును, లోకజనకునకు నీకును ముదముతో మ్రొక్కెదము. బహిరంతస్స్థితాశేషలోకసంరక్షారతయైన శివను, బహిరంతస్స్థితాశేషలోకసంరక్షారతుఁడగు శివుని; నిరంతరస్థిరతరకృపాపూర్ణచిత్తయగు శాంకరిని; నిరంతరస్థిరతరకృపాపూర్ణచిత్తుని శంకరుని వర్ణింతుము. కల్యాణగుణసంపన్నులును నాదిదంపతులును బార్వతీపరమేశ్వరులును నగు మీరు జగద్వంద్యులు. ఓ ప్రభూ! కరుణతో నభయ మొసఁగి భువనములను వెఱపించెడి ఘోరవిషమును మ్రింగి సకలలోకములను రక్షించితివి. అరిష్టమెల్ల శాంతిల్లినది. అభీష్టము ప్రవర్ధిల్లినది. దక్షిణాబ్ధితటావాసా! భీమశంకరా! ధరణియు గగనమును

దిక్కులును దరికొని మండెడి విషాగ్నిని గరమునఁ గైకొని కంఠమున నిడికొనిన నిరుపమధృతి నీకె యొప్పును. ఓభీమనాథా! సమస్తభువన త్రాణసామర్థ్యసమర్థతతో నీవట్లు చేయకున్న సకలలోకములు భస్మావశేషములుగాక నిలిచెడివా! స్వామీ! నీకు దేవతలే సములు కానప్పుడన్యులు సములగుదురా! ఇదియేటిమాట! మహాదేవా! నిన్ను మరల మరల నుతింప నేల? నీవు మమ్ములను రక్షించితివి కాదే! ఉపద్రవము లుడిపి తండ్రి తనసంతతిని సంరక్షించుకొనఁడా?

ఓసమస్తభువనాధీశ! శివా! శ్రీ భీమనాయక! దేవీసమన్వితుఁడవై కృపతో మమ్ముఁ గాపాడుము! నీలగ్రీవా! మహాదేవా! భోగిరాజవిభూషణ! దేవీసమన్వితుఁడవై మమ్ముఁగారుణ్యముతోఁ గాపాడుము! వేదాంతవేద్య! సర్వజ్ఞ! దక్షవాటాధినాయక! దేవీసమన్వితుడవై కారుణ్యముచూపి కావుము! దక్షిణసాగరతీరవాసా! సృష్టికర్మసన్మథా! మమ్ము దేవీసహితుఁడవై ప్రోవుము! పాల్కడలిని బుట్టిన విసమును మెసవిన ముక్కంటీ! దేవీసమన్వితుఁడవై కరుణతో మనుపుము! శంకరా! అభవ! భర్గ! ఈశా! పార్వతీప్రాణనాయక! నీవు దేవీసహితుఁడవై కృపతో సాకుము! ఓ భీమేశ! లక్ష్మీవాణీ మొదలగు దేవతలు పతిపుత్రాభివృద్ధికై నిత్యమును భజంచెడి మహాదేవుఁడవు! నిన్ను భజింతుము! ఓ యీశ్వరా! వేదవేద్య! దేవాధీశ! సదాశివా! సప్తగోదావరోత్సంగనివాసా! భువనేశ్వరేశ్వరా! నీయాజ్ఞచే బ్రహ్మసకలజగమును సృజించును; దేవేంద్రుఁడధ్వరములందు హవిర్భాగములను జేకొనును; పావకుఁడు దేవతలకు హవ్యమును గైకొని పోవును; యముఁడు ప్రాణులపుణ్యపాపములను బరీక్షించును; పర్జన్యుఁడు వర్షించును; పితరులు శ్రాద్ధములందుఁ దనివినొందెదరు; ప్రాణుల కోటులు నిత్యము ప్రత్యవాయములతో జీవింతురు; సమీరణుఁడు సకల గ్రహమండలమును వహించును; యక్షేశ్వరుఁడు నవనిధానములను

బాలించును; సర్వేంద్రియములును నింద్రియార్థములందు వర్తించును. ఆ యీశానుఁడు మాకభయమొసఁగుఁగాక! వరుణుఁడు వారాశిఁ బాలించును; వాయువు వీచును; సూర్యాదిగ్రహము లాకసమున సంచరించును; అహినాథుఁడు శైలకాననసహితముగు నీధరిత్రిని దాల్చును. ఓమహాదేవా! నిన్నాశ్రయించుచున్నారము. శివా! శర్వ! భవా! ఈశాన! వామదేవ! మహేశ్వర! ఉగ్ర! తత్పురుష! అఘోర! సద్యోజాత! నీకు నమస్కారము. దక్షవాటీశ! భీమేశ! నీలకంఠ! కరుణానిధీ! నీ మహిమాసాగరమునకు మేరకలదే!" అని దేవదైత్యులు స్తోత్రముచేయఁగా నాకాలకూటహరుఁడు భీమేశ్వరుఁడు బహ్మాచ్యుతేంద్రప్రముఖులను వీక్షించి యిట్లను:—"ఓదేవదానవులారా! ఈ యంభోధి మథించుటకుముందు విఘ్నేశ్వరునర్చించుట మఱచితిరి. విఘ్నరాజార్చనము లేక యేకార్యములైన నెట్లు సిద్ధించును? శ్రేయము గోరువారలు తాము చేయఁబూనిన కార్యములకు మొదట గణనాథునిఁ బూజింపవలయును; కాన మీరిప్పుడు గజాననునిఁ గొల్చి మరల సముద్రమును మథింపఁబూనిన నిష్టసిద్ధియగును" అని పరమేశ్వరుఁడు పలుక నాదేవదానవులందఱుఁ దప్తకాంచనసంకాశుఁడై, యంభోరాశి తటంబునఁ గోటిసూర్యప్రకాశుఁడై సర్వవిఘ్నములను నివారించుచు సకలశుభముల నిచ్చుచుండిన తాండవవిఘ్నేశుని స్వర్ణసింహాసనమునఁ గూర్చుండఁబెట్టి యనన్యగురులై భక్తి నంచితమగు బూజించిరి. పురందరుఁడు కనకకలశములతో విమలములగు సప్తగోదావరి జలమును దెచ్చి యామూషికవాహనునకభిషేకించెను; యముఁడు కాంచనోజ్జ్వలమగు నా గణాధిపుని గాత్రమునిండఁ గస్తూరికస్తూరీగంధసార విలేపనము గావించెను; పద్మభవుఁడా ద్వైమాతురునకుఁ బసపూన్చిన బ్రహ్మసూత్రము నర్పించెను; పద్మనేత్రుఁడు ప్రత్యగ్రపారిజాతకతరు ప్రసవమాల్యముల నా గణాధ్యక్షుని వక్షమున వైచెను; సోమధ్వజుఁ

డా లంబోదరునకుఁ గాలాగరుజధూపము వైచెను; ధనదుఁడా విఘ్నరాజునకు రత్నభూషణములను బూన్చెను; అంధకాసురుఁడా వినాయకునకుఁ గోమలదూర్వారముల నర్పించెను; పిల్లతెమ్మెరలోలయ పవనుఁడా యేకదంతునకు వీవన వీచెను. అంత వారలు నియమితాత్మకులై యా హేరంబునకపూపఘృతక్షీరశర్కరాపాయసములతోడను, మధుపుండ్రేక్షుకదళీనారికేళఫలాదులతోడను, హృద్యమగుమహోపహారము నర్పించిరి; వలగొనిరి; ప్రణుతిల్లిరి. అట్లు సంతసింపఁజేసి యా దేవుని ప్రసాదమును స్వీకరించిరి. అంత నాగరాజముతో నఖిల మహాంబుధిని మంథరాచలమంథానముతో మథింప నారంభింపఁగా నందు సకలలోకాహ్లాదకరుఁడగు చంద్రుఁడుద్భవిల్లెను. అంత దేవదానవు లామహావస్తువును బరమానందముతో శాంతునకు నీలగ్రీవున కొసఁగిరి. ఇంక నాసముద్రమును బెరుగుచుండఁ గల్పవృక్షమప్సరసలు, కౌస్తుభమహామణి, యుచ్చైశ్శ్రవమను హయ మాదిగాఁగల సకలకామదములును, సర్వమంగళాస్పదములును, నిఖిలలోకమనోహరములును నగు పదార్థము లొకదాని వెంట నొకటి యుద్భవించుటయే కాక కరమున నమృతకలశముతో దేవదైత్యశుభాకృతియగు ధన్వంతరియుఁ, బుండరీకకర్ణికాకాంతకనకసింహాసనస్థయై సర్వలోకైక సుందరియగు లక్ష్మియుఁ బుట్టిరి. ఆ దేవి లీలాస్వయంవరమునఁ గల్యాణగుణసంపన్నునిఁ బురుషోత్తముని వరించి యా దేవుని గళమున సువర్ణకుసుమమాల వైచెను.

ఇది శ్రీ దతౌపురాణమునందలి క్షీరసముద్రమథనమను సప్తదశాధ్యాయము.

---

## పదునెనిమిదవ యధ్యాయము

—విష్ణుఁడు మాయాంగనయై దనుచేతనున్న యమృతకలశమును హరింప రాక్షసులు భీమేశ్వరుని గూర్చి తపమొనరించుట.—

మఱియు వసిష్ఠుఁడు మంకణునితో నిట్లు చెప్పెను:—అంత నౌద్ధత్యముతో దైతేయులు ధన్వంతరికరమునందున్న సుధాపూర్ణకుంభమును హరించి నిరాతంకముగాఁ జనిరి. అచ్యుతుఁడు వంచనాచతురుఁడు కాన మాయాంగనయై యసురరాక్షసులహస్తమున నున్న యా సుధాపూర్ణకుంభమును మరల హరించి తెచ్చెను. అందులకు నందకప్రముఖులు దైత్యదానవులు దీనాననులై మిగులఁ జింతాకులతతో నొకచోఁ గూడి యుండఁగా నారదసంయమీంద్రుఁడు గగనమున గమించుచు నాదానవవ్రజమును గాంచి వారలకెల్లరకును బ్రమోదము కూర్పఁ దలంచి ప్రస్ఫుటముగా నిట్లనియె:—"ఓ రాక్షసనాయకులారా! దేవతలమృతకలశమును హరింపఁగా సిందువడి డెందముతో నిట్లు కుందనేల? మీకెల్లరిప్పుడభివృద్ధి గోరుదురేని సుధాధామార్ధకోటీరుఁడు, త్రైలోక్యరక్షాచతురుఁడు దాక్షారామాధిపుఁడు నగు భీమేశుని భజింపవలయున"ని బ్రహ్మసుతుఁడు పలికిన పలుకులు పాటించి రక్కసులు దక్షవాటీవనమున వెలసిన భీమనాయకునిఁ గొలిచిరి. త్రిపురావాసనహితులై యసురాధిపులందఱును మహాభక్తితో లోకభయంకరముగాఁ దపమొనరించిరి. అందఱును పాశుపతాచారమునఁ స్థైర్యసంశుద్ధమానసులగుచు జగదారాధ్యుని భీమనాథుని ధ్యానింతురు; అరుణోదయవేళను గగనగంగానదినున్న కనకకమలములతో నాశంకరు నర్చింతురు; భానూదయకాలమున నాభర్గునిఁ గృష్ణాగరుసముద్భూత ధూపధూమాపూర్వసఖ్యతోఁ బ్రీతివంగింతురు; సంగమన

మయమున భోగిరాజవిభూషణునిఁ జారుకుంకుమ కర్పూరసాంద్ర చందనచర్చతో సంతసింపఁజేయుదురు; మధ్యాహ్నమున నామహేశ్వరునిఁ బాయసాపూపసూపాజ్య పదార్థదధిశోభియగు నైవేద్యముతో సంమోదింపఁ జేయుదురు; సాయంతనమునఁ నాశర్వరీశశేఖరుని మృదంగఝల్లరీశంఖ ఢక్కాడమరునిస్వనములతో హర్షింపఁ జేయుదురు; నిశీథమున నాసీహారాద్రిసుతాధవుని శ్రావ్యములగు వీణారావములతో సేవింతురు; మఱియు వారు దినదినమును భక్తితో బ్రహ్మపంచాక్షరాది మంత్రములు పఠించుచుఁ బ్రత్యగ్రబిల్వాక్షతములతో నాబాలచాననునిఁ బూజింతురు; అసురరిపులు నిష్పాపరులగుచు వేదమంత్రములను బురాణమంత్రములను నావిశ్వైకస్తుత్యుని నీశ్వరునిఁ గీర్తింతురు. ఆ పూర్వదేవతలట్లు సర్వాభీష్టప్రదాయకుని భీమేశ్వరునారాధించి యాదేవుని యనుగ్రహమున మహదైశ్వర్యమునంది గర్వించి యశేషభువనములను నిర్జించిరి; విక్రమోత్సాహ దుస్సహులగుచు నిరపరాధులను నిర్జరులను హింసించిరి. అప్పుడింద్రుని చేతివజ్రాయుధము జాగ్రదుద్దీప్తిపాటరి మొద్దువోయినది; జ్వలనుని ప్రదీప్తతేజము విలయమందినది; కాలునిదారుణకాలదండము నిరర్థకమైనది; వరుణునిపాశము బలహీనమైనది; బలవంతుఁడు ప్రభంజనుఁడు మిగులఁ దూలెను; ధనపతిఘనత యణఁగెను; గ్రహములకు నిగ్రహము పుట్టెను. అట్లు కాలవశమునఁ గాలకేయాది దుష్టరాక్షసులకు భీమేశునికృప పెచ్చుపెరుఁగునెడ బ్రహ్మచ్యుతేంద్రాది దేవతలు త్రిపురాసురులచేఁ బీడింపఁబడుచు దక్షవాటీశుని భీమేశుని శరణుచొచ్చి సాష్టాంగదండప్రణామమాచరించి ప్రాంజలులై దివ్యలింగాకృతి యగునాపరమేశ్వరు నిట్లునుతించిరి:

దేవదేవా! మహాదేవా! దక్షారామాధినాయక! సప్తగోదావరోత్సంగనివాసీ! భక్తవత్సల! కాలకూటవిషజ్వాలా క్రాంతలోకైకరక్షక! కారుణ్యాధీనహృదయ! అనాథనాథ! త్రిభువనమహాప్రభూ! త్రిపురా

సురులు పీడించుచుండ మిగుల దుఃఖించుచు దిక్కులేక దిగులుపడుచు న్నారము. రక్షింపుము! రక్షింపుము! ప్రథమమున నీవు దేవతలఁ బూర్వదేవతలను సమముగా సంరక్షించితివి. ఇప్పుడు మేము బెగడొం దుచున్నారము. వారలీవరఱకే రక్షింపఁబడి యున్నారు. మేమిత్తఱిఁ బ్రపన్నులమై యుంటిమి, కావున మమ్ములను మనుపవలయును! సర్వజ్ఞ! నీవు ధర్మమెఱుఁగనివాఁడవా! దక్షవాటాధినాయక! భీమేశ! హాలాహల మహానలజ్వాలలను సంహరింప నెంచి క్షీరసాగరమున సుధామయలింగమవై జనించిన నిన్నాశ్ర యింతుము! భవ! దేవేశ! శ్రుతిసీమంతభూషణ! భుజంగరాజకేయూర! సూర్యచంద్రాగ్నిలోచన! మనోభవారి! భగవానుఁడా! అణిమాది ప్రదాయక! భక్తలోకసన్నిధి! శంభూ! భవాంభోనిధితారక! భాలభాగే క్షణాగ్రకీలీభక్షితమన్మథ! శూలపాణి! పశుపతి! అసహ్యావిక్రమో దీనలగు పురాసురులచేఁ బీడింపఁబడుచున్నాము. మమ్మవలోకింపుము! గౌరీమానసకాసారకలహంస! కృపానిధి! పురాసురకృతబాధను నివర్తిం పుము! సత్య! నిర్మల! నిర్ద్వంద్వ! నిర్వికార! నిరంజన! మహేశ్వర! పురాసురకృతబాధను నివారింపుము! దోర్దండమండితానేకదివ్యాయు ధసముజ్జ్వల! పురాసురకృతబాధను మాన్పుము! ఖట్వాంగచాపపరశు త్రిశూలధర! దుర్జయ! మహేశ్వర! పురాసురకృతబాధ తొలఁగింపుము! మాకు వేఱుదిక్కులేదు, నీవే దిక్కు! పురాసురకృతబాధను తొలఁగఁ ద్రోయుము! నిరుపద్రవ! నిస్సంగ! సచ్చిదానందవిగ్రహా! మహేశ్వర! పురాసురకృతబాధను బోఁగొట్టుము! భూజలానలచంద్రార్కవాయు వ్యోమాత్మవిగ్రహా! మహేశ్వర! పురాసురులు పెట్టుబాధను బాపుము! బ్రహ్మశిరోమాలావిభూషణ! హరిప్రియ! మహాదేవ! పురాసురకృత బాధ లేకుండఁ జేయుము! బాలేందుచూడాలంకార! లోకశంకర! శంకర! భయంకరమహాదైత్యలోకమును సంహరింపుము! అద్వితీయ!

అక్షర! అగణ్య! సత్య!సర్వనియామక!వ్యాసాదిపండితసుత్య!పురదైత్యు లను బరిమార్పుము! అనంతశక్తి! ఆర్యవర్య! అఖిలేశ్వర! అనాదినిధన! అనీశ్వర! పురాసురులను దెగటార్పుము! సత్య! సర్వేశ! సర్వాత్మ! సనాతన! సదాశివ! సర్వజ్ఞ! భీమేశ! గర్వాంధులను సంహరింపుము! ప్రణతార్తిహర! ఈశాన! దక్షవాటాధినాయక! భీమేశ! సర్వదేవాత్మ! ప్రభూ! మాకభయమిమ్ము! మంత్రోపనిషదర్థ! మన్మథాంతక! శాశ్వత! సింధురాసురసంహారీ! జగద్గురు! మాకు శుభమొసంగుము! దక్షిణాబ్ధితటక్షోణీనివాసీ! దీనరక్షక! శూలపాణీ! మాకు జగద్ధేయమగు విజయమిమ్ము! ఉగ్ర! తత్పురుష! అఘోర! వామదేవ! త్రిలోచన! భాలాక్ష! భర్గ! భూతేశ! సదాశివ! మాకు భద్రము సమకూర్పుము! కాముగులగు త్రిపురాసురులు భుజప్రతాపమునం ద్రైలోక్యరాజ్యము నిర్విక్రమముగా నేలుచు మాచే నధమకార్యములు చేయించుచున్నారు. ఇప్పట్టున వారలను రూపుమాపక తడసిన మావంటివారలకు జీవనమే లేకుండుటయుకుండ దైత్యులకే లోకప్రభుత్వమేకచ్ఛత్రము గాం గలదు. అప్పుడు మాకు స్వాస్థ్యమెక్కడిది? ధర్మమార్గమెట్లుండును? స్వామీ! శివాప్రియ! శరణ్య! ఈశ! త్రయీగణ్య కారుణ్యగుణభూషణ! అబ్రహ్మణ్య మిదే యాలింపుము! చంద్రశేఖర! అసహ్యావిక్రమోదగ్రులగు త్రిపురాసురనాయకులవలన మాకభిమానము తూలిపోయినది. శంభూ! శ్రుతిచూడామణీ! శివ! దక్షవాటీశ! భీమేశ! భోగిరాజవిభూషణ! మమ్ములను కృపతోం గాపాడుము! భువనత్రాణతత్పర! సప్తభువనములకు నుగ్రమగు కాలకూటభయముద్భవిల్లిన పగిదిం ద్రిపురాసురుల వలనను భయముద్భవిల్లుచున్నది" ని బ్రహ్మేంద్రాచ్యుతాద్యఖిలదేవతలును బ్రార్థింపంగా సకలత్రిభువనత్రాణజాగరూకేక్షణుండు ప్రభువు శివుండు సప్తపాతాళభువనగర్భగోళమునుండి యావిర్భవించినదివ్యస్వ యంభూజ్యోతిర్లింగమూర్తియు నగు భీమేశ్వరుండు నిర్వికల్పమును,

నిరస్తసమస్తోపాధికమును నగునిష్కళంకస్వరూపమును విడిచి, కుసుం
బరాగవిలసజ్జటామండలమండితుఁడును, గిరీటకోటిని స్తంద్ర చంద్రరే
ఖాసముజ్జ్వలుఁడును, మల్లికామాలికాలీలారంగద్గంగోత్తమాంగకుఁ
డును, గాశ్మీరతిలకాకారలలాటశిఖిలోచనుఁడును, గండమండలసం
దీప్తకుండలిస్వామికుండలుఁడును, నింద్రనీలమణి ఛాయావిరాజత్కంధ
రావిషుఁడును, బద్మాసనశిరోమాలాహారోదాగ్రభుజాంతరుఁడును,
సంధ్యాచాగుఘనోద్దామవారణార్ద్రాజినాంబరుఁడును, గరాంబుజాగ్ర
విలసల్లీలాసారంగశాబకుఁడును, నతార్తిధ్వాంతవిచ్ఛేది కోమలాంఘ్రి
నఖచ్ఛవియు, హారకర్పూరపాటీరమందారచ్ఛవి విగ్రహుఁడును నైకృ
పతో నాబ్రహ్మాదిదేవతలము గలఁ బ్రాణిమున్భించి దయాసుధారసా
సారసమగ్రశుభవీక్షణుఁడై యుండ నాబృందారకవరులు సాదరముగ
వీక్షించుచుండిరి. అప్పు డాయార్తత్రాణపరాయణుఁడు భీమేశ్వరుఁడు
నగేంద్రకన్యావక్షోజకుంకుమామోదమేదురమును, ఫణికంకణశోభిత
మును నగు తన శ్రీహస్తమును బ్రసారించి వారలకభయ
మొసఁగి సజలమేఘగంభీరస్వనమున నిట్లనుః—
"బ్రహ్మేంద్రప్రముఖామరులారా! మీరుచిరకాలమునుండి
పడెడిపాట్లకు నేనును నాడెందమునఁ గుందుచున్నవాఁడను. బాహుద
ర్పసముద్ధతులగుచు నిరాంతకులైయున్న దానవులను సంహరింతును.
మీరును బలయుతులగుచు యుద్ధసమారంభమహోత్సాహముతో
బయలువెడలిసనుఁ గొల్చిరండ"ని వారలకుఁజెప్పి యామదనాంతకుఁడు
ముహూర్తమాత్రములో శత్రునగరవిజయసాధనమును మనమునఁ
దలఁచెను.

ఇది స్కాందపురాణమున భీమఖండమునఁ
బదునెనిమిదవయధ్యాయము.



## పందొమ్మిదవ యధ్యాయము

### —♦ భీమేశ్వరుఁడు త్రిపురాసురులను సంహరించుట ♦—.

వశిష్ఠుఁడు మాండవ్యునితో నిట్లనియెను:—అనంతరమున భీమేశాభిజ్ఞానయోగములవలనను, ప్రభావాతిరేకము వలనను నాజ్ఞాతిశయమువలనను భూమిరథమయ్యెను; సూర్యచంద్రులు చక్రములైరి; బ్రహ్మసారథియయ్యెను; చతుర్వేదములును గుఱ్ఱములైనవి; ప్రణవము ప్రతోదమయ్యెను; తారకాపథము పతాకమయ్యెను; కనకాద్రిచాపమయ్యెను; ఫణివల్లభుఁడు నారియయ్యెను; సప్తమారుతములు కఱులయ్యెను; విలయకాలానలజ్వాల ములికియయ్యెను; పాలసంద్రపుటల్లుఁడు బాణమయ్యెను. ఇట్లీసాధనములన్నియును సన్నిహితములైయుండ దక్షారామపురాధ్యక్షుఁడు భీమనాథమహాప్రభుఁడు జగద్రక్షామహోత్సాహసముజ్జ్వలుఁడగుచుఁ ద్రిపురవిజయమునకై దర్వీకరేంద్రమౌర్వీకమగు మేరుకార్ముకమును గైకొని చంద్రార్క రథాంగమగు నుర్వీశతాంగమెక్కెను. అప్పుడు కన్నికారాంబ (గోగులమ్మ) బ్రాహ్మ్యాదిసప్తమాతృకలతోఁగూడి యామహాప్రభునిపై శుభాక్షతలు చల్లెను; పాతాళభైరవుఁడు బంగారుబెత్తము హస్తమునందుకొని ముందుగాఁ బోవుచు సైనికసమ్మర్దము నపనయించెను; దివ్యదుందుభినాదగర్జితములతో మందారపుష్పవర్షము మెండుగఁ గురిసెను; సంయమీశ్వరకోటులు నుదుట వెడదకేలుఁదమ్ముల మొగిడ్చి జేజేలుకొట్టిరి; ఆమహాప్రభువు పార్వతిని బరిరంభించు హస్తమున మేరుచాపమెక్కిడి పన్నగేంద్రగుణముసారించెను. అట్లనంతశక్తిమంతుఁడగు కపర్ది కాంచనాచలకూటకోటి వంచి మోపెట్టునపుడు స్వర్ణకారుఁడు నిర్మలరౌప్యమును గమ్మితీసిన విధమునఁ జక్కఁగా నిక్కి కానిపించెను; వెల్లుల్లి తునకల లాగునఁ

గుబుసముపగిలి బీటవాఱి తగడైత్తెను; మహనీయతరస్ఫార ఫణిమంజరి బాలపల్లవరాజీవముల పగిది జేగురించెను. మహాబలాఢ్యుఁడగు నాఫా లనయనుఁడు బంగారుకొండవింటను బాపజేనియల్లెత్రాటిని మహాక ఠోరముగా టంకరించెను. ఆటంకారము కనులగర్భాండమెల్లనిండెను. అందుచే భూచక్రము కుమ్మరిసారెవలె గిఱ్ఱున తిరిగెను; అంబరము బీట లువాఱెను; దెసలుబ్రయ్యలయ్యెను; పాతాళముఘూర్ణిల్లెను; బ్రహ్మాం డభాండములు పగిలెను. అంతస్స్మరారిశరాకృష్టసురాచలశరాసనమా కాశమధ్యమమున పూర్ణపరివేషమువలెఁ జూపట్టెను. మఱియునాయద్రి శృంగములను వర్తించు కర్మసుతులును దితిపుత్రులును బరస్పరము కుశల ప్రశ్నములు చేసికొనిరి. అంత నారుద్రుఁడుగ్రచాపమును బలము గా నాకర్ణాంతము తిగిచినప్పుడా నాగేంద్రుఁడు విషము భుగులుభుగు లునఁగ్రక్కెను. విషభృన్ముఖసంభవమగు నావిషవహ్ని సొగలెగయు చు భగభగధ్వానముతో నిర్భరభీషణమై ప్రజ్వరిల్లెను. అప్పుడు రుద్రు నిచేతికొండవింటను విషానలజ్వాలలు పుట్టి నగేంద్రుని నాసికారంధ్రము నుండి వెలువడు నిశ్వాసవాయువులచేఁ బెచ్చు పెరిగెను. ఆభీమేశుఁడు తెగనిండఁ దిగిచిన వింటినారి యగు పాపతేనినోటనుండి వెడలిన గా విసపుటగ్గి కాకోలమువలె వెఱపుగొలుపుచు నజ్జగములను ముట్టుకొ నియెను. అవ్విధము త్రిపురాసురవధారంభమున భువనైకధనుర్ధరుఁ డగు భీమేశ్వరుఁడు నిర్భరోత్సాహముతోఁ గనకాద్రిచాపము సుద్దం డభుజాచండిమమున నాకర్షించునప్పుడు భుజంగపుంగవుఁడు వేయుపడగ లను విషము గ్రక్కెను. అదియానాగేంద్రుని నాసికారంధ్రసముద్గీర్ణ ము గుచు క్షీరసాగర మథనోద్భూతహాలాహల విషమువలెఁ బ్రజ్వరిల్లి సముజ్జ్వల జ్వాలాజాలములఁ ద్రైలోక్య మాక్రమించెను. అంత విషభృద్భూషణుఁ డగు నా భీమేశ్వరుఁడు జగదా ర్తిహారుఁడు కావున దానిని వీక్షించి సంభ్రమముతో విపులజటాక

లాపమును బ్రసారించియు, గంగానదీప్రవాహాసల్పసలిలము బ్రోక్షించియు, వామలోచన శీతాంశుధామగానవమంజుల మగు కటాక్షవీక్షాజాలమును బ్రసరింపఁజేసియు నా మహోపద్రవముడిగెను. అంత విఘ్నేశప్రసాదపరితోషితుఁడును, దుర్గాసహాయుఁడును నై యా ఫాలేక్షణుఁడు విమలకత్య్యములును, దారామార్గచరములును, లోకోపద్రవకరములును నగు త్రిపురములను వీక్షించి పురాణపురుషుఁడును, వనామయుఁడును నగు నారాయణుని బాణముచేసి యరింబోసియుఁ, బాశుపతాస్త్రమంత్రకముగా నభిమంత్రించియు, నాకర్ణాంతముగాఁ దిగిచియు, ఫాలనేత్రాగ్నిజ్వాలా మాలోజ్జృంభణపూర్వకముగాఁ గఠోర మగు నట్టహాసముతో విజృంభించియు వైచిన నా విష్ణుబాణాగ్నిచే దైతేయనగరములు తగులువడినవి. ఆయసుగ్రామగృహములు లోహమయములయ్యును హరశరాగ్నికీలాజ్వాలాదాహమునఁ గరఁగి మూఁడు పెద్దముద్దలైనవి; చండికానాయకుఁడఖండ భుజదండబలసంపదచే మండలాకారముగ నొనర్చిన కాంచనాద్రికోదండపరివేషమునుండి వెడలిన పుండరీకాక్షకాండాగ్నిజ్వాలామాల సోఁకి యా దేవారినగర త్రయమునఁ బ్రాకారసౌధగోపుర కుట్టిమములన్నియును భస్మావశేషములయ్యెను; మణిస్వర్ణస్ఫురత్కృత్రిమ పర్వతములు చూర్ణములైనవి; మిగుల సొంపునిండిన యారామతోఁటలే కాక కేళీకాసార కల్హారకైరవకమలములును జూరుచురవోయినవి. అత్తఱిఁ గాలిన నగరసంగములు ఫాలనేత్రాస్త్రవహ్నిజ్వాలాజాలములఁ గాలుచున్న మండలితమైన కంటకమను భులింగ మొక్కటి శోభిల్లుచుండెను. అది యాదిలింగోద్భవమునాఁటి యభవుని భాతి నింగి మోచియుండి యగ్నిసెక దాఁకక దీపస్తంభమువలె దీపించుచుండెను. అట్లు నారాయణాస్త్ర దైతేయజ్వాలాజాల విజృంభణమున దైతేయనాయకస్వామి యగు భీమనాయకునకు దానవాధీశుఁడర్పించిన కేళీకాననకల్పవృక్షసముద్భూతపుష్పములు వాడు

వాఱకుండెను; చారుకర్పూరసంయుత విలేపనము కొంచె మైనను గొఅపడకుండెను. అవ్విధమున ఋక్సామయజురథర్వణ వేదతురంగకమును, సూర్యశశాంకరథాంగమును, గమలోద్భవసారథికమును నగు ధరిత్రీరథమెక్కి సర్వరాజకింకిణీకమైన కాంచనాద్రిధనుర్దండమునఁ బుండరీకాక్షబాణమును సంధించి పురత్రయమును దహించి జయలక్ష్మిఁ బరిగ్రహించెను. విశ్వావసు ప్రధానానాగంధర్వులు జేజేలుపల్కిరి. అంతసర్వదేవనాథుఁడునీలగ్రీవుఁడుక్రీడాలీలావిలాససంపన్నుఁడగుచుఁ బ్రమోదాతిశయమునఁ దాండవమాడఁ దొడఁగెను. ఆచండికానాయకుఁడు తాండవించిన తాండవమునింద్రాది దేవతామండల దృక్ఫలమై, డిండిమారానకలితమై, డమరుధ్వనిమంజులమై, యఖండిత శ్రమఃకుభ్యద్ద్వాస్సాకుండలి వల్లభమై, యఖండతారాభ్రమదములను, జటామండలమండనములను, జలద్గంగా కాండగణములను మహానటుని హర్షమునను, నట్టహాసములను, మహాస్వనములను బొందు బ్రహ్మాండమండలమై యుండెను. అప్పుడు ల్పాటనోగ్రభైరవ డాకినీగణమును, సప్తమాతృకలును, పిశాచములును, నిశాచరులును, భూతములును, ప్రమథవర్గమును సమస్తవిబుధవ్రజమును బొగడ నిస్తుల్యమహిమోన్నతుఁడ శేషభువనాధీశుఁ డెంతయు సంతసమందెను. అంత భీమనాథుఁడు కనకశైలకోదండమెక్కుడించి యథాస్థానమున నునిచి మౌర్వి యగు ఫణినాయకుని విశ్వంభరాసంభరణమునకు నియోగించెను; అచ్యుతసాయకమును క్షీరాంభోరాశిమధ్యమున సమర్చెను; సరస్వతీనాథుని సత్యలోకమునకుఁ బనిచెను; వేల్పులను వీడ్కొలిపెను; వేదములను నిట్టూర్పుగాడ్పులలోఁ గలిపికొనియెను; దివాకరనిశాకరులను గాలము గడుప నియోగించెను. అట్లు నానాభువనానీకపరిత్రాణపరాయణుఁడగు భీమనాయకుఁడు కృతకృత్యుఁడై త్రిపురాసురులకుఁ గల్గ దైవతమును, బరమమును, నిర్మలమును, నిరు

పద్రవమును, బంచాక్షరీపంచతత్త్వమును, బంచబ్రహ్మమయమును నగు నాదివ్యలింగము * నైదుఖండములుగా ఖండించి యందలి నాల్గుఖండములను యమరేశారామ సోమారామక్షీరారామకుమారారామములని విఖ్యాతములగు చతురారామ నగరములందుఁ బ్రతిష్ఠించి తాను దక్షిణానందకాసన్నమై, దక్షిణసాగరతటక్షితియందున్న దక్షారామపురమున శుద్ధస్ఫటికసంకాశమును, సర్వలోకమనోహరమును, స్వర్గలీలావతీచాకులోచనప్రసవార్చితమును, సమస్తభువనస్తుత్యమును ననంతఫలదాయకమును నగు భీమేశ్వరమహాలింగమునందధివసించెను. ఇందుశిఖామణి యగు భీమేశ్వరుఁడు త్రిపురసంహారమొనర్చిన యీ పుణ్యకథను భక్తితో వినువారలకుఁ బరమసుఖము పాటిల్లును.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునఁ బందొమ్మిదవ యధ్యాయము

---

* "ఐదు ఖండములుగా ఖండించి కృష్ణవేణీమహానదీతీరమున ధరణాలకోట యను గ్రామంబున నమరేశ్వరునిచేతఁ బ్రతిష్ఠితంబగుటంజేసి యమరలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును గౌతమీతీరంబున దక్షిణకూలంబున గుణపూడి యను గ్రామంబున సోమునిచేతఁ బ్రతిష్ఠితంబు సేయంబడుటంజేసి సోమలింగంబనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును, బాలకోట యను గ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితంబగుటంజేసి రామలింగంబునాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును, జాళుక్యవంశ రాజధాని యగు చాళుక్యభీమవరనామగ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామిచేతఁ బ్రతిష్ఠితం బగుటంజేసి కుమారభీమలింగంబనఁ బ్రఖ్యాతంబు నొందిన భీమారామంబును, మొదలిమామ యగు దక్షప్రజాపతియునికిపట్టయిన యారామంబగుట దక్షారామంబున శివసన్నిధానంబై తానుండునట్లుగా నీప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామములను బ్రతిష్ఠనొందించి తాను దక్షవాటంబున మున్నీటితటంబున విశుద్ధస్ఫటికసంకాశంబై త్రిదశలోకభామినీవిలోకనచ్ఛాయాసుభచ్ఛాయాభిషిక్తయుక్తంబగు శ్రీభీమేశ్వరలింగంబునందధివసించెను." అని శ్రీనాథకృతభీమేశ్వరపురాణమునందున్నది.

*

## ఇరువదవయధ్యాయము

—♦ భీమలింగమును బ్రతిష్ఠింప సప్తమునులును సప్తగోదావరమును తెచ్చుట ♦—

అంత వశిష్ఠుఁడు మంకణునితో నిట్లనియె:—ఓమంకణా! తగ్వాత దివ్యమునులేద్వారును దృఢభక్తి సమన్వితులై చప్పటతాళములు మొరయ సంస్తుతిపూర్వకముగా నృత్యమొనర్చుచుఁ బ్రమోదమున బులకాంకురములు మైనిండనుతించుచు, భక్తానంతఫలప్రదుఁడగు భీమేశలింగమును భజించిరి. ఆ ఖండపంచకము నిత్యమనంతఫలమిచ్చును. దానిని దేవాంద్రాదిదేవతలు సేవించిరి. అది కోటిసూర్య ప్రకాశము కలది; కుండలీశ్వరకుండలమైనది; బ్రహ్మాండకోటిజనకమైనది; చంద్రఖండమండనమైనది; పుండరీకాక్షనపట్టప్రోల్లసత్కటిమండలమైనది; పుండరీకోద్భవశిరోమాలికాహారశోభితమైనది; ఆదిమధ్యాంత రహితమైనది; ఆదికారణమైనది; అవ్యయమైనది. అఖిలాగమసంవేద్యమైనది; అప్రమేయమైనది; అనీశ్వరమైనది; అపారమహిమోదారమైనది; అవాఙ్మానసగోచరమైనది; అనంతగుణసంపన్నమైనది; అజేయమైనది; అసమానాధికమైనది; అశేషమంగళస్థానమైనది; అపవర్గఫలప్రదమైనది అచలధ్యానశుద్ధాత్మమైనది; స్వభక్తజనకామధేనువైనది; మహీతలమునందా పంచారామములు సకలసంపత్సంపూర్ణములైనవి. అందు దక్షారామము ఉత్కృష్టమైనదని ప్రశస్తివడయుచున్నది. ఆ పురవరమునఁ బంచబ్రహ్మమయుఁడును, జ్యోతిర్లింగమూర్తియు, సదాశివుఁడును నగు భీమనాథుఁడు వెలసియున్నవాఁడు. అంత మహాధన్యు లగు నామహర్షులు ప్రదీప్తమగు నాలింగమూర్తిని విలోకించి పరమానందమునందిరి. దేవతలును తపోధనులును బ్రసన్నుఁడగు నాయీశునిఁ గాంచి "ఇఁక ముందు దైత్యులవలన బాధ మనకేమియును లేదు" అని సంతసించిరి. ఘోరమగు కారాగారములందుంపఁబడిన సురాంగనలును

వారలపుత్రులును భర్తలును దుఃఖమును బాసి మోదమున గోదావరి జలముల నీరాడిరి; లోకాహ్లాద విధాయకునిదక్షపురాధీశుని భీమనాయకుని దర్శించిరి. అంతఁ బుణ్యాత్ము లగు భరద్వాజాదిమునులేడ్వురును భీమనాథాభిషేకమునకై యొకనదినిదోడ్తేర నాయిత్తపడిరి. ఆ తపస్వులు భుక్తిముక్తిప్రదమై, పంచబ్రహ్మతేజోవిభాసితమై, యాదిమధ్యాంతరహితమై, యనవద్యమై, యనీశ్వరమై, సకలశోభనమై, శుద్ధమై, బుద్ధమై, యక్షోభ్యమై, యుత్తమమై, యాద్యమై, యచ్ఛేద్యమై, యజరమై, పూజ్యమై, భువనపావనమైయుండి యాకసము నంటుచున్న భీమేశ్వరమహాలింగమును విలోకించిరి. దానిని సంప్రతిష్ఠింపనుద్యమించిరి; అందులకుఁ గాలము పరికించిరి; శుభలగ్నమును నిశ్చయించిరి; సర్వసంభారనిచయమును సంపాదించిరి. అంత వినుత వ్రతులగుచు "మొకట నిటకే శుద్ధవాహినిని గౌతమీనదిని దోడ్తెచ్చి శుభమగు లింగసంస్థాపనము చేయుగము"ని సంకల్పించుకొనిరి. అంత వారు నిర్ణయించుకొనిన శుభలగ్నమున దివ్యామృతస్వయంభూతలింగమూర్తికి మహాప్రభునకు భీమనాథదేవునకు వాహినీవిమలజలములఁ నభిషేకింప మహర్షులు గౌతమప్రముఖులు సాభిలాషులగుచు శిష్యసహితులై దక్షవాటీమహాపురిమునందుండి నిర్గమించి శీఘ్రముగ నేగి పురోభాగముననున్న మహాపుణ్యతరంగిణి యగు గౌతమీగంగను గాంచిరి. ఆ యాపగ లోలకల్లోలమాలికయై యుండుటయే కాక డోలాఖేలావిలాసభాసమానమరాళకచక్రవాకక్రౌంచసారసజలకుక్కుటాదివివిధజలవిహంగములతోడ శోభిల్లుచుండెను. మఱియు డిండీరపిండపటలప్రభాధవళితాంబరమై, సుధారసప్రతిచ్ఛందమధురాంబుసమంచితమై, శీతలోర్మిచ్ఛటప్రవాతనిపీతసకలశ్రమయై, స్నాననిష్ఠాపరానేకజనాకీర్ణతటద్వయమై యుండి యనవరతమును దేవతలచేతను, దాపసులచేతను, బొగడఁ బడుచున్నది. ముదమున నీగౌతమీపయఃపాన మొనర్చినవారు

మరల మాతృస్తనపయఃపానమాచరింపరు. అంత నామునివర్యులు పరమానందభరితులగుచుఁ బరస్పరమిట్లనుకొనిరి:—కంటిరే! మును లార! ఈగంగ ప్రభావసంపన్నయై త్రైలోక్యపావనమొనర్చుచు నిరం తరము చలద్వీచిహస్తవిన్యాససంభ్రమములతో ఘుమఘుమధ్వానహుం కారఘోషమొప్ప నిఖిలఘోరపాపౌఘములను జంకించుచున్నద"ను కొని దృఢవ్రతులగు నా మునివర్యులు స్వకామితార్థసిద్ధికై యా గౌతమి నిట్లుగ్గడించిరి:—"అంబ! గోదావరి! నీకు తీరములందు సతతము గీర్వాణయక్షోరగసిద్ధసాధ్యగంధర్వవిద్యాధరులు నిండియుందురు. ఓ లోకసంరక్షణవిచక్షణ! మమ్ము నారతమును రక్షింపుము! త్రైలోక్య పావని! అరవిందగర్భ! గంగా! దేవీ! అమృతోపమానము లగు నీదు జలములనిచ్చి నిత్యమును సకలశరీరులను రక్షించుచున్నదానవు; కాన నీవు తల్లివి! మహేశపత్ని! నగరాజకన్యా! జగత్పవిత్రీకరణాతిసక్తా! నీదు హస్తకమలమనుకుండియందు నిండుగ జలమున్నది ప్రపన్నుల మగు మమ్ములను బరిపాలింపుము! అంబ! గోదావరి! భక్తితో గోదావరి యను నీ పుణ్యనామమును వచించుగుణవంతుల కెల్లపుడును బహుళశుభములు గలిగింతువు అంబా! కంబుమరాళముక్తామణి ప్రభా జాలవిభాసితములై యమృతోపమానములగుచున్న నీదు జలములు మాకు నిత్యము బహుళాభ్యుదయము లొసఁగుఁ గాత! గౌతమి! లోక మాత! నక్షత్రముల వలెను ముక్తాహారములపగిదిసి సుధారసము చం దమునను శుభ్ర మగు కాంతినీకుఁగలదు! ఆపాతాళగభీరనీర! సాగరా లింగనసౌఖ్య! నీకు నమస్కారము! ఓ గౌతమీ! దేవలోకనిశ్రేణికా! ద్వీపసమగ్రభూషా! సంతాపనిర్వాపణచతురా! సమస్తకళ్యాణదాయిని! నీకు వందనము! గంగా! అనేకకాంతలు కనకకలశములను ముంచు నపు డగు ధ్వనిచేతను, గజగండూషములచేతను భిన్నములగు యూపములు నీయందుఁ గాన్పించును! నియందుద్భవిల్లిన పద్మములపై రాయంచ

ళ్లాడుకొనుచుండును. ముప్పూటను నీకు మ్రొక్కెదము. ఆనందకర్త్రీ! అఘసంఘహర్త్రీ! వందారుబృందపరిపాలనకల్పవల్లీ! బృందారక వ్రాతమునీంద్రవంద్యా! గౌతమకన్యకా! నీకుఁ బ్రణమిల్లెదమ"ని కొండాడి యిట్లు వేఁడికొనిరి:—! "విచ్చేయవమ్మ! త్ర్యంబకాద్రీంద్ర గజగండస్థలదానధార! పయనము కావమ్మ! శీతాంశుకళాకిరీటజటాటవీనూతనపుష్పవల్లి! ... వమ్మ! కంజాసనపాణికంజకమండలోదంచిత తీర్థవారి! లేవమ్మ! గోత్రావనితావతంసకంఠస్ఫురన్మౌక్తికహారవల్లి! ఆలోలకల్లోలపరంపరలతోడను, పాండురడిండీరఖండతండములతోడను, ముక్తామణిశ్రేణిసమాశోభాసముచ్చలద్వారిసమూహములతోడను విరాజిల్లుచు వినుతప్రభావవై, జలాభిరామవై, జనవీక్షణీయవై, నిరంతరామోదభరప్రపూర్ణవై, వేగిరముగాఁ గదలవమ్మ! గంగమ్మతల్లీ! అదే! సాగరతీరమున మాస్వామియమృతాంబురాశి సముద్భవుఁడు శ్రీదక్షవాటినగరీశ్వరుఁడు భీమపతిప్రీతితోఁ బ్రతిష్ఠఁ గైకొనును; కాన యో దేవి! గోదావరి! త్ర్యంబకశైలకన్య! రోలంబమాలాకలితాంబుజాతసంపద్విరాజద్విమలాంబుపూర! నీవా దేవుని సమీపభూమిని శీఘ్రముగాఁ బ్రవేశింపుము! సోమకళావతంసుఁడు మహేశుఁడు భీమేశ్వరుఁడు వైశమప్రతిష్ఠఁ బొందఁ బ్రతీక్షించుచున్నవాఁడు. ఓకళ్యాణీ! కాల విలంబముచేయక యాతనికడకుఁ గదలిరమ్మ!" అని మహానుభావులు సంయమీశ్వరులు ప్రార్థింప నాగంగమ్మ ముదమున వారలను వెంబడించెను. అప్పగిది సత్యద్భుతప్రభావముచే మహాత్ములు తపస్వులు లోకపావనియు, గీర్వాణతాపసవ్రాతసేవ్యమానపయస్సుధయు, నాంధ్రభూకాంతాకుచహారావళియు నగు నాగోదావరినాకర్షించుకొని మోదముతోదానికిముందును వెనుకను బార్శ్వములనునుండిభజించుచు దక్షపురీమార్గమును బట్టిరి. అయ్యదనున మహేంద్రుఁడు సర్వదేవగణప్రభుఁడగు భీమనాయకదేవునిప్రతిష్ఠఁ జూచు వేడుకతో నంతరిక్షమార్గమున

లోకపాలకగంధర్వయక్షవిద్యాధరసిద్ధసాధ్యులను వెంటనిడుకొని దృఢాదరుఁడగుచు నావిధముగా గోదావరిని దోడితెచ్చెడి మునిపుంగవుల ననుగమించెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున "సప్తమహర్షికృతగోదావరీసమానయన మ"నెడి పేరుగల యిరువదవయధ్యాయము

---

## ఇరువదియొకండవయధ్యాయము

సప్తర్షులు సప్తగోదావరమును దెచ్చునపుడు తుల్యభాగాతీరమందలి రాక్షసులతోఁ గలహింపుట.

అట్లు సప్తమహర్షులు గోదావరినిదోడి తెచ్చెడిమార్గములో నొక నదియొద్దనఁ బుణ్యజనులు పెక్కండ్రు బంధువులతోఁ గూడి నార్హస్థ్యయుక్తమగు పుణ్యతపంబాచరించుచుండిరి. అప్పుడారక్కసుల యునికియుండెడి సర్వస్వమును మునులను వెన్నంటి వేగముగా వచ్చెడి యేటివెల్లువ గొనిపోయెను. అట్లు వాయుశోభుగ్వేదికాయురాపస్తంభాలీ స్రుక్స్రువాదికమును, కమండలుబృసీశాటీపుస్త దేవార్చనవ్రజమును సర్వార్థములును వరదపాలైపోవుటగాంచి యా యాశ్రమవాసులగు దానవులా మునిబృందముతో వాదులాడఁ దొడఁగిరి. అప్పుడా కాశదివ్యమునులకును దైత్యమునులకును క్రోధముప్పతిల్లుటచే నొండొరులు కలహింపసాగిరి. అత్యతిపారులకుఁ గన్నులెఱ్ఱవాఱెను; బొమముడి విఱిసెను; కటము లదరెను; శిఖలు వీడెను; అవ్విధమునఁ బోరాడియాడి తమ తమ తపోబలాతిరేకమున నొకరిపై నొకరు శాప

ములుగ్గగింపఁ జేతులతో జలమంచుకొనిరి. దానవులా సప్తమునులు
తెచ్చెడి పుణ్యనది యెండిపోవుఁగాక! యని యు, దేవర్షులా దానవుల
పుణ్యతరంగిణి యపూజ్య యగుఁగాక! యనియు శపించుకొనిరి. ఆ
దానవనదియుఁబూర్వముగౌతమీనదినుండియేపుట్టినది. దానిని దపస్వి
యు మహాత్ముఁడును నగు తుల్యభాగునిచేఁ దోడ్కొని రాఁబడినదని
యితిహాసము దెలిగినవారలు పల్కుదురు. ఆతుల్యభాగుఁడు రాక్షసుఁ
డయ్యును సాధుమార్గమవలంబించినవాఁడు; పరమాత్మతత్త్వ మెఱిఁగిన
వాఁడు; పక్షపాతము లేనివాఁడు. అతఁడు మధ్యస్థుఁడై సురా
సురులపోరాటము మాన్పెను. అట్టి తుల్యభాగసమర్థత్వమువలననే యా
దైత్యుఁడన్వర్థ నామకుఁడయ్యెను. వాని నామముననే మేదినిమీఁద
దుల్యభాగ పెంపొందుచున్నది. ఆనిమ్నగ పూర్వము గౌతమికిఁ
బుత్రిక. అంతమునిరాజగు తుల్యభాగుఁడు మహాశ్రమపడుచు వివదిం
చుచుండఁజూచి మునులను, దానవులను వారించి లోకహితముగ నిట్లని
యెను:—"మహాత్ములారా! కోపము వలదు! ఈ పుణ్యనదులు జగ
త్పావనజీవనలు; వీనిని మీరలు శపింపఁదగరు. ఓసాధులారా! ఘోర
మగు నీశాపాగ్నిని జల్లార్పుఁడీ! శమావంతులకుఁ దాపసుల కిట్టి కోప
మెన్నడు నుండరాద"ని ధీమంతుఁడు తుల్యభాగుఁడుపదేశింప వారలె
ల్లరు నాతని పలుకులను బాటించి యిట్లనిరి:—"ఓయనఘా! నేఁడు
తాముపదేశించిన హితవాక్యమునందాదరముంచితిమి. అమోఘమగు
మామాట మరల్పరాదు; కాన వేఱు తెఱఁగున భువనస్తవనీయులకు
నీమహాతటినులకు మేలొనఁగూర్తుమ"ని దైత్యమునులు ప్రసాదముతో
సప్తర్షిప్రవరానీత యగు వాహిని యంతఃప్రవాహ యగునట్లుగాను,
సప్తరుషులును నా దైత్యతపస్వులనదియగు తుల్యభాగకు నుత్తరాయ
ణదక్షిణాయన పుణ్యకాలము లందును, సూర్యచంద్రగ్రహణములం
దును, ప్రతియాదిత్య వాసరముననను, దర్శపౌర్ణమాసీప్రభృతి మహా

పర్వకాలములందును,సంక్రమణము మొదలగువిశేషకాలములనుస్నాన దానజపతపహోమశ్రాద్ధదేవార్చనా విధానము లక్షయఫలము లగు నట్లుగాను వరములు ప్రసాదించిరి. అంత గాతమీగంగ సిద్ధులును, గింపురుషులును, యక్షులును, నాగులును, విద్యాధరులును, సురలును, గరుడులును, సాధ్యులును, ఖేచరులును, మొదలను పార్శ్వదేశము లను నుండి హర్షకోలాహలోద్ధతు లగుచు గైవార మొనర్చుచుండ రంభాది దివ్యాప్సరోగనలాడుచుండ, దానవబృందము మురళీగాన మొనర్చుచుండ, ధాత్రీజనులు సింహనాదములు సల్పుచుండ, సము చ్చలత్పయో వీచిమాలికాపరిశోభితయై, దూరీకృతేశగోవిందధామసిద్ధ వసుంధరయై, జవాతిశయ శీర్ణాద్రిధాతురేణు చయాంబిలయై, ప్రవాహ జనితారావ ప్రపూరితదిగంతరయై, వేగముగా బ్రహహించి ప్రవహించి దక్షవాటీమహాపురిం జొచ్చినది. అప్పుడు తారామార్గమున దేవదుందుభి నిస్వనములు విజృంభించెను. ఆ నదియే దక్షవాటాంతికక్షోణీకాంతకు మండనమయ్యెను. అట్లు సప్తమహర్షులు పుణ్య యగు గోదావరిని దెచ్చి హర్షోత్కర్షమునం దారునిశ్చయించిన శుభలగ్నమునం బ్రతి ష్ఠితుండై పూజనము గొన్న భీమేశుని గాంచి విస్మయమందిరి. మహే శుండే తారు నిశ్చయించిన శుభలగ్నమున దనకుదాను బ్రతిష్ఠితుం డయ్యె నని పరమర్షులు ప్రహర్షించిరి; కాని యాభీమేశుని ప్రతిష్ఠను మే మొనర్పవలయునని యాయిత్తపడునెడ మమ్ములను గైకొనక నిర్భ యముగా నెవ్వరో ప్రతిష్ఠగావించిరని విహ్వలచిత్తులైరి. అంత సంతో షరోషసంరంభ నిర్భరాక్రాంతచేతసులగు నాఋషులచెంతకుం బద్మ బాంధవుండు ససంభ్రమమున గగనమునందుండి విచ్చేసి భక్తినమ్రుం డై సంయమీంద్రులకు మ్రొక్కి కరకమలములు ముకుళించి యిట్లని యెను:—"ఓపరమర్షులారా! మిమ్ములను మిగుల వేడికొనుచు నే నొక విన్నపము చేసికొనుచున్నవాడను. కృపతో నాలింపుడి! మీ

కు మార్గమున నంతరాయము కలిగి కాలవిలంబము కాఁగా శంభుఁడే తనకుఁ దాను బ్రతిష్ఠితుఁడయ్యెను. అంత నేనా దేవునిఁ బూజించితిని. ఓ మహాత్మకులారా! మీరు వాంఛించిన దేవదేవుని ప్రతిష్ఠాపనము నేఁ జేయశక్తుఁడనే! అశేషజగదాధారుఁడు దక్షారామవల్లభుఁడు భీమేశ్వరుఁడు తనకుఁ దాను బ్రతిష్ఠితుఁడయ్యెను. మీరు నిర్ణయించిన శుభకాలమతిక్రమింపరాదని కృపాసింధువు కంఠేకాలుఁడు తనకుఁ దాను నిలువఁబడియెను. అట్లు స్వయముగాఁ బ్రతిష్ఠితుఁడైన దక్షాధ్వరధ్వంసకుని మొదట నేను బూజించితిని; తర్వాత హరి యర్చించెను; పదపడి బ్రహ్మ కొలిచెను? పిమ్మట సకలదేవతలును నారాధించిరి. మీరును నాభీమేశ్వరునిఁ బూజింపుఁడి!" అని యాయాదిత్యుఁడు మునులతోఁ బల్కఁగాఁ గాలయాపనమువలనఁ జంద్రమఃకిరీటుని ప్రతిష్ఠాపనము లభింపమికి మిగుల వగచిరి. అత్తెఱఁగున మనస్తాపమునందు మహాతపోధనశ్రేష్ఠులకా కాశవాణి యిట్లనియెను:—"ఓమునీంద్రులారా! కరుణాసింధువగు నిందురేఖాశిఖామణి మీయెడ ననుగ్రహముచే నాత్మసంస్థాపితుఁడయ్యెను. భక్తితత్పరులై యత్నించుచుండిన మీచేతనే స్థాపితుఁడయ్యెను. మీరట్లు డెంకమునఁ గుందరాదు. భక్తిగౌరవముకన్నఁ బ్రధానమేమున్నది? మీకు భక్తివశంవదుఁడగు భవుని పైభక్తి యల్పమైనదా? ఉత్తములగు మీరు భీమేశ్వరునిమూర్ధాభిషేకమునకై గౌతమీపుణ్యనదిని బాదపీఠసమీపభూమికిఁ దెచ్చితిరి. ప్రతిష్ఠారంభసమయమున నభిషేకించిన భానుఁడును, బ్రతిష్ఠింపఁజూచిన మీరలేద్వారును బరమేశ్వరుని నిల్పినారు. భక్తిసంపన్నులగు మీరలెనమంద్రుగురును నేకార్థార్వక్రియాపరులే! ఓతపస్వులారా! నభోవీథియందుండి నేను సత్యముచెప్పితిని. మీరలెనమంద్రును గలసి మహేశసన్నిధిని బూజకై పాశుపతులను నియోగింపుఁడి! వారష్టమూర్తులనఁ బడుదురు. భూతలమున వారు దక్క నన్యులర్హులు కారు. అష్టమూర్తికు

లమునఁ బుట్టివాఁడు జడుఁడయ్యును భవార్చనకర్హుఁడు; కాని వేదాంతవేత్తయయ్యు నితరుఁడు భీమేశుఁజూడ నర్హుఁడు కాఁడు" అని నభోవాణి పలికిన పలుకులు పరమర్షులు విని మిగుల నుప్పొంగి నభోమణికిఁ బ్రణమిల్లి యాతనితోడఁ గూడి గోదావరిప్రవాహజలములను హేమకుంభములనిండఁ దెచ్చి భీమేశ్వరునకు బాగుగా నభిషేకించి పూజించిరి. అట్లు సప్తమునివరులు తెచ్చిన గోదావరీమహానదికి సప్తగోదావర మను పేరువచ్చెను" అని వసిష్ఠుఁడు చెప్పినదంతయు శంకరాశ్రయుఁడగు మంకణుఁడు విని ప్రీతుఁడై మరల భీమేశవైభవమును దెలుప నిట్లనియెను:—"ఓమునీంద్రా! ఉత్తమమగు భీమేశ్వరదేవమాహాత్మ్యమును విన నాడెందమునఁ గౌతుకము జనించుచున్నది; కాన యా దేవుని గౌరవమును జెప్పుమ"ని మంకణుఁడడుగఁగా మరల వసిష్ఠుఁడు చెప్ప మొదలిడియెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునందిరువది

యొకండవ యధ్యాయము

---

## ఇరువదిరెండవ యధ్యాయము.

—సూర్యుఁడు కైలాసగిరినుండి గౌరీపతిని పక్షివాట

మునకుఁ దోడితేఁబోవుట.

వసిష్ఠుఁడు మగుడ మంకణునితో నిట్లు నుడివెను:—ప్రతిష్ఠానంతర మాదివ్యలింగమునందుఁ బరమేశసన్నిధానము చేయ నెంచి దివాకరుఁడు గత్యర్థము తన మూర్తినొకదానిని సురాలయమునఁ

బ్రినర్తింపఁ జేసి వెసఁ గైలాసనగమున కేగెను. కుబేరదిగలంకార మగు నాధాత్రీధరోత్తమమున వరదముపైనుండి యవతరించి సర్వలోకాధిపతి యగునిందురేఖావతంసుని మందిరసమీపమునకు భక్తివిశ్వాసపూర్వకముగా విచ్చేసెను. అప్పుడు బహిర్ద్వారప్రదేశమున నందియాదిననాథులు నివారించెను. అంతట భాస్కరుఁడానందీశ్వరుని నుపనిషద్వాక్యములచేఁ గొనియాడెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులైన నావృషభేశ్వరు నట్లు సంస్తుతింపగు. అంత నానందీశ్వరుఁడు ప్రసన్నుఁడై యాభాస్కరుని వెంట నిడుకొని వచ్చి భృంగిభీషణహుంకారమహారావభయాకులమై, గణనాతీతగీర్వాణబృందసాంద్రమై, యుందచితమై యున్న కక్ష్యాంతరమును బ్రవేశపెట్టెను. అంత నాభాస్కరుఁడును భక్తితో భక్తాధీనుఁడై, శుభదర్శనుఁడై యున్న భవానీపతిని దర్శించెను. ఆమహాదేవుఁడు జటాపల్లవకుంజాగ్రమునఁ బుష్పశోభను ధరించునదియు, గంగాతరంగాంభఃకణాలంకృతమును, నిందిందిరసుందరసుందరలాంఛనమును, సుధాకరందరుచిరమును, గిరణచ్ఛదమనోజ్ఞమును నగు సురపొన్నపూవును ధరించి యుండెను; లలాటమున నింధనీభూతకామకళేబరము గల నేత్రాగ్ని యను తిలకముచే నొప్పుచుండెను; ఫణామణికిరణసమాక్రాంతవిశేషముగాఁ బ్రకాశించెడి ఫణికుండలద్వయముచే నా కైలాసవాసుని చెక్కుళ్ళు చెంగలించుచుండెను; ఇంద్రనీలమణులను గరిఁ పకయే సల్లనికాంతిగల హాలాహలశోభచే నాశంభునికంఠము శోభించుచుండెను; సలక్షణవేదాధ్యయనశానకర్షములచే మంజుల మగుబ్రహ్మశిరోరత్నహారమున నావామదేవుని వక్షస్థలము భాసిల్లుచుండెను; ప్రళయకాలాగ్నిని దగ్ధము లయినభువనముల భూతి యాభూతేశుఁడు దేహమునిండఁ బూసికొని యుండెను; ఆగిరీశునియంబరముప్రకాశించు శరీరకాంతిసంపదననంబరమునుధవళితముగాఁ జేయుచున్నది; ఆచంద్రశేఖరుఁడు శేఖరశశాంకునకుఁ గ్రొత్తగారజ

నీకళత్రమునుగల్పించినభంగినున్నపచ్చియేనికతోలువచ్చడమువైచికొని యుండెను; ఆభూతేశుఁడు బుధాభీష్టఫలదాయకుఁ డగుటవలనను, గంకణోరగభోగాగ్రరత్నాంశుచయమంజులము లగునిజాయతబాహుదండములు పల్లవశాఖలతో నొప్పారుటవలనను బ్రేతుకులకుఁ గల్పవృక్షభ్రాంతి కలిగించుచుండెను; ఆ శశిధరుఁడు గౌరీదృష్టివిలాససాదృశ్యస్నేహగౌరవమున సంప్రాప్తమైన జింకపిల్లనుఁ జేతఁ బట్టుకొనియుండెను; జలంధరాది రాక్షసుల ప్రాణానిలములను గ్రోలిన మహాసర్పమో యన్నట్లున్న త్రిశూలము నాశూలి కేలఁ గీలించియుండెను; ఆ యభ్రకేశుని యాభరణభోగిభోగమాణిక్యతేజ మగ్నిస్తంభావిర్భావచర్యను దలఁపునకుఁ దెచ్చుచున్నది; మహావిషప్రదానాపరాధము శాంతింపఁ జేసికొన వచ్చి యంతకమస్తకమును దాడన మొనర్చిన పాదముపైఁ బడిన సాగరము భంగి నున్న ఫణాగ్రములందుఁ బ్రకాశించు మాణిక్యములందుఁ బ్రతిఫలించు మేఘములతో నలరారు శేషాహిమంజీరము నాశర్వుఁడు తొడుగుకొని యుండెను; శ్రుతిసీమంతిసింధూరకనీవారుణత్విషములును, దపస్విమలస్వాంతసరోజమిళిందములును, బల్లవాళిసముల్లాసహారులును నగుపాదములందు నఖేందుచంద్రిక యాక్రమించి యుండి వందారువుల తమమును హరియించుచుండెను; శీతాచలసుతాగాత్రలతావృతిసమేతమై యున్న నిజతనూధవళసంపదచే యమునావాహినీయుక్తసుధాంధస్సింధువిభ్రమమును వహించి యుండెను. ఆపినాకి శుచిస్మితుఁడై బ్రహ్మవిష్ణ్వాశవాసవాదిసురావళిపైఁ గారుణ్యపూర్ణసంవీక్షాసుధాసారము చిలుకుచుండెను; పార్శ్వములందు సనకాది మహాయోగిప్రవరు లాశంకరుని దివ్యమంగళవిగ్రహమును నేత్రచషకములను గ్రోలి మరలఁ గ్రక్కుదురో యనుభయమున నిమీలితాక్షులై ధ్యానయోగముఁ సేవించుచున్నారు; చతుర్ముఖపురందరులను తృణీకరించు ప్రమథవ్రాత మాఖండపర

శువును సేవించుచుండెను. మఱియు నాగిరీశుఁడు కందర్పకోటిసుందరుఁడును, ప్రసన్నవదనాంబుజుఁడును, సకలభువనరక్షణజాగరూకేక్షణుఁడును, తేజోరాశియు, ససంఖ్యాతకల్యాణగుణభాసురుఁడును, సకలజగదుత్పత్తిగుప్తివిపత్తివిధాయకుఁడును, నిర్మలుఁడును, నిరుపద్రవుఁడును, బిచండసంభృతానేకకోటి బ్రహ్మాండమండలుఁడును, సర్వదేవగణాధీశుఁడును, సర్వభూతనివాసియు, సకలభూతనియంతయు, సర్వజ్ఞుఁడును, శంకరుఁడునునైయుండెను. అట్టియు హీశునకుఁబరమభక్తితో సాష్టాంగదండప్రణామమాచరించి యంజలి కీలించి ముంగల నిలచి దివాకరుఁడిట్లుంగొని యాడెను:—"శివ! రుద్ర! శంభూ! పరమాత్మా! భవభంజక! భీమ! విశ్వరూప! నీకు నమస్కారము! భవ! శర్వ! బ్రహ్మ! సర్వసాక్షీ! శక్తియుక్త! శాంత! వామదేవ! నీకు నమస్కారము! అఘోర! ఘోర! గూఢ! అమితతేజస్కుఁడ! శరణ్య! అగ్రగణ్య! నీలకంఠ! నీకునమస్కారము! స్తుత్య! సత్య! నిత్యానందమయ! జ్ఞానాత్మ! భగవానుఁడా! మహాదేవ! నీకునమస్కారము! శ్రేష్ఠ! శర్వ! సర్గస్థిత్యంతకారి! ఆద్య! వేదవేద్య! పరమేశ! నీకు నమస్కారము! శంకర! మృత్యుదంష్ట్రాకరాళాస్యభంగకేళీడాగతమును దేవదానవసమస్కృతమును నగు నీచరణారవిందములకుఁ బ్రణమిల్లుచున్నవాఁడను. శంకరా! సంసారభీరువులకు నీపాదపద్మయుగళప్రణతి దక్క వేఱొకయుపాయము కలదే! ఈశా! అర్థాయనమగు చిత్తమును నివర్తించుకొని జ్ఞానసంపదను బడయఁగోరువారలకు నీవు గమ్యస్థానమవు! పరమేశ్వరా! కర్మములకు నీవే కర్తవు! కర్తలను నియమించువాఁడవు! కర్మములకు సాక్షివి! కర్మములకనురూపఫలమును గలిగించువాఁడవు! సనాతన! నీవీ జగమునకుఁ గర్తయగువానికి గర్తవు; భరించువానికి భర్తవు; హాసనమొనర్చువానికి హంతవు. ఓస్వామీ! సదసత్తులను క్రియాఫలములను నిష్కపటముగాఁ దీసికొనుచున్న యంగివగు నీకర్చారూపమున భూతములందు వైషమ్యమొకింత

యేసియునులేదు. అమేయా! సర్వమును మీరియున్న నీవు సత్యస్వరూపుఁడ వని యనేక శ్రుతులచేఁ గీర్తింపఁబడుచున్నవాఁడవు; పరమపదమగునీతత్త్వమును దెలిసికొననగునా!" యని సంస్తుతించి భక్తానుగ్రహకారియగునాగిరీశునకు దివాకరుఁడు తనగాకను దెలిపెను. అంతభాస్కరునియందలి నెయ్యమున గజాననుఁడు క్షీరాబ్ధిమథించునెడ బొడమిన లింగమును జూడఁబోదమని విశ్వపతికి విన్నపము చేసెను. ఆవిఘ్నపతి విన్నవించినమీఁదఁ బార్వతి విన్నపము చేసెను; ఆపార్వతీతాత్మజ విన్నపమొసరించిన వెనుకఁ గుమారుఁడు విన్నవించెను; ఆక్రౌంచఘ్నుఁడు విన్నవించిన తర్వాత బ్రాహ్మ్యాదిసప్తమాతృగణము విన్నవించెను; ఆమాతృగణము విన్నవించినపిదప భూతవర్గము విన్నవించెను. అట్లు నిండువేడుకతోఁ గైలాసమందిరుని సమ్మతసాగరమున నుదయించి యాంధ్రభూమండలమున దక్షపురినున్న యాదివ్యలింగమును జూడఁ బోదమని ప్రేరేచుటయు నాశశికళాంకుఁడు విఘ్నేశునియందలి యనుగ్రహమునను; గౌరియందలి గారాబమునను, కుమారునియందలికూర్మిని మాతృగణమందలి మక్కువను, భూతములందలి ప్రేముడితోడను నాదిత్యునియందలి యాదరమునను ముఖ్యములోకములకుఁ బోవనుద్యమించెను. అప్పుడు హరివిరించులనుగాంచియిట్లనుః—"వీరందఱును దక్షవాటమునకుఁబోవ వేడ్కపడుచున్నవారు. ఈపద్మబాంధవుఁడును మిగుల బ్రార్థించుచున్నవాఁడు; ఆదివ్యమంగళలింగమునకుఁ జంద్రదర్శనము చేయవలసియున్నది; కాన యాంధ్రభూమికిఁబోయి యందలి విశేషములుపరికింపవలయును. ఒకచోటనే చనికట్టఁబడియుండ ఫలమేమి! వినోదార్థము దక్షవాటమునకుఁ జని యందే యిచ్చకొలఁదిఁ జరింతము. అందుచే నాభక్తుఁడగు నీభాస్కరుని ధర్మమార్జిత్యమును బొందు" నని శర్వుఁడు కైలాసగిరినగరియందలి ప్రమథులకెల్లరకును దెలియుటకు

వీథివీథికి ఘంటాటంకార సహితముగాఁ బెనఁగొనుచును జాఁటఁ గిన్నరుల బనిచెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునం
దిరువది రెండవ యధ్యాయము

---

ఇరువది మూఁడవ యధ్యాయము

— మహాదేవుఁడు కైలాసగిరినుండి దక్షారామమునకు వచ్చుట. —

వసిష్ఠుఁడు మరల మునిగణముతో నిట్లు వాక్రుచ్చెను:—

"అంతటఁ జంద్రకిరీటుని సన్నిధిని పార్వతి హస్తపద్మములను మోడిచి యిట్లు విజ్ఞాపన చేసెను:—ఓ జగద్వంద్య! దక్షవాటిక నాకు జన్మస్థానము. అందుచే నా కానగరిలీలామమ్మైఁ గల స్నేహాపేక్షముల పెంపు వచింపఁజాలను. ఓ దేవేశా! భక్తవత్సల! ఆపురమునఁ సుధామయమై యున్న భీమలింగమునందు సన్నిధానము చేయుము! ఉత్తరమునఁ గాశీనగరము మోక్షలక్ష్మికి వసతి యగులాగున దక్షిణమున దక్షవాటి భోగమోక్షరమావాస మగుఁగావుత! కాశికిఁ బోఁజాలని కుంటులు కుఱుపులు కుష్ఠరోగు లంధులు వృద్ధులు బాలురు మొదలగువారలు దక్షవాటియందే మోక్షమునందుదురుగాత! కలిదోషమున నీమేదినిమీఁదఁ గామాంధులును, గతినాత్మకులును, పాపకర్మరతులును, అజ్ఞానాంధకారావృతులును, నిర్దయాత్ములును, దుష్టచేతస్కులును నగువారలకు వారణాశియందు వలె దక్షపురమునఁ గూడ నీకృపను మోక్షము కలిగెడిని! సకలలోకములకు మోక్షమొసఁగు నీవు

ప్రీతితో సన్నిహితుఁడవై యుండ నాకుఁ బుట్టినిల్లై దక్షిణకాశియై యున్న దక్షవాటీనగరము భువనమాన్యము కాకుండునా!"యని గౌరి యర్థించెను. అంత మహేశ్వరుఁడు కైలాసశిఖరనీకాశమై పొల్చు మహావృషభమును స్మరించినంతనే వచ్చి యదియెదుటనిల్చెను.అప్పుడు గౌరీపతి గౌరితోడ నానందివాహన మెక్కి ప్రీతితో దక్షవాటీనగరము నకుఁ బ్రయాణించెను. లోకనాయకుఁ డట్లు పయనించునపుడు విబుధోత్తము లగుమాధవాదులును భృత్యసహితులై దమతమవాహనముల నారోహించి యా మహాదేవుని వెంబడించిరి; యక్షగంధర్వగీర్వాణసిద్ధవిద్యాధరాదు లెల్లరును గిటికొని చనిరి; దేవర్షులు మనోహరము లగుగద్యపద్యములను గొంతెత్తి పాడుచు నాశంకరుని వెన్నంటిరి. అంతట మిక్కుటము లగుజయారావములతోడను, వేదఘోషములతోడను, వీణాకాహళినిస్సాణఢక్కాశంఖాదిశబ్దములతోడను, గరిబృంహితములతోడను, హయహేషితములతోడను, భటార్భటులతోడను దిక్కులు పిక్కటిల్లినవి; వినాయకుఁడు హర్షమునఁ గొక్కునెక్కి మున్నాడి నడచెను; సుబ్రహ్మణ్యుఁడు మయూరము నధిరోహించి కదిసి కొలిచెను; దుర్గాభైరవవిఘ్నేశులు ప్రమథసేవితులగుచుఁ జనుదెంచిరి; మధ్యప్రదేశమున వసురుద్రాదిత్యులు నడచిరి; పార్శ్వములందుఁ గుంభోదరుఁడును నికుంభుఁడును మహాకాలుఁడును భృంగీశ్వరుఁడును నుద్ధతులై జనసమ్మర్దము నడఁచిరి. వెండికొండనుండి విసుసిక దాలుపు కడు వేడుకతో విచ్చేసినపుడు దక్షారామపురోపకంఠము దద్దయు దనరారెను. ఆ యదనున యక్షేశ్వరాదులు యక్షపంక్తిమున సంభ్రమముతో పురవీథులు నవరచేసిరి; దేవతలు ముక్తావిలాసకస్తూరహారిద్రా చూర్ణకుంకుమములతో శంఖపద్మాదిలాంఛనములు పెక్కులు పెట్టిరి. అంత పశుపతి పార్వతీసహితుఁడై మహావైభవముతోఁ గనకాబ్జమాలికా తోరణా

జ్జ్వలమై, సువర్ణదండ కలితధ్వజరాజ విరాజితమై, వివిధవిపణిరత్నకిరణ కిమ్మీరిత దిశాముఖమై, సర్వాలంకార సంపన్నమై, నానాబుధగణాన్వితమై యొప్పు దక్షారామమహాపురమునకు వేంచేసెను. ఆ యవసరమున భీమలింగమునకు గారవముతో దేవేంద్రుఁడర్పింప దక్షవాటిమునను న్న సారసాయతలోచన లగు నప్సరసలు పాణిపల్లవముల గంధపుష్పాక్షతజలములతో నొప్పారు హిరణ్మయపాత్రములను బట్టుకొని ఘలుఘల్లుఘల్లన సదాశివునెదుర్కొనిరి. ఆ చంద్రవదనలు హావభావవయో రూపవిభ్రమోల్లాస భాసురలగుచు నా యాదిమదంపతులగు పార్వతీపరమేశ్వరులకు రత్నదీపాంకురములతో నీరాజనములిడిరి. అత్తఱి భూతేశుఁడు భవానిని సరసాలాపముల సమ్మోదింపఁ జేసెను; ఆసన్నమున నున్న భద్రహేరంబతండ్వాది గణనాయకులను సమ్మానించెను; లక్ష్మీపతివాణీపతుల విన్నపములాలకించెను; దక్షిణభూభాగ భాగ్యమునను, బ్రజలయదృష్టమునను గాలండుని కరుణాకటాక్ష వీక్షణమును, గౌరీముఖచంద్రప్రసాదమును నందుఁ గాన్పించినవి. దక్షిణాపథజనులు "దక్షారామపురీమధ్యమమున నందివాహనము నెక్కి వచ్చిన నాగాభరణునిఁ గన్నారఁగంటిమి కన్నులపండువైనది" యని పరమ ప్రీతులై యిట్లువాక్రుచ్చిరి:—"ఆహా! మనభాగ్యమేమనవచ్చును! నాగేంద్రాజినవసనుఁడును, నాగేంద్రాభరణోజ్జ్వలుఁడును, నగేంద్రతనయాశ్లిష్టుఁడును నగునగాధివాసునిఁ గంటిమ" ని యమందానందమునందిరి. అంతనొకవంక మహాజనులెల్లరును గ్గివార మొనర్చుచుండ,నొకప్రక్కను హరిబ్రహ్మేంద్రాది దేవత లభ్యర్చించుచుండ దక్షవాటికాధుంలాపధమున నల్లనల్లన నడచి వచ్చి భీమేశాలయాంతరముఁ జొచ్చెను. పిమ్మట బ్రియోక్తులతోఁ బార్వతీపతి పద్మనాభుని నాదరించెను; శిరఃకంపమునఁ బద్మజుని గారవించెను; మందహాసమున మహేంద్రుని మన్నించెను; కటాక్షవీక్షణమున దేవతాగణమును గగుణించెను; ఆవి

తమునఁ గ్రమముగా నందున్న వారల నందఱ నాయుమాపతి కారుణ్యమునఁ గనుఁగొనెను. ఆచందమున గౌరీకాంతుఁడు భీమనాయకుని మందిరమధ్యమమును జొచ్చునప్పుడు పావకుఁడు ప్రదక్షిణముగఁ బ్రజ్వలించుచు హావిస్సును వహించెను: ఆశాముఖములు ప్రసన్నములయ్యెను; పవమానుఁడు శరీరులకు వీలుగ వీచెను. అంతట కొందఱ అప్సరసలు స్వర్ణరత్నసముజ్జ్వలములగు కనకకలశములతో గంగాజలములను గైకొనివచ్చి యాపార్వతీపతిపాదపద్మములను బ్రక్షాలించిరి; కొందఱు లాజాక్షతాదికల్యాణవస్తువ్రాతముతోడ నర్చించిరి; కొందఱు దేదీప్యమానమాణిక్యనీరాజనము లిడిరి; కొందఱు ధర్మమయపాత్రము నిండ బుష్పఫలములను జేకొనివచ్చి నివేదించిరి; కొందఱు మనోహరముగఁ బాడిరి; కొందఱు మంజులముగ నాడిరి; కొందఱు భక్తిని బ్రణమిల్లిరి. అప్పుడు పరమేశ్వరుఁ డుప్రవేశించునెడ భీమేశ్వరాలయము కొండవ కైలాసమున నొప్పెను. అంత నాయోగీశ్వరేశ్వరుఁడు దివ్యాంగనావిరచితవివిధోపచారములను జేకొనుచు నందివాహనమునందుండి దిగి తన భుజావలంబనమున దిగిన పార్వతీహస్తాబ్జమును గరకమలమున నవలంబించి దేవతాగురుఁ డిడిన శుభలగ్న మగు మార్గశీర్ష శుక్ల చతుర్దశియందు రోహిణీనక్షత్రమున సిద్ధయోగమునఁ బ్రాసాదపుగుమ్మమును దాఁటెను. అప్పుడు తాపసులయాశీర్వాదమహాఘోషములు నిండియుండెను; పురందరుఁడు హస్తమున వేత్రము బట్టి ముందు నడచి జనసమ్మర్దము నడఁచెను. ఆమహేశ్వరుఁడు తన్నుఁగాంచి "పూర్వమీతఁడొక తప్పుచేసినవాఁడనితలఁచునేమో" యని మన్మథుఁడు భయపడుచు మహాప్రభుని దర్శించి దక్షవాటీవనీకేళీ దీర్ఘికాఫుల్లహల్లకములును బూజించెను. అప్సరసలు ముందుకటాక్షవీక్షణపద్మములను బిదపఁ గాంభోజ ప్రసూనములను బూజించిరి. అంతనచ్చటిమనుజులెల్లరును గామక్రోధములనువిడనాడిరి; ధర్మమార్గ

మునవలంబించిరి; మోక్షోపాయైకశరణులైరి. అట్లీశానుఁ డభ్యంతర స్థలమునందుఁ బ్రవేశించి ముకుందశతానందపురందరప్రముఖు లగు సురలు సమర్పించిన మధుపర్కాద్యుపచారముల నందుకొనెను; కక్ష్యాంతరము గడచెను; గర్భమంటపము లోనికిఁ జొచ్చెను. అంతటఁ గైలాసశైలసదనుఁడు నీలకంఠుఁడు సుధాత్మకమై, సూత్మస్వరూపమై, విమలమై, స్వయంభూజ్జ్వలమై, విస్మయమై యున్న శ్రీభీమనాయక స్వామి మహాలింగమును నాగమోక్తప్రకారముగా సర్చించి యారూపమును నాపాదమస్తకము ముహూర్తమాత్రముచింతించి పార్వతియు, విష్ణుఁడును, బ్రహ్మాదులును జూచుచుండఁగనే లోకానుగ్రహతత్పరుఁడై మహోత్సాహముతో మనోహరమగు నాదాక్షారామభీమేశ మహాలింగమునందైక్యమయ్యెను. ఆసమయమునఁ ద్రిభువనములందును దివ్యలింగమహాదేవతాదాత్మ్యము స్పష్టముగా నభివర్ణింపఁబడినది. ఆద్యమై, యచ్యుతమై, యవ్యక్తమై, యజేయమై, యజమై, యవ్యయమై, యనవద్యమై, కైలాసాద్రిసమాగతమై వెలయు నామహాతేజము నంది దక్షనగరీభీమలింగమెంత యో రాజిల్లినది. అమృతాంభోధి మధ్యాంతసముద్భూతమును, ననిర్మితమును, మహాద్భుతమును జగద్భ్రమమును, భోగమోక్షప్రదాయకమును, సర్వకళ్యాణజనకమును జ్యోతిర్మయమును, స్వయంభువును, దివ్యమును నైన లింగము లక్ష్మీపతియు, బ్రహ్మేంద్రప్రముఖామరులును భక్తితోఁ బ్రతిష్ఠించి చేసిన పూజనమును గైకొనియెను. బ్రాహ్మీముఖ్యముఖ్యమాతృకలును, నందిముఖ్యగణోత్తములును, హరిబ్రహ్మాదిదేవతలును, నింద్రాదిలోకపాలురును, విశ్వేదేవులును, వసువులును, రుద్రులును, నాదిత్యులును, గిన్నరులును, విద్యాధరులును, గంధర్వులును, సిద్ధులును, సాధ్యులును, నురగులును, సూర్యాదిగ్రహములును, సకలనక్షత్రములును, దారకములును, మూర్తములును, నమూర్తములును, బితరులును నాజగ

త్ప్రభు నభిషేకించిరి; గంధపుష్పములతోడఁ బూజించిరి; ధూపమిడిరి; దీపములను జూపిరి; అభివాదన మొనర్చిరి. అట్లు వివిధోపచారములతో నర్చించునపుడు వారల కంఠములు పులకించెను; నేత్రములానందాశ్రుపరిపూరితము లయ్యెను; హర్షమునఁ గంఠములుగద్గదవచనము లయ్యెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునం దిరువది మూఁడవ యధ్యాయము.

---

## ఇరువదినాలవయధ్యాయము.

—•పతివ్రతలు భీమేశుని నుతించుట; దేవేంద్రుఁడు భీమేశ్వరున కొసఁగిన భూభాగమునకు భీమమండల మని పేరిడుట.•—

అంత గౌరి లక్ష్మి వాణి శచి యహల్య యరుంధతిలోనుగాఁగల సాధ్వీమతల్లులు ప్రాంజలులై సర్వదేవతాధీశుఁ డగుభీమేశుని సుంగల నిలచి యిట్లు కొండాడిరి:—“కరుణాయుక్తాంతరంగ! గంగాతరంగవిభూషితోత్తమాంగ! సూర్యచంద్రరథాంగ! ధరాశతాంగ! కర్పూరహారధవళాంగ! శ్రీభీమలింగ! నీకు నమస్కారము! అప్రమేయ! వర్ణనీయమతు లగుసనకసనందనసనత్కుమారసనత్సుజాతాది యోగీంద్రులు వాఙ్మానసముల కతీతమగు నీగౌరవము వర్ణింపఁజాలకుండ నపుడిఁక జడమతుల మగు మాబోంట్లెట్లు వర్ణింపఁ జాలుదురు? అతులప్రభావ! నీవు నిర్గుణుఁడవు; సగుణుఁడవు! (గుణాతీతుఁడవు, గుణాఢ్యుఁడవు) రజోగుణమున బ్రహ్మవై యీ విశ్వమునెల్ల సృజింతువు సత్వగుణమున విష్ణుఁడవై రక్షింతువు;తమోగుణమునఁ గాలాంతకుఁడ;

వై సకలమును భక్షింతువు. భవా! నిఖిలకారణ! ఎందు జంతుజాలము కాలమునకు లోనై నిదురను మేలుకువయును బడయుచున్నదో యట్టి రేయింబవళ్లను జేయు నిశాకరదివాకరుల తేజోరూపమును బూని రాత్రిందివస్వరూపుఁడవై మెలఁగుచున్నవాఁడవు. భీమేశా! పృథివ్యాపస్తేజోవాయ్వాకాశాద్యాత్మమూర్తివని యఖిలాగమపారగులు నిన్నుఁ బొగడుచున్నవారలు. అది యట్లు గాదు! నీవు సర్వాత్మకుఁడవౌటచే నిన్నట్లనఁజనునా! ఈశ్వరా! నీవు సకలభూతహృదయముల నధివసించి యున్నవాఁడవు! నీమాయచేతనే యీజంతుజాలమంతయుఁ బలుతెఱఁగులఁ బ్రేరేపింపఁబడి భ్రమించుచున్నది. తత్త్వము విమర్శింప సత్యమును నీవే సకలేంద్రియములకును బలమునిత్తువు. ఓభీమనాథా! నీకు శ్రోత్రాదులు లేకున్నను సకలేంద్రియములతోడ శబ్దాదికమును, సద్భూత మగు నర్థజాలమును గ్రహించుచున్నవాఁడవు; అపారమహిమార్ణవసాధ్యసిద్ధికై నీకెంతమాత్రము సాధనసామగ్ర్యపేక్ష లేదు. దక్షవాటాధినాథా! దేవేశ్వర! సకలభూతగుహాశయ! శక్తియుత! సకలశక్తిమద్వరిష్ఠ! పొగడఁదగిన నిన్నే మరిమరిల నమ యనుచు శ్రుతులు సంస్తుతించును. అజా! నీవు కేవలానందరాశివి; అద్వితీయుఁడవు; శుద్ధుఁడవు; బుద్ధుఁడవు; ఉపమారహితుఁడవు; ఆదినొక్కఁడవై యుండి పదపడి బహురూపముల మెఱయుచున్నవాఁడవు; అవ్విధముననున్న నిన్నల్పమతుల మగు మేమెల్లర మెట్లు గొనియాడ నేర్తుము? అభ్యాసపాటవమునఁ బ్రాణములను నింద్రియములను జయించి రాత్రిందివములు హృదయమునఁ నిన్నే నెమకుచుండెడి సంయమీంద్రులకే దుర్లభుఁడవు; బ్రహ్మాదులకే దీర్ఘకాలమగోచరుఁడవై యుంటివి. ఇఁక మావంటివారలకా గోచరించువాఁడవు! లోకైకనాయక! ప్రాణులకు దానయజనాదులను గాని,యష్టాంగయోగములను గాని చిక్కక యనన్యభక్తనే చిక్కుచున్నవాఁడవు;

ఈజగమెల్ల నీయధీనమై యున్నది; నీవో భక్తియుతుల కధీనుఁడవై యుందువు. అమంగళలక్షణములను ధరించియున్నవాఁడ వయ్యును నిన్ను శ్రుతులు శివుఁడవనియు, శివతరుఁడవనియు, నిరంతకుఁడవ నియుఁ గొనియాడుచున్నవి. ధ్యాని పఁదిగిన నీ విగ్రహమునొక్క మాత్రైనను దలఁచు జనులకనుదినమును బహుశుభములు గలుగును. అహిభూషణ! విషామృతములును సలిలానలములును నీకుఁదుల్యములే! శితకాముఁడవయ్యును గాముకుఁడవై హైమవతిని దేహార్ధమునఁ దాల్చితివి; నీ శరీమాద్భుతవర్తనము నీకే తెలియువలయును; నిన్ను ను నీ తత్త్వమును నన్యుఁడు తెలిసికొన నేరఁడు. నిర్వాణనాధ! నిజకర్మ పరాయణులును, సుజ్ఞానసన్మార్గవర్తనులు ననన్యచిత్తులును నగు సుజ నులు భక్తసిద్ధివై, యనాదిమూర్తివై, సర్వాతీతుఁడవై యున్న నిన్నే భజించుచున్నవారలు; నీకే మ్రొక్కుచున్నవారలు. సత్పురుషు లెల్లపుడును మతాంతరము లంగు విసిగి శాంతచిత్తులగుచు శంభుని మాసన్నుఁడవును, భవుఁడవునుసంతాపశాంతి కరుఁడవును, సపాపసం సారాంధకారసూర్యుఁడవును, సంతకమదాంతకుఁడవును, నగు నిన్నుఁ జింతింతురు. లోకైకపుణ్యగుణవర్ణన! మేము మందమతులమయ్యును నాత్మశుద్ధికై నీ మహిమాసాగరమును గీర్తించుచున్నారము. ఓశివ! శక్తికొలఁది నేఁపై రచించినవాగ్రచన పేలవమైనను దక్షిణమే సకల జనులను బవిత్రులను జేయుచున్నది. తపోధనప్రియ! చంద్రార్ధచూడ! చిరసంచితమగు తపోధనమున నీ దేహార్ధమును గైకొనినదియు, జగ దేకమాతయు, నీకు సతియు నగు గౌరికి నమస్కారము! అంబా! విధి ముకుందపురందరాదిబృందాకప్రకరిగినంస్తృప రారవిందా! ఇందుండిని ద్యుతివిసందకి నీలవేణీ! ఎందారుబృందవరద! గిరినందని! నీకు వంద నము! అంబ! సస్మితముఖచంద్రబింబ! బింబాధరోష్ఠ! పరిపూర్ణకృపా వలంబ! కదంబవనవాసిని! లోకమాన్య! ఫాలాంబకప్రియ! మమ్ము

రక్షింపుము ! విద్యుల్లతాంగి! శుభకారిణి ! కనకకలశప్రభాజయవిరాజ త్కుచయుగ్మ! సుఖప్రదాయిని! చంద్రకళావతంస! పర్వతరాజపుత్రి! శర్వాణి! శివా! నీకు నమస్కారము.” అని పతివ్రతలు పార్వతితోఁ గూడిన పశుపతిని నుతించిరి. పదపడి భుజంగభూషణములతో భాసిల్లు భీమేశ్వరుఁడు పార్వతీసమేతుఁడై కృపతోఁ బ్రసన్నవదనుఁడగుచు నా సాధ్వీమణులకుఁ బ్రసన్నుడయ్యెను. అంతట నమోఘదర్శనుఁడగు నా సోముఁడా సతీమతల్లులకుఁ బెక్కువరములు ప్రసాదించి దేవత లందఱును జూచుచుండ భక్తానుగ్రహతత్పరుఁడై మరల నా భీమేశ మహాలింగమునందే యంతర్ధానము నొందెను. అంత దేవేంద్రుఁడు తన దండనుండిన సకలధర్మవిదుని గురునిఁ గాంచి యిట్లనియెను:—“ఓ సకలధర్మవిధిజ్ఞ! నాకీసమయమున సకలదానములలో నుత్తమ మగు మహాదానమెద్దియో సెలవీవలయు! ఓ మహామతి! దేవతలకును బ్రాహ్మణులకును నీదఁగిన పదార్థమేదియో వివరింపవలయు!” అని దివస్పతియడుగఁగా బృహస్పతి యిట్లు వక్కాణించెను:—“ఓ దేవేంద్ర ! దానముల కెల్ల భూదానమే పరమ మతమైనది. ఎందుచేతనందు వా భువిని సదా బహుపదార్థములు ప్రభవించును. ఓ యింద్రా! సర్వార్థముల నొసఁగు భూమిని భూసురునకు దానమిచ్చినవానికి సకలదానఫలమును సంఘటిల్లును. ఇగాగులగు సం దియమున్నదియా! బంగారును వెండియు రత్నములును కంచుకములును గజతురగాదిజంతువులను, గంధము పుష్పములు పండ్లు మొదలగువా నిని వేలువేలుగ వేడుకతో నిచ్చుటకంటె సర్వార్థములనిచ్చు భూ దానము త్తమమైనదియు! వసుంధరాదాన మొసఁగిన సకలవస్తువులనిచ్చుట యే యగును; గావున వితర్కింపఁ బనియేమి? సర్వగుణోపేతమై, సస్య శాలినియై యున్న ధరిత్రిని పాత్రమున కొసఁగిన వాని కాధరణియును న్నంతదనుక సకలసౌఖ్యములు సంభవించును. కృతదక్షిణలగు నగ్నిష్టో

మొదలి బహుయజ్ఞములు చేసిన ధన్యులకలరెను, సత్యమును, నింద్రియజయమును, జ్ఞానమును, దయయు, దేవతార్చనాదిపుణ్యములును గావించినపురుషులకంటెను, పాతివ్రత్యగుణోపేత యగు వనితారత్నము కంటెను నధికసంపత్తికలిగిన కతన భూదానమొసఁగినవాఁడే పెద్దయని పెద్దలందురు. వేదవిదునకు మహీదానమిచ్చినమనుజుఁడే యనూనగోత్రుఁడు! అతఁడే ఘనుఁడు! అతఁడే సుకృతి! అతఁడే కోవిదుఁడు! అతఁడే శూరుఁడు! అతఁడే దాత! పుణ్యశాలి యగు భూదాతను మృత్యువు కబళింపదు; తపనుఁడు తపింపఁజేయఁడు; దహనుఁడు దహింపఁడు. సంగ్రామమున స్వామికార్యమునకై శత్రుశరములఁ గూలిన వీరుఁడును ప్రభావమునఁ బుడమినొసఁగిన పూరుషుని బురుడింపఁడు. బహుసస్యఫలభూమిని భూసురున కొసఁగినవాఁడు దక్కకై దుత్తరములపూర్వులకును, నై దుత్తరములపరులకును నూర్ధ్వలోకములు కలిగించును. యవలు, గోధూమములు, మినుములు, సెనగలు మొదలగునవి పండెడి పుడమిని శాడబుల కొసఁగిన పురుషునకు స్థిరమగు స్వర్గసౌఖ్యము కలుగును. ఓ సురలోకాధినాయక! భూమిప్రదాత ప్రత్యహమును సువర్ణపీఠప్రాసాదనుదానవళతురంగములతోడను, మహావాద్యసితచ్ఛత్రచామరాందోళికాధ్వజములతోడను, విద్యుల్లతాచారువధూరత్నవాసోభూషణ చందనములతోడను, ధనధాన్య ప్రజాధేనుబంధుమిత్రభటవ్రజములతోడను నెగడుచుండును. శుక్లపక్షమున దినదినము చంద్రపరిభపురాణించులీల నేటేటను బండెడి పంటవలనఁ బుణ్యసంపత్తి పూరాయించును. భూదానమిచ్చినవాఁడు పాపాత్ముఁడయ్యును సర్పము కుబుసమూడ్చినగతి నతిఘోరములగు పాతకములను బరిహరించును. మనీషులు హయమేధమొనర్చినవానికిని భూదాతకును దారతమ్యమును దలపోయరు. ఆ రెండును దుల్యధర్మములు. వాసవ! భూదాత సువర్ణకింకిణీజాలరమ్యమై, కామగమాంచితమై

దేవాప్సరోవధూబృందసంకులమై, ప్రమదావహమై యున్న దివ్య విమానమెక్కి పోయి యూర్ధ్వలోకములందు బెక్కేండ్లు నిరర్గళముగా నివసించును. ధరదానమునకు సమమగు దానమును, భూదానస్వామిని బోలు పుణ్యుఁడును నెందును లేరు. ఇందులకు సందియము వలదు. ఓపుణ్యురూతి! వేయునేల! నేను వివేచించి వివరించుచున్నవాఁడను:- భూదానమే దానము; సూనృతమే ధర్మము; అనృతమే పాతకము" అని వాచస్పతి వక్కాణింప వేల్పుతేఁడు విని భక్తితో నాచార్యునిఁ బూజించెను. అంత నింద్రుఁడాగురూపదేశమున భక్తివిశ్వాసతాత్పర్య పరిపూరిత మానసుఁడగుచు సస్యజాతముతోడను, నుద్యానవనములతోడను, దటాకములతోడను, డిగ్గియలతోడను నిండియుండిన భూమండలమును ధారాపురస్సరముగా శ్రీభీమేశ్వరున కర్పించి దానికి భీమమండలమని పేరిడెను. అద్దానిసీమావిభాగ మిట్టిదియు:- "పూర్వభాగమున మహాసాగరము; దక్షిణమున వృద్ధగౌతమి; పశ్చిమమున గౌతమీగంగ; ఉత్తరమున యోజనత్రితయపరిమితి" అని సురనాయకుఁడు శ్రీదక్షవాటికాభీమలింగమున కేకభోగముగఁ గట్టడచేసెను. సాగరముయొక్కయు, గౌతమీనదియొక్కయుఁ దీరములందున్న వృక్షరాజములతోడనుఁ దుల్యభాగాతరంగిణితోడను, గణ్వానదితోడను గూడినదియు, నానావిధములగు శ్రేష్ఠవస్తువుల సముదాయముతో నలరారునదియునగు ధరణీమండలమును ధారాపూర్వకముగా ధరణీధర వైరి సర్వలోకాధినాథునకు భీమనాథున కొసఁగెను. ఆహా! ఏమి! దాతసర్వలోకైక నాయకుఁడగు దేవనాథుఁడా! దానమునది యంబుధిగౌతములతీరమునందలి మహాభూమండలమా! ప్రతిగ్రహీత భగవానుఁడగు భీమనాథుఁడా! ఇట్టిది మేదినికి సర్వాతిశాయిని యగు సమృద్ధి కాదే? ఇప్పటిదిఁ బాకశాసనుఁడు జగత్పూజ్యుఁడగు భీమనాయకునకు భక్తితో నంగరాగభోగమునకు దానిదానసమర్పితమును, మత్తేభహ

యమాణిక్యగాణిక్య సహితమును నగు శ్రీభీమమండల మొసఁగి యం
దలి చాతుర్వర్ణ్యమును రావించి యిట్లనియెను:— "భీమమండలవా
సులారా భూజనులారా! సావధానచిత్తులయి విశ్వాసపూర్వకముగా వినుఁ
డి! నేనీ మహాక్షేత్రము నాచంద్రతారకముగా సర్వజ్ఞుఁడును నిందుమౌళి
యు బరమాత్ముఁడును శ్రీదక్షనగరీస్వామియునగు నీభీమనాథునకు ధారా
పూర్వకముగా నిచ్చితిని. కాఁబట్టి యీవసుధ నాచే నద్రికన్యాకాంతు
నకీఁ బడినదని తెలిసికొనుఁడు! మీరిఁక బిడ్డబిడ్డతరము భోగిభూషణుఁ
డగు శ్రీభీమనాథమహాప్రభు నాశ్రయించి యిందు సుఖముగా జీవింపుఁ
డి!" అని చెప్పుచు మార్గశిరమాసమున శుక్లచతుర్దశినాఁడు రోహిణీయుత
సిద్ధయోగమున సురేశ్వరుఁడు సర్వేశ్వరునకు శ్రీదక్షవాటీనగరీభీమే
శున కార్యాణవారకాంతలతో వారాసిగోత్రము లవధిగాఁగల మహీ
స్థలమొసఁగెను. అట్లొసఁగి ధర్మశాసనమిట్లు వ్రాయించెను:—"వర్త
మానమహీపాలులారా! రాఁబోవు రాజులారా! నేనొనర్చినవరమభూ
దానధర్మమును బరిత్యజింపక పాలింపుఁడి! అందుచే మీకు పుత్రపౌ
త్రాయురారోగ్యరాజ్యబంధు సమృద్ధులే కాక సకలాభీప్సితార్థములును
సిద్ధించుఁగాక!" అని శ్రీదక్షారామనగరమున బంగారుతో దేవా
లయసౌధప్రాకారవేదికలను, ద్వారగేహావళులను నిర్మించెను; వినిర్మ
లములగు దీర్ఘికలను దవ్వించెను; తోఁటలందు మందారతరువులను
నాటెను; పయస్వినులగు కామధేనువులనిచ్చెను; నానాపుష్కరిణులం
దును సిద్ధరసమును బ్రకాశింపఁజేసెను. అంత జగత్కుటుంబియగు
భీమేశుఁడు పాథోధిగోత్రమ్యేలాపగావధియగు భూమండలము నేకభోగ
ముగఁ బాలించెను. అద్ధరణీమండలమును భీమనాయకుఁడు నిరాతంక
ప్రభావముతో నేలునపుడు కుమారారామభీమేశుఁడు సమానాధిపతియ
గుచు: సంవేద్యస్థానభైరవుఁడు సమీపబాంధవుఁడగుచు, నుండుటయే
కాక నిరుగునఁ బల్వాలేశుఁడును బొరుగున మార్కండేయేశుఁడును వెలసి

యుండిరి. మఱియు నందనకు గజాననుఁడు యువరాజుగను, భార్గవీపట్ట మహిషిగను, కుమారస్వామి వాహినీవల్లభుఁడుగను నుండ సర్వలోకైకనాయకుఁడు శ్రీదక్షవాటీభీమేశ్వరుఁడు త్రిలింగధాత్రీవలయము నేకచ్ఛత్రముగా నేలెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునందిరువదినాల్గవ యధ్యాయము

---

## ఇరువదియైదవ యధ్యాయము.

—◆ భీమేశ్వరుఁడు వసంతోత్సవము ననధరించుట. ◆—

అంత వసంతుఁడు దక్షిణసాగరతీరభూమండలేశ్వరుఁడగు భోగిరాజవిభూషణునిఁ బుష్పములతోఁ బూజించెను. మఱియు సమస్త ఋతుసామంతుఁడగు నాతఁడు మాధవీవిచికిల ప్రసూన సంపదచే సౌఖ్యమొదవించుచుండెను. వనలక్ష్మికి ముత్యాలజల్లి వలె సురపొన్న మొగ్గలలరారెను. పెందోటలందుఁ జంచరీకతమోజాల వినిర్వాపణ చుంచువులగుచుఁ జాంపేయకుసుమదీపములు వెలిఁగెను. పాంథుల కుత్పాతకారి యగుధూమకేతువు కైవడి నాగకేశరము పుష్పవిరిసెను; మీఁది ధూమము వలెఁ దుమ్మెదలు వెడలినవి. చందనాచలానలములు కలశీసంభవసతీకబరీపరిశోభితములగు సలినీపుష్ప పరిమళములను గ్రహించుచును, దామ్రపర్ణీవీచికిరత్స్ఫురత్కణములను దస్కరించుచును, వనరంగలతాకాంతానర్తనాభ్యాసతత్పరులగుచును, కందర్పామంద తేజస్స్వవృద్ధికి వార్ధుషికములగుచును దక్షారామమున మెల్లమెల్లఁగా వీవఁదొడఁగెను. మహావీరుఁడగు మన్మథుఁడు దక్షవాటీనగరీనారీసుందరభ్రూలతికాసమమగు శరాసనమునఁ దద్వ

లాసవీక్షణజాలసమ్మోదబాంధవములగు సాయకములను దొడిగి జగదేకజయోద్యతుండై నిరాఘాటముగా విహరించెను. అమృతసాగరమునుండియుఁ, జంద్రమండలమునుండియు, మెఱుపులనుండియు, నగ్నిజ్వాలలనుండియుఁ, గందర్పేక్షుశరాసనములనుండియు, లక్ష్మీప్రత్యగ్రకాంతములనుండియు, గంధర్వకులమునుండియుఁ బుట్టిన జగద్వర్ణనీయసుందరాంగు లగు నప్సరోంగనలు మందారద్రుమసాంద్రము లగు దక్షవాటీపరిసరక్రీడాకానన భూములందుఁ గుసుమాసవములను గ్రోలి హిందోళి వైఖరిని గలకంఠమనోహరముగా భీమనాథమహాప్రభుని గుణోత్కర్షమును గొనియాడిరి. మధుపములు మధుపానాతిరేకమున బంభరధ్వనులు చేయసాగెను; రసాలసాలకిసలగ్రాససంపదచేఁ గషాయకంఠము లగు మదకోకిలములు మధురముగా గుబగుబమని కూయఁ దొడంగెను; శారికలకలకలములును, కీరసంతతిసూక్తులును, వనాంతరమునఁ గుసుమాపచయాసక్తిఁ బోరాడెడి విలాసినులయన్యోన్యప్రియసంభాషణములును మిక్కుటమై లోకములకు శ్రవణానందమొనర్చెనవి; క్రీడావనిమండలమునఁ బరిపక్వఫలాపీడదాడిమీక్రోడనీడగము లగుకోకములు క్రీడించినవి; తామ్రచూడము లగు నారామములు వకుళపుష్పమరందరసబిందువులతోడను, దామ్రిపల్లవములతోడను, పుష్పములతోడను, నాగసామ్రాజ్యమును సారెసారెకు ననుభవించుచుండెను; క్రమముగ ప్రసూనశ్రేణీమారుతములు గంధసారనగాయాతగంధవాహకిశోరములచేఁ బ్రిభూతములయ్యెను; లతానికుంజకింజల్కశ్రీమంజుపుష్పరజము లక్ష్మీవసనముపలె నొప్పారెను. ఆవసంతకాలము నీలాంబుదసమప్రభము లగు రోలంబనికురంబములతోడను, నాఖండలధనుర్లీలానుకారి యగు శుకపంక్తులతోడను, జంచలాజాలసౌభాగ్యరుచిరము లగు పల్లవోత్కరములతోడను, గరకాకృతిసుందరము లగు పత్రప్రసూనములతోడను, సాంద్రవర్షానుకారి యగు ప్రవసన్మరు

దబిందువులతోడన. వనములందు వర్షాసందేహము కలిగింపఁజేసెను, మధువాసరము చరాచరాత్మక మగు విశ్వమును జయప్రీతహృజ్జాతోజ్జృంభణోజ్వలమైనిమజ్జింపఁజేసెను. అప్పుడు విబుధులు దక్షవాటికాంతికోద్యానమండలి వివిధపుష్పములను భీమనాథుని నభ్యర్చించిరి. అప్సరోలలనలు పుష్పమైరేయపానమదోద్రేకవిజృంభితలగుచు సాంద్రచంద్రికయందు వీథివీథిని జగన్మోహనవిగ్రహుఁ డగు భీమనాయకుని గీతవిశేషములను స్వర్ణవీణానువాదనములతోడఁ బాడిరి. కొందఱు విలాసినులు కౌనులసియాడఁ బయోధరములు వణఁకఁ గనకశ్వేతగరుత్కీరపికకేకిరథాధిరూఢులై పాణిపల్లవములఁ బసిఁడి లేతెలుకుసింగిణివిండ్లను బూని భీమనాయకునిపై విడిచిరి; కొందఱు చంచలేక్షణలు చామీకర మయోత్తుంగరథసౌధశిరోగృహమునఁ గనకపద్మకర్ణికామధ్యమమున దీపించు భీమేశ్వరమహాప్రభునిపైఁ బుష్పబాణములను వైచిరి. అంత భీమేశుఁడమోఘశాసనుఁడగుచుఁ గేళీవిహారమునకై స్వకింకరముఖమున దేవవర్యులకు నాజ్ఞవాటించెను. వారలకు నవారితముగ గంధకస్తూరికర్పూరప్రముఖము లగు సమస్తవస్తువుల నిచ్చెను. అప్పుడాపురమునందలి నిర్జరాంగనలెల్లరును జారుచిత్రాంబరములను ధరించి కాశ్మీరాంగవిలేపనము గావించుకొనిరి; ప్రదీప్తమౌక్తికమణిశ్రేణీభూషణములను గైసేసికొనిరి; నీలవేణులందుఁ గేతకీపత్రికలను గీలించుకొనిరి. అట్లామానిను లసమానవిలాసమునఁ భాసిల్లుచు సేవ్యుఁడగు భీమేశుని సేవింప వచ్చిరి. అంత హేరంబుఁడు దాక్షారామాంగనోత్తుంగస్తనద్వంద్వశిఖోపమ మగు నర్ధేభమునుధరించి వచ్చెను; పాతాళభైరవుఁడు భక్తితో భవుని భజింప వారకాంతాధరరుచ మగుజపాకుసుమమాలికను గంఠమున వైచికొని వచ్చెను; సర్వాలంకారసంపన్నుఁడు ప్రసిద్ధుఁడు నగు వీరభద్రుఁడు చంద్రగుజ్జరసమంటిన వామపాదముపై సురాసురవినిర్జిత మగు బిరుదందియఘల్లుఘల్లనఁ

బొగడలు బొండుమల్లియలు పొన్నలు పావడచొళ్ళియమున నిగిడ్చి చంద్రమౌళిసమీపమునకుఁ జేరవచ్చెను. బ్రహ్మాదిసకలదేవతలును, నింద్రాదిలోకపాలురును,నందిభృంగిమహాకాళప్రముఖులగు ప్రమథోత్తములును, యక్షరాక్షసగంధర్వసిద్ధవిద్యాధరాదులును మహావైభవసంపన్నులై సమయోచితభూషల నలంకరించుకొని వృషకేతనుఁడగు శంకరునాశ్రయించి గిరికొని యుండిరి. అంత భీమేశుఁడు ప్రీతితో నా హరిబ్రహ్మపురస్సరులను గాంచి సంపూర్ణ సౌహృదమున దాక్షారామ పురీమధ్యమమున వసంతోత్సవకేళికై భూలతాసంజ్ఞలను బురికొల్పెను. అప్పుడొక కోమలి కుంభోదరునిమీఁదఁ గుసుమరజమును జల్లెను; ఒక భామిని భృంగియాననమునఁ గర్పూరపాంసువంటించెను; ఒక వధువు వీరభద్రునిపెడఁదబొమ్మన గమ్మని గంధ మలఁదెను; ఒక భామ చతురాంగనయై కాలభైరవునిశ్రవఃపుటమునఁ బూర్ణహిమజలమును జల్లెను. ఒకకలువకంటి కుమారుని నెన్నుదుట నిశ్శంకముగా సంకుమదపంకిలము వ్రాసెను; ఒక మగువ మణికుంభమునఁ బునుఁగు నించి విఘ్నేశుని కుండబొజ్జమీఁదఁ గుమ్మరించెను; మాడమదేవియు, ఘట్టతల్లియు గోగులాంబయు నూకసతియు ద్రాక్షారామపురవీధియందు నేతులను, నూనెలను, బసుపుసీరునను, గుంకుమచందనములను భూతతతితోఁ గౌతుకమునఁ గేళిసల్పిరి; మాళవీదేవి భద్రకాళీతనూలతపై సారసౌరభమంజుల మగు హరిద్రాచూర్ణపటలి చల్లెను; కర్ణమోటి కర్ణికారాంబువుపైఁ గనకకలశీపూర్ణము లగు కస్తూరికాజలముల నించెను; పార్వతి తొలుపట్టి యగు గుజ్జువేలుపు సప్తగోదావరజలములను ముఖమునను దొండమునను బీల్చి విఱ్ఱవీఁగుచు దేవకాంతలోలములం బొదుఁగ ద్రుస్సననూఁదుచు మధూత్సవవిహారము సల్పెను; రంభోర్వశీ మేనకామంజుఘోషాదిలోత్తమ లొనుగాఁగల వేలుపుబానిసలు కడు వేడుకతోఁ గరకంఠునిపై గంధసారమును, హిమాంబువులను, సారంగ

మదకాశ్మీరకర్పూరఖండములను జల్లిరి. పద్మాలయ పద్మనాభుని మీఁదను, భారతి బ్రహ్మమీఁదను, శచి శతమఖునిమీఁదను గర్పూరగంధకస్తూరికాజలములఁ బోసిరి. సాంద్రకాశ్మీరపరాగము సంధ్యారాగము పగిది, నగురువు నిబిడాంధకారముచందమునను, వేదండశుండాగ్రకరండనముత్క్షిప్తము లగు సప్తగోదావరీజలప్రవాహాంభఃకణములు తారకలవలెను నొప్పారినవి; దేవగంధర్వకిన్నరులు విలాసిను లగు వేల్పుబోనిసెలకు సముద్రకర్పూరపటలములతోడను, సమందకుంకుమరజోబృందముతోడను గట్టిగ నొక నాత్మభవుని కీర్తిప్రతాపానలములు మూర్తము లయ్యెనో యనునట్లుండిరి; క్రీడనల్పెడి సురాంగనల యార్ద్రాంగలతలనుండి కారుచుండెడి కుసుమాంభఃప్రవాహమునను గస్తూరీకర్దమమునను పతితకర్పూరఖండములను సంధ్యారాగతమస్తారాగణపూర్ణమగునంబరముభాతి మహీతలము శోభిల్లెను. మండలీకృతపుండ్రేక్షుదండకోదండపాణులగు గుహ్యకాగ్రణులు విసిచిన కువలయాశుగములు హిమనీరఝరాంతరమున బింబితములగు నప్సరశ్చంద్రవదనావదనములను గాంచి పద్మములనుకొని మకరందరసాస్వాదనాసక్తితో వచ్చిన షట్పదములా యనునట్లుండెను; విద్యాధరకరోత్క్షిప్తమగుకస్తూరికారజోరాజి నీలాంబువాహపటలీలీలను వహించిన విధమున శోభిల్లెను; క్రీడాచపలు లగునప్సరఃకామినీవర్గము నీలాంబువాహపటలిమధ్యమునందలిచంచలాజాలవిలాసమును వహించినది; యక్షాంగనాగ్విన యక్షకర్దమపూర్ణకరండములు సంఘట్టనస్వనములు గర్జితఘోషణము లయ్యెను. అప్సరస్త్రీలపైఁ బ్రమథోత్తములు హిరణ్మయకుంభములతోఁ బోసిన హిమజలము ధారావర్షసంపదను వహించెను; బృందారకాంగనాబృందము చల్లిన కర్పూరశకలావళి కరకాశ్రేణివలె విలసిల్లెను. ఇవ్విధముగ జగత్ప్రియతమ మగు వసంతసమయోత్సవమును శ్రీభీమనాయకదేవుఁ డవధరించెను. అంత నచ్యుతవిరించ్యాది దేవ

గణముఖ మాతృకలను సర్వసత్కారములచేఁ దనిపి సుధామయుఁడు, స్వయంభూతజ్యోతిర్లింగతనువుఁ డగు చిందుమౌళి శక్తియుక్తుఁడై మహానందము నందెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమునందు "వసంతోత్సవము"ను నిరువదియైదవ యధ్యాయము.

---

## ఇరువదియారవ యధ్యాయము

అంత నచ్చట దివ్యర్షులు భీమనాథుని సప్తగోదావరజలముల నభిషేకించి పూజించిరి. అట్లు విశ్వస్తుత్యుఁ డగు నా మహాదేవు నర్చించిన పిదప నాతపస్వు లంజలిపుటములు గీలించి ప్రత్యేకముగా నిట్లు ప్రస్తుతించిరి:—"దక్షవాటనాథ! శివ! అవ్యయ! వేయి మోములతో వెలిగెడి యాదిశేషుఁడే నిను వర్ణింపనేరకున్నపు డేకవక్త్రుఁడ నగు నేను నిన్నెట్లు వర్ణింపఁగలుగుదును? ఫణిరాజహార! నక్షత్రములను లెక్కింపవచ్చును; ధరణిపరాగము నెన్నవచ్చును; వర్షధారలను గణింపవచ్చును; కాని నీమహిమాసాగరమందలి గుణరత్నరాసులు లెక్కింపనగునా! ఓజగదీశ్వర! పార్వతి యొనర్చిన పరమతపమునకు మూల్యమును జేకొని యర్ధశరీర మొసఁగిన నిన్ను నిత్యము హృదయమున సంస్మరించుచున్నాఁడను. శిరమునఁ జటలేఖను గిరీటమున నిత్యభాసుర మల్లికావిలాస మగు చంద్రకళను గిరీటమున వహించిన యీశునిఁ గీర్తించెదను. భువనరచనగర్వధూర్వహుఁ డగు పద్మభవుని ముఖమును పద్మమువగిది నిశితనఖముఖమున గిల్లిన యసమానాధిక ప్రభు నాశ్రయించెను. మృదులతరశరప్రయోగమున లోకములను క్షోభింపఁజేసి వశపఱచుకొనిన మన్మథునిఁ జూడ్కిచేతనే భస్మముగావించిన నిటలాక్షునకు

నమస్కారము! నిఖిలలోకవినాశహేతు వగు ప్రబలహాలాహాలకీలము భక్షించి జగద్రక్షణ సామర్థ్యముగలవాఁడ వనిపించుకొనిన కస్తూరీ వినీలగళునిఁ బ్రస్తుతించెదను. ముల్లోకములకు వెఱపుగొలుపుచు నాశ నమున నెలకొన్న త్రిపురాసురులను ద్రెళ్లునకగ్నియై వెలయు విష్ణుబాణ మును సంధింపఁదగినయతులచాపమును ధరించినశివునాశ్రయింతును. శమదమాదులచే విమలాత్మకు లగు వారలమానసస్థానమున స్థిరతర భాసురదీపికయై, శివాసహాయుఁడై, వినయనిధియై, యాశ్రితసేవధియై యున్న వానిని బ్రత్యహమును బ్రణమిల్లెదను. ఒక్కఁడయ్యును భిన్న మూర్తియై గుణభేదములచే నీజగమును సృజించును; రక్షించును; నాశ మొనర్చును. అట్టి యజరుని, నక్షరునిఁ, బురాణుని, గిరిశరణుని శరణు చొచ్చెదను. అమరకిరీటకోటిస్ఫుటమణిదామ సమావృతాంఘ్రిపీఠుఁడై కమలసఖసహస్రకోటి భాసుఁడై, భ్రుకుటిముఖుఁడై యున్న భర్గుని హృదయమున భావింతును. విష్ణునేత్రపద్మపూజావిధిపరిశోభితపాద పల్లవుఁడై, యవనీరథుఁడై, బుధనుతుఁడై, నిజకథాకథన విధూతభవుఁ డై యున్న భవుని భజింతును. అఖిలభూతహృదయ నివాసుఁడును, సకలచరాచర రూపుఁడును, నద్వితీయుఁడును, బరమపురుషుఁడును, నాగమాంతవేద్యుఁడును, బశుపతియు నగు నభవుని నాయాత్మమునఁ జింతింతును. పార్వతీలతయు, జటాపల్లవములును, గంగాజలకణపుష్ప ములును, గంగప్రభామధుకరములును గల యీశకల్పభూజము ననిశ మభీష్టఫలసిద్ధికై సమన్కరింతును. అమ్మాతనుఖకరుఁడై, దయానముద్రుఁ డై, యిందుకుందచందనచారు గాత్రుఁడై, శమనమదహరుఁడై, మహానుభావుఁడై, యున్న మహేశునియందు నామనమెల్లప్పుడును రమించుచుండుఁగాత! మందహాసభాసురముఖారవిందుఁడును, బ్రచుర సుధాలహరీకృపావలోకుఁడును, నభయావరప్రదాన లీలాచతురకరుఁ డును నగు శంకరునిపై నామతి సతతముండుఁగాక! వ్యాఘ్రాజినల

సత్కాటిరైయై, దురితతమఃసహస్ర భానుఁడై, భజనరతజనప్రియుఁడై, కుజనవిదూరతరుఁడై యున్న హరునిపై ననవరతము మాయిచ్చ వర్తించుఁగాత! స్వచరణశరణార్తలోక రక్షాభరణ! గుణాభరణ! అద్భుతప్రభావ! సూర్యశశికృశానునేత్ర! తరుణసుధాంసువతంస! శంభూ నీకు నమస్కారము. మదయుతగజజలంధరాంధకాది రాక్షసవిదారణ ప్రవీణ! పరశుడమరుపాశశూలహస్త! ప్రమథపతీ! భగవానుఁడా! నీకు నమస్కారము వృషభపరికృధాశ్వ విశ్వమూర్తి! శుభకర! శాశ్వత విశ్వవిశ్వనాథ! విషధర! జితకామ! కాలవైరి! వేదాంతవేద్య! మహాత్మ! నీకు నమస్కారము. జగదధిక! మహానట! ఆదిమూర్తి! సకల ఫలప్రద! శర్వ! సర్వసాక్షీ! అపరిమితబ్రహ్మాండపిచండిల! రుద్ర! నీకు నమస్కారము. ప్రణవసదన! చిన్మయ! అగ్రగణ్య! ప్రణతసుహృత్తమ! దేవతాధినాథ! విమలచరిత! భీమ! సర్వవంద్య! ప్రశమితదోష! మహాప్రభూ! నీకు నమస్కారము. క్షితిజలవాయుతవాహాశీతధాను! గ్రహపతి! మారుతపుష్కలాత్మమూర్తి! ప్రణవగుణ! మహేశ్వర! ఆర్యావర్యస్తుత! బల! భూతపతీ! నీకు నమస్కారము. పార్వతీకుచాగ్ర భాసురచందనాంచితోరస్క! భువనశరణ్య! కృపాళు! శ్రితహిత! రక్షపురీశ! భీమనాథ! రక్షింపుము! సగుణ! వినుత! సాంబ! శర్వ! దేవవ్రజనుత! దక్షిణకాశికానివాసి! సకల జనక! అమలసుధామయదివ్యలింగమూర్తి! ప్రపన్నుఁడ నగు నన్ను రక్షింపుము!” అని మునిపతులును, నరుంధతీసాధ్వియు, బ్రహ్మపశుసఖచండికావరిచారికా సమూహమును శివునిబహుప్రకారముల నుతులొనర్చియుఁ బూజించియుఁ గృతకృత్యులైరి. ఈ సప్తమునిస్తోత్రము పఠించువారలకును వినువారలకును, వ్రాయువారలకును, వర్ణించువారలకును భీమేశుఁ డభీష్టము సిద్ధింపఁజేయును.” అని వసిష్ఠుఁడు భీమేశమాహాత్మ్యమును జెప్పఁగా మంకణుఁడు విని ప్రీతుఁడై క్రమ్మఱ శివభక్తిని-

గూర్చి విననెంచి యిట్లనియెను:—“వసిష్ఠ! సంయమిశ్రేష్ఠ! వాగ్వి ద్వర! మనీషులు స్తోత్రమొనర్చెడి శివభక్తిమాహాత్మ్యమును విని పింపుము!” అనుటయు నావసిష్ఠుఁ డిట్లు పేర్కొన మొదలిడియెను:- “మర్త్యుని మనస్సు శివభక్తిప్రపూరిత మగు నెడల నిష్టార్థసిద్ధికై కల్పవృక్ష కదంబక మేల? కామధేనుశతం బేల? ఓ మునిగణ! “శంభు పాదపద్మభక్తులకుఁ బ్రణాశము లేదు; భవభక్తిపూరితమానసులకు గల్మషములు కదియవు” అని యాదిని భక్తాధీనుఁ డగు బాలచం ద్రావతంసుఁడు నిజభక్తజనులకుఁ బ్రతిజ్ఞచేసి చెప్పెను. భోగీంద్ర భూషణుఁడై, శాంతుఁడై, భస్మోద్ధూళితవిగ్రహుఁడై, శుద్ధస్ఫటిక సంకాశుఁడై, తటిత్పింగ జటాధరుఁడై, శూలాయుధస్ఫురత్కరాగ్రుఁడై, కస్తూరీనీలకంధరుఁడై, గజచర్మపరీధానుఁడై, తాండవాడంబరోజ్జ్వ లుఁడై, హరిబ్రహ్మమహేంద్రాదిగీర్వాణాభినందితుఁడై, యాకాశసిం ధుకల్లోలమాలికాచారుమస్తకుఁడై, యశేషభువనత్రాణజాగరూకే క్షణుఁడై, శుభుఁడై యున్న మహాదేవుని సాకారునిగాఁ గాని, నిరా కారునిగాఁ గాని, యెంచి వివిధోపచారముల నర్చించువారలు శివ భక్తులు. శివద్రవ్యమును లయింపఁజేయఁజూచినను, శివధనమును హరింపనెంచినను, శివభక్తిద్రోహుని శివభక్తివిదులు చెప్పెదరు. శివునికై యాచించి తెచ్చిన ద్రవ్యము నందసుమంతయేనియు ముట్టు కొనక శివార్చనముచేయువాఁ డుత్తమశివభక్తుఁడు. పలుమాటలేల? ఈశ్వరునికై యర్థించి తెచ్చిన ధాన్యాదివస్తువులచేఁ బాటుసకోర్వకుండు టయే పరమశివభక్తి. నాదు భక్తజనుల ననుదినమును సమగ్రసంతో షమున సంతసింపఁజేయు ధన్యుఁడొకఁడును, భక్ష్యాన్నములను, ఫలా దులను నెప్పుడును నాకర్పింపకయే యనుభవింపని పురుషపుంగవుఁ డొకఁడును, మత్కథాగుణవర్ణనములను బ్రశంసించుపురాణములనే యవిరతము పఠించువాఁడొకఁడును; శిలలతోడనో దారువులతోడనో

మృత్తికలతోడనో యిసుకతోడనో లింగములను గల్పించి భక్తికలిగి పూజించువాఁడొకఁడును; ప్రతిదినమును బంచాక్షరమహామంత్రము జపించువాఁడొకఁడును భక్తులని భవుఁడు భక్తవిమర్శనముచేయునెడఁ జెప్పెను. ఓ భక్తైకదర్శనాసక్త! మహాతాపసపుంగవ! రాగద్వేష మత్స్యసంకులమై, కామక్రోధలోభమోహమదమాత్సర్యమహాగ్రాహ సమాకులమై, పుణ్యపాపజలమహాప్రవాహమై యున్న యీసంసార మహాసాగరమున జంతువులు కర్మచోదితములై మునుఁగుచుఁ దేలుచుఁ గొంతతడవు సుఖమును, గొంతతడవు దుఃఖమును ననుభవించుచు విషయప్రియులై వర్తించుచుందురు; కాని జడత్వమువలన నొకప్పుడును బరమేశ్వరపాదపద్మభక్తి యను నావతో నా భవసాగర పారము నందఁ జూడరు. పరలోకమునందలి యమశత్రువును, యమపీడను ననాదరించి కౌమారియగు కామార్తిఁ బడియుందురు. మఱియు ఘోరమగు కలియుగమున రాఁగా శివభక్తి కఱవగును. ఆ భవభక్తి కృతయుగమున నాల్గుపాదములను, త్రేతను మూఁడు పాదములను, ద్వాపరమున రెండుపాదములను, గలియందొక పాదమును వర్తించుచుండును. కలియుగమున జనులు దుష్టమార్గములందు వర్తించుచు శివుని, శైవశాస్త్రములను, శివభక్తులను మిగుల నిందింతురు. విమూఢాత్ములగు మనుజాధములు సకలదేవతామాననీయులగు మహాత్ములను, మహానుభావసంపన్నులను, ధన్యులను, భువనపావనులను, దంభాహంకారరహితులను, సర్వభూతహితరతులను, వైదికాచారనిరతులను, భూతిరుద్రాక్షభూషితులను, పంచాక్షరీజపపరులను, మహోద్భుతదృఢవ్రతులను, శివపూజాప్రసితులను, శివధ్యానాసక్తులను, శివకీర్తనతత్పరులను, శివైకశరణులను, ధీరులను, వివిధవిషయవిముఖులను నవమానింతురు. కలియుగమున మానవులు దురాత్ములగుచు శివుని సేవింపరు; భవహరమగు శివకథల నాలింపరు;

ఒకప్పుడైనను నామరూపములచే శివుని సంస్మరింపరు; అంతవారలనజ్ఞాన మావరించును; పరమధర్మ మగు శైవాచారములను దలపెట్టరు; చాపల్యముతో నడుగక విషయములందే రమించుచుందురు. శరీరమా జరారోగాద్యనేకదోషాయతనము; జీవితమా పద్మపత్రజలకణలోలము; మదహేతువు లగు సంపదలా చపలాజాలచంచలములు; వయస్సా ఖద్యోతకీటశ్రీకరణి నష్టమగుటయే కాక యున్మాదకారణమున్నైనది; కళత్రసుతబాంధవులా యేఱనేటను గొట్టుకొనిపోవు కొయ్యలు. ఇట్లు బంధకారణములును, క్షణభంగురములును నగు వీనితో నేమి పని యని యనిత్యము లగు దేహాదు లందాదరముంపక నిత్యానందమునకై మహేశుని భజంతురు. ధర్మాధర్మముల నెఱుంగనిమూఢు లుత్తమ మగు ధర్మమునందధర్మభ్రమముకలిగి భ్రష్టులగుదురు. దురాత్మకులు ధర్మాభాసమున ధర్మభ్రాంతితోఁ బ్రవర్తింతురు. మోఱకులు చేసుత్రోవలను బట్టి నరకములఁబడి నశియుదురు. మండు వేసఁగిని నిర్జలదేశమున జలదానమొనర్చువాని చాడ్పున ధర్మసూక్ష్మ మగు. కలియుగమున ధార్మికుఁడే యుత్తముఁడగును.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున
నిరువదియాఱవయధ్యాయము.

---

## ఇరువదియేడవ యధ్యాయము

—•పరమేశ్వరుఁడు పార్వతికిఁ గలియుగమున యోగవిధానమును జెప్పుట•—

వసిష్ఠుఁడు వెండియు మంకణునితో నిట్లనియెను:—

ఒకప్పుడు సర్వలోకహితైషిణి యగు పార్వతి లోకశంకరుఁ డగు శంకరునితో నిట్లు యాచించెను:—"దేవ దేవ! లలాటాక్ష! భవ! భవభక్తి కలియుగమునఁ గానరాదు; కాన నిఖిలలోకహితముగా భక్తియోగమును నానతిమ్ము!" అని ప్రార్థింపఁగా సర్వజ్ఞుఁడు లోకానుగ్రహతత్పరుఁడై యిట్లనియెను:—"మధురభాషిణి! ప్రియా! బాగు! బాగు!! లోకహితమునకై యడుగఁ దగిన ప్రశ్నమునే యడిగితివి. జలజానన! కలియుగమున భక్తి క్రాఁగియుండును. ఓ యార్యా! కలినిఁ బాపులే కాని పుణ్యాత్ముఁ డొక్కరుఁడును గానిపింపఁడు. ఘోరమగు కలియుగమునఁ దాఁ బాపములెల్లఁ బ్రబలుచుండును. ఓ పావనా! దయా సత్యక్షమాచారములను నవి యుండవు. అత్తఱిఁ గునఁ బాపాంధకారము ప్రబలుచుండ నరులు యోగభ్రష్టులగుచు నరకకూపములఁబడి నవయుదురు. అంత సత్సమాగమమువలనను, మన్నామకథాశ్రవణమునను గలియుగమున నరులపాపములు క్షయించును. అప్పుడు జనులకు నాపై భక్తి నాటుకొనును. ఇందులకు విచారింపఁ బనిలేదు. అట్లు నాపై భక్తి నెలకొనినంతనే ధర్మము వర్ధిల్లును. నిత్యము లింగార్చనమునఁ బ్రియము పుట్టును; భూతి ధరింపఁ బుద్ధిపుట్టును; రుద్రాక్షమాలికలను వైచుకొనఁ వేడ్క జనించును. అంత సాధకులకు డెందమున సందియములు వీడును; ఆత్మమునఁ బాశుపతాచారము పదిలపడును. మృగేక్షణా! ముక్తిలత కదియే కదా మూలదుంప! అంత బ్రహ్మక్షత్రియవైశ్యులు సదాచారనిరతు లగుదురు; స్త్రీలు సత్యవ్రత

మాచరింతురు; శూద్రులు త్రైవర్ణికశుశ్రూషాపరులగుదురు; ఆమీఁద వారందఱు శైవమార్గాధికారులగుదురు. మఱియుఁ గైవల్యమునకధికారి కాఁగోరువాఁడు రాగద్వేషములను విడనాడవలయును; ప్రజ్ఞను సంపాదింపవలయును; స్థైర్య మవలంబింపవలయును. అట్టి వానికులమును వెదుకఁజనదు. అనేకజన్మసంశుద్ధుఁడైనఁ గాని యోగవిద్యాచతురుఁడు కాఁజాలఁడు. యోగసంప్రాప్తియన వాయుమార్గముచే విశుద్ధమగు మార్గమునందు సాధనముచేయుటయు నాధులను, క్రోధమును, వాయువులనుజయించుటయును,మనస్సును నిలుపుటయును నై యున్నది. ఇంద్రియములు చిత్తమునకు లోనై యుండునపు డిర్ధమార్గమునఁ జరింపఁ జాలవు. యోగమునకుయమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధులను నెనిమిదియంగములుకలవు. ఆ యష్టాంగయోగమునుప్రశంసించుగురునాథుఁ డుపదేశించినపగిది బాగుగా నభ్యసించినశుద్ధిమంతుఁడు కృతార్థుఁడై పరమభక్తితో నున్నఁగాంచును. రజ్జువును సర్పమనుకొని భ్రమించెడి పురుషున "కిది త్రాఁడు కాని పాము కాదు" అని తెల్పఁగా సర్పభ్రమ నివృత్తియౌ చందమున యోగముచే నున్నఁ తత్త్వమునఁ గాంచుచుండెడి పురుషునకంధకారమునకంటె నధికమగు నవిద్యానివృత్తియగును" అని సర్వజ్ఞుఁడు తెలిపెను. అంత నాజగద్గురునితో దేవి యిట్లనియెను:—"శంకరా! యోగమున నేమి దానికంగము లగు యమాదులెట్టివి? ఆ ప్రకారమంతయు సవిస్తరముగాఁ బలుకుఁడీ!" అనుటయు నామహాదేవుఁడు శైలతనూజ కా యోగప్రకారమిట్లు నుడువఁదొడఁగెను:—"పార్వతీ! జీవాత్మ పరమాత్మ ముల సంయోగమే యోగమని ప్రశంసింపఁబడును. దానికంగములు యమాదులు; క్రమముగా వానివిధములను సవిస్తరముగాఁ దెలిపెదను. సావధానముగా వినుము! యోగవిత్తములందొక్కొక్కదానికిఁ బలుతెఱఁగులు గలవని చెప్పుదురు.

అందలి యమమే సత్యము, దయ, క్షమ, ధృతి, మితాహార మార్జవము, బ్రహ్మచర్యమస్తేయ మహింస, యశౌచము నని పదివిధములుగా నున్నది:—పరులకార్తికలిగింపనితథ్యభాషణమే సత్యభాషణము; పరులదుఃఖాదులను సహింపమియే దయ; పరాపరాధసహనమే క్షమ; ధనబంధువియోగాదులందుండు స్థైర్యమే ధృతి; యతులెనిమిదికబళములను, వానప్రస్థులు పదునాఱు కబళములను, గృహస్థులు ముప్పదిరెండు కబళములను భక్షించుటయు, సన్యులు లఘుభోజనము చేయుటయు నేమితాహారమనంబరగును; ప్రశస్తకర్మముల నాచరించుటయందును దుష్కర్మములను వర్జించుటయందును మనోవాక్కాయకర్మముల నొక్కరీతిగనుండుటయే యార్జవము; సన్యాసులును, వానప్రస్థులును, బ్రహ్మచారులును త్రికరణశుద్ధిగా స్త్రీలను గూడకుండుటయు, గృహస్థులు ఋతుకాలమునందే భార్యతోఁ గలయుటయును, సత్సంగతియును బ్రహ్మచర్యమనుపేరఁ బరగుచున్నవి; ఎందును చౌర్యము చేయకుండుటయే యస్తేయము; వివిధ జంతుద్రోహము లేకుండుట యహింస. శౌచము బాహ్యమనియు నాభ్యంతరమనియు ద్వివిధము. మృజ్జలములచే నాచరించునది బాహ్యశౌచము: ధర్మమునను నాత్మవిద్యను నగు నది యాంతరశౌచము. ఓ ప్రియా! నియమము తపమనియు, సంతోషమనియు, నాస్తిక్యమనియు, దానమనియు, ఈశ్వరార్చనమనియు, సిద్ధాంతశ్రవణమనియు హ్రీయనియు, మతియనియు, జపమనియు, వ్రతమనియుఁ బదివిధములుగా నున్నది. అందుఁ గృచ్ఛ్రచాంద్రాయణాదులను శరీరము శోషింపఁ జేయుట తపము; దొరికినదానితోడనే డెంకము తనియుట సంతోషము నాఁబడు: పుణ్యపాపము లున్నవను బుద్ధియే యాస్తిక్యము; న్యాయముగా నార్జించినధన మర్థులకర్పణము చేయుట యే దానము; నన్ను పూజించుటయు, సర్వజంతువులను దృష్టి

సందించుటయు నీశ్వరార్చన మనఁబడును; వేదాంతశాస్త్రగ్రాహణమే సిద్ధాంతశ్రవణము; లోకమునకును వేదమునకును విదూరములగు కర్మములను జేయ లజ్జించుటయే హ్రీ; సదాచారవిధియందు శ్రద్ధతో నుండుట యే మతి; గురూపదేశించిన సన్మంత్రమునందును, వేదోక్తపఠనమునందును, శ్రుతిస్మృతీతిహాసాది వాఙ్మయమునందును, వర్తించుటయే జపము; ధర్మార్థపురుషార్థకకారణ మగు నుపవాసాదికము వ్రతము. నిర్వాణఫలహేతువు లగు నాసనాదిప్రయత్నములందు యమనియమములు గలవారలే యధికారులు. మఱియు మోక్షఫలహేతువులైన యాసనములనేకములు గలవు. అందును మిగుల నుత్తమమైనవానిలో గొన్నిటినిమాత్రమే పేర్కొనెదను. జానూర్వంతరభాగములందుఁ బాదములను నిల్పి ఋజుకాయుఁడై కూర్చుండుట యే స్వస్తికాసనమగును. దక్షిణగుల్ఫమును వామపృష్ఠపార్శ్వమున నంటును, సవ్యగుల్ఫమును బాహ్యాంతమునందును స్థాపించి యుండుటయే గోముఖాసనము. వామాంకమున దక్షిణపాదమును, సవ్యాంకమునందన్యపాదమును పృథముగా నుంచినపిదప వ్యత్యస్తముగా హస్తద్వయమును బ్రసరింపఁజేసి పాదాంగుష్ఠద్వయమును గాఁగిటఁ బట్టుకొని, పక్షములు సుస్థిరముగాఁ జుబుకాగ్రముంచి నాసాగ్రమున దృష్టినిలుపుటయే పద్మాసనము. కొందఱుపెద్దలు మఱుకవ్యత్యస్తనియమమును జెప్పరు. ఊరువులందు వెల్లకిలఁ బదద్వయమును వానియంతరమునఁ గరమును దీసికొనివచ్చి నాసాగ్రదృష్టియుంచుటయుఁ బద్మాసనమని కొందఱు చెప్పుదురు. ఆపద్మాసనవిధియందుఁ జుబుకమును హృదయమునఁ బెట్టి నాలుకను దంతమూలమునకుఁ గైకొని వచ్చి మెల్లమెల్లగా వాయువులను జయింపవలయును. దక్షిణాంకమున వామపదమును, వామాంకమున దక్షిణపదమును నంధి కూర్చుండుట యే వీరాసనము. అండాంతస్థరేఖకుపాంతమునందు గుల్ఫద్వయమును వ్యత్యాసముగా నిల్పి జానువు

లందు ఋజ్వంగుళి యగు బాహుద్వయమును బ్రసరింపఁ జేసియు వివృతాననుఁడై నాసాగ్రమున దృష్టినిల్పుటయే సింహాసనమనఁబడును. గుల్ఫములనండయుగాంతస్థరేఖా పార్శ్వము లందుఁ బ్రవర్తింపఁజేసి యత్యంతప్రయత్నమున జేతులతో నాపార్శ్వములను బట్టుకొని వర్తించుటయే భద్రాసనము. ఓ సర్వమంగళా! గుహ్యాగ్రమున సవ్యగుల్ఫమును, దానికగ్రమున దక్షిణగుల్ఫమును సుస్థిరముగా నిల్పి కూర్చుండుట యే ముక్తాసనము. ఇదెంత యో యారోగ్యమిచ్చును. దీనినే కొందఱు పండితులు సిద్ధాసనమనియు, మఱికొందఱు గుప్తాసనమనియుఁ జెప్పుదురు. కరతలద్వయమునేలపై దృఢముగా మోపి నాభిపార్శ్వద్వయాధారకూర్పర మగు శరీరమంతయు నంతరిక్షమున దండము పగిది నార్జవముగాఁ బ్రవర్తింపఁ జేయునది మయూరాసనము. ఓమతిశాలిని! ఇవి యెల్ల దేహమునకు లఘుత నిచ్చును; సకలవ్యాధులను నశింపఁజేయును; సమస్తపాపములను క్షయింపఁజేయును. ప్రాజ్ఞుఁడగు వాఁడు స్థిరతరుఁడై స్వస్తికప్రముఖాసనములను నిత్యమలవాటు చేసికొని ప్రణవసంఖ్యతోఁ బ్రయత్నపూర్వకముగాఁ బూరించి ప్రాణమును నపానముతోఁ గలుపుట యే కాక యీ ప్రాణాపానగతులను గుంభకముతో నిరోధింపవలయును. అంత రేచించుచుఁ బ్రాణముతోడ సమముగా నపానమును గలుపవలయును. ఓ పార్వతీ! ప్రాణాయామమనునదిదియే. ఓచంద్రాస్యా! దీనిని దినదినమభ్యసించెడి సాధకుఁడు వాయువును జయించును. అతని దేహమందలి సకలనాడులును శుద్ధియగును. అపానమున కగ్రభాగమునందంగుళిద్వయపరిమాణము గలిగి కృశానుధామమున్నది. దానికగ్రమున నవాంగుళమితాంతరమున నాడీకంద మొకటి కలదు. దేహమునందంతటను డెబ్బదిరెండు వేలనాడులు గలవు. అందు ముఖ్యముగా గణింపఁదగినవి నూటొక్కటియు! ఓకృశోదరీ! వానిలోను బదునాలుగు నాడులు శ్రేష్ఠ

ముఖ్యమైనవి. అందును గూడ మూఁడు నాడులు ముఖ్యములైనవి. ఆమూటిలోను నొక్కటి యే గరీయసి. పైని చెప్పిన పదునాలుగు నాడులకు సరస్వత్యాదినామములు గలవు. అవి పదునాలుగును జిహ్వాది వ్యాపారములకు హేతువులు. నాసికకు వామదక్షిణరంధ్రములందిడా పింగళములను రెండునాడులున్నవి. అవి ప్రాణాయామమునకు సాధనములు. ముఖ్యనాడి యగు సుషుమ్న బ్రహ్మరంధ్రమునందును నాడీ కందమునకు మధ్యమునను నున్నది. బ్రహ్మనాడి యని ప్రసిద్ధవడయు నదిదియే. అందు వాయువును బ్రవేశింపఁజేయుటయే యోగమనఁ బడుచున్నది. ఓ ప్రియా! ఇఁకఁ బ్రత్యాహారప్రకారమును బేర్కొని యెద నాలింపుము! ఇంద్రియార్థములను నిగ్రహించుట యొకటియును సకలేంద్రియములు ప్రవర్తించెడి యాత్మయే సర్వగతమైనదనెడి యంతశ్చింతన మొకటియును, సకలనిత్యకర్మములనాత్మయందే ప్రతిదినమాచరించుటయొకటియును, శరీరమందలి పదునెనిమిదిస్థానములందుఁ గ్రమముగా వాయువు నిల్పుట యొకటియును, బ్రత్యాహారవిశేషములు. పాదాదిజానుపర్యంతము భూమియై, యూరుమధ్యాది పాయుపర్యంతము జలమై, యానలీలాదిహృదయపద్మపర్యంతమునగ్నియై, యూర్ధ్వస్థానగాది భ్రూమధ్యపర్యంతము వాయువై, యామధ్యాది మూర్ధపర్యంతము గగనమై యున్నవి. సుమతియగువాఁడీ పంచస్థానములను వివేచించుటయే కాక క్రమముగా నాయెగింటను బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివదేవులను భావింపవలయును. ఇట్లు ప్రాణాయామపరుఁడు చలాత్మకుఁడు ప్రణవముతో ధరించుటయే ధారణమని యోగశాస్త్రవిదులు పలుకుదురు. ఓ సుశ్రోణి! సగుణమనియు నిర్గుణమనియు ధ్యానము ద్వివిధము. గంగాచంద్రఫణీంద్రాది చిహ్నములను ధరించినాశుభాకారమును జింతించుటయే సగుణధ్యానము. ఓ యీశ్వరీ! సన్నాంతునిగను, నద్వితీయునిగను, సత్యానందునిగను, చిదాత్మకునిగను, బ్రహ్మ

ముగను భావించుటయే నిర్గుణధ్యానము. ఓ పార్వతి! నాయందత్యంత నిశ్చలధ్యానసమానసలయమే యేకరూపమైన సమాధి యగు. ఓప్రియా! ఇది యే యోగవిద్యాప్రకారము. గురుకటాక్షముంచినధీమంతుఁడు యోగదక్షుఁడగును. ఓమనోరమా! గురుఁడే శివుఁడు శివుఁడేగురుఁ డను భక్తితో గురుఁడనగు నాయెడ భేదములేని శిష్యునకుఁ గృపతో సకలవరములొసఁగెదను. "నేనే గురుఁడు గురుఁడేనేన"ని నమ్ముఁడై రజోవృత్తిని బరిత్యజించిన బుద్ధిమంతుఁడు కింకరుఁడు రాజును గొల్చున విధమున గురుని భజింపవలయును. వినయవత్సలుఁడై, గురుసంసేవ నాసక్తుఁడై యున్న శిష్యుఁడు నాయనుగ్రహమునఁ బురుషార్థములను బొందును.

ఇది స్కాందపురాణమునందలి శ్రీముఖాడమునఁ
ఇరువదియేడవ యధ్యాయము.

---

## ఇరువదియెనిమిదవయధ్యాయము.

—పార్వతికి బరమేశ్వరుఁడు బ్రహ్మము నుపాసించు విధానమును దెలుపుట—

పార్వతికిఁ బరమేశ్వరుఁడు మగుడనిట్లనియెను:—"ఓసువదనా! సకలభూతములకు హితమొనరించుచు సర్వనిమ్ముఁడై ప్రవర్తించు వాఁడు నాకు భక్తుఁడు. నేనన్వహ మతనిని సంమోదింపఁ జేయుదును. మఱియుఁ బుణ్యపాపపయఃపూరమై, కాంతాదిసుఖసైకతమై, దుర్వారదుఃఖకర్దమమై, కామవీచీపరంపరమై, సంత్రాసజంతుస్తోమమై, చేతోవికారశిలోచ్చయమై, విషయాసక్తిగరళమై, దారిద్ర్యబడ

భానలమై, యపారమై, మహాఘోరమై యున్న సంసారసాగరమున మునుగుచుఁ దేలుచుఁ గడ గానరాక కలఁగఁ బాఱెడి డెందముతో నుండు వారలకు నాయడుగుదామరజోడు తెప్పయై తేల్చును. కుమ తులు కామక్రోధాది గ్రస్తులై స్వకులాచారములను త్యజించి భవసాగ రమునఁ బడుదురు. సుఖదుఃఖములతత్త్వమెఱుఁగక సుఖమును దుఃఖ ముగను, దుఃఖమును సుఖముగను దలఁచి మహాంబుధియందుఁ బడు దురు. ఓ హరిణేక్షణ! మనస్సును గామక్రోధమదలోభముల వశ మొనర్చియుఁ, గులాచారపద్ధతులను విడనాడియు నన్యాయమార్గ మును బట్టుదురు. ఆ యన్యాయవృత్తివలన భయం కర భవసాగరమున మునిఁగిపోవుదురు. అట్లు సంసారాబ్ధిలోఁ బడి భయానకము లగు నరకముల పాలగుదురు. ఆ దుర్గతులందు గ్ర యాతనలను జిరకాలమనుభవించి మరల వసుధాతలమున హీనజాతు లందు జనింతురు. ఆ నీచ జాతులందుఁ బుట్టి బహుపాపవర్తనులగుచు నధఃపాతార్హులగుదురు. అట్టి దుర్జాతులకుఁ గాని, పుణ్యాత్ములకుఁ గాని శరణాగతవత్సలుఁడ నగు నేనే శరణమగుదును. మనుజులకు మత్కథాగుణవర్ణనము శ్రేయస్కరమైనది. రాకాచంద్రనిభాననా! ఇది యెల్ల నిక్కువము" అని మహేశ్వరుఁడు పరమహితముపదేశింప మరల నాదేవి యిట్లనియెను:—"ఓశంభూ! సనకాదులు ఘోరమగు భవార్ణవమును గడచి మోక్షసంపదను బొందిన జ్ఞానమును నాకుప దేశింపుము?" అని మనోవల్లభ వేడఁగొన సర్వజ్ఞుఁడు ప్రీతుఁడై యిట్ల ను:—"ఆర్యా! శమము, దమము, ధృతి, జ్ఞానము, సర్వభూతదయ, క్షమ, తృప్తియను నివి గలవాఁడే మోక్షసుఖమునందును. ఓజలజేక్ష ణా! హర్షమను మాట కాని, విషాదమను మాట కాని లేకయే యన్య గృహమునందున్నట్లు వర్తించువాఁడు ముక్తుఁడగును. ఓతరళేక్షణ! ప్రకృతేతరమగు నా విగ్రహమును జూడశక్తుఁ డగు వాఁడు ముక్తుఁడు.

నిత్యానిత్య వివేకాఢ్యుఁడు, సకలార్థనిస్పృహుఁడు, సమాధినిష్ఠాసంప న్నుఁడు ను నగు వాఁడు ముముక్షువు. సర్వకర్మవినిర్ముక్తుఁడై సర్వ మును బ్రహ్మమే యనెడి సుదృఢజ్ఞానము గల ప్రాజ్ఞుఁడు కైవల్యము నందును. ఓమహామతీ! "తత్" పదార్థమే పరమాత్మము; "త్వమ్" పదార్థమే జీవుఁడు కాన హృదయమున వీనిరైక్యమును భావింపవల యు నని వేదసూత్రములందుఁ గలదు. పెద్దకాలమునకుఁ గన్న య నుఁగు చెలికాని నానవాలు పట్టి తెలిసికొనినట్లు విస్మృత మగు నాత్మ మును బుద్ధిచే భావింపవలయును. రజ్జువును గాంచి సర్పమనుకొనెడి భ్రమ నివర్తించినపు డిది త్రాడే యని తెలిసికొన్న చందమున వేద శాస్త్రజ్ఞానమున్నపుడు ధీరుఁ డాత్మమును దెలిసికొనును. ఓప్రియా! ఏకమై, సర్వగతమై, నిత్యమై, కూటస్థమై, దోషవర్జితమై యున్న యా త్మము భ్రాంతివశమున భిన్నము నలెఁ గాన్పించును. ఉపాధివలన ఘటాకాశమహాకాశములు భిన్నములై కాన్పించుచు నిజమునకు భిన్న ములు కానివిధమున జీవేశ్వరభేదము గాన్పించుచున్నను వాస్తవము నకు భేదములేదు. కలలోఁ గాన్పించిన పదార్థములచందమున దేహి నగు నేను లేను; ప్రాణములు లేవు; ఇంద్రియములు లేవు; మనస్సు లేదు; బుద్ధిలేదు; చిత్తములేదు; అహంకారము లేదు; భూమిలేదు; ద్రవ్యము లేదు; తేజము లేదు; వాయువు లేదు; ఆకాశము లేదు; ఇంద్రియ గోచరములు లేవు. ఈదృగ్గోచరమగునదంతయు మృషయే! ఇట్టి దానికి సాక్షియై, కేవలుఁడై యున్న శివుఁడను నేనని సమాధినిష్ఠుఁ డగు ధీమంతుఁడు బ్రహ్మకైవల్యమునందును. ఓమహాదేవి! "ఓమ్" అను నదేకాక్షరమగు పరబ్రహ్మము. ఇందు దేవవేదత్రయాదికమంతయు నంతర్భూతమై యున్నది. ప్రయత్నపూర్వకముగా సమాధినిష్ఠాపరుఁడై జీవుని నీశ్వరబుద్ధితో భజింపవలయును; అభేదముగా వర్తింపవలయును; ద్వంద్వాతీతుఁడు కావలయును; నిరాశ్రయుఁడై యుండవలయును;

గాఁడు; అతఁడే సమదర్శి; అతఁడే నిస్పృహుఁడు. ప్రజలు రాజును బూజించినట్లు దేవతలాతనిని బూజింతురు; అతని జన్మమే జన్మము; అతఁడే సకలసుకృతములు నాచరించినవాఁడు; అతఁడే దేవుఁడు. వాని యాగమనమున దేహగేహములు సంశుద్ధియగును. బ్రహ్మజ్ఞుఁడు భిక్షార్థమెవనిగృహమునకుఁ బోవునో యాతని పితరులు సంతుష్టులగుచు నాతనిని నేకవర్ణనములతోఁ బ్రశంసింతురు. అనుభవమగుదనుకను సత్త్వవీథియందుఁ బ్రవర్తించుచుఁ జిత్తముతో సంచరించువానిని వీక్షించు వారలకు వెంటనే సకలాఘములు నశించిపోవును. ఎవనియాత్మము నిత్యము చిదానందామృతాస్వాదనమున రమించునో యట్టివాని కులము పవిత్రమగును. మహీతలమునందతఁడే కృతార్థుఁడు. ఓయార్యా! శ్రద్ధ, గురుభక్తి, వాత్సల్యము మొదలగు సాధనములున్నఁ గాని వేదాంత సంగ్రహము తెలియదు. ఇది సత్యము! పలుకుమాటలేల? ఓ విమలాత్మక! దేవతాగురువిశ్వాసము గల మహాత్ములకే యీయర్థము దొరకొనును గాని యన్యులకు దొరకొనదు" అని స్వహితైషిణియుఁ బ్రేయసియు నగు గౌరికి బ్రహ్మవిజ్ఞానబోధనమును బరబ్రహ్మయగు సదాశివుఁడు చేసెనని వసిష్ఠుఁడు మంకణాదిమహామునీంద్రులకుఁ జెప్పి మరల నిట్లనియె:—ఓ మంకణమునీ! బ్రహ్మవిజ్ఞానసంపన్నులకుఁ బ్రాప్తించిన మహాసుఖము భీమేశనగరమున మృతినొందిన ప్రాణులకెల్లరకును బ్రాప్తించును. జ్ఞానాధికులకును, మూఢులకును, పుణ్యాత్ములకును, ఖలులకును తుల్యముగా మోక్షసుఖము భీమనాయకనగరిని లభించును. ఓ మంకణ! శ్రీభీమేశుని మాహాత్మ్యమును వర్ణింపఁ జతుర్ముఖునకే యలవికాకపోవు లోకమున నింకొరికెట్లలవియగును? నా శక్తికొలఁదిని శ్రీభీమేశ్వరుని మాహాత్మ్యమును వర్ణించి యీతపోధనుల కెఱుకపఱచితిని" అని వసిష్ఠమహాముని యచ్చటనే యుండి వినుచుండిన తాపసేంద్రులకును, మంకణునకును శ్రీభీమేశ్వరమాహాత్మ్యమును

జెప్పెను. మహాత్ములగు నామునివర్యులును, మంకణుండును నావసి ష్ఠసంయమీంద్రు నభినందింపఁ జేసిరి.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున
నిరువదియేనిమిదవ యధ్యాయము.

---

## ఇరువదితొమ్మిదవ యధ్యాయము

—:పరమేశ్వరుఁడు పార్వతికి దక్షారామగౌరవమును జెప్పుట:—

సూతుఁడు మరల శౌనకాదిమునులతో నిట్లను:—ఓమహర్షు లారా! సద్యోముక్తికారణ మగు దక్షవాటీమాహాత్మ్యమును మరలఁ జెప్పెద నాలింపుఁడీ! ఆదియుగమున సమస్తభువనేశ్వరియు, మహా దేవియు, బూర్ణవిజ్ఞానసంపన్నయు, భోగమోక్షవిధాయినియుఁ, గళ్యా ణియు నగు హిమశైలేంద్రతనయ కృతాంజలియై మహేశ్వరునితో నిట్లను:—“దేవదేవ! జగన్నాథ! దేవవంద్య! సదాశివ! సర్వభూత హృదావాస! నావిజ్ఞాపన మాలింపుము! సూక్ష్మ! అవ్యయ! సదా నంద! శుద్ధ! బుద్ధ! నిరామయ! జ్ఞానదానకళాసక్త! భక్తవత్సల! శంకర! నీలకంధర! సర్వజ్ఞ! కారుణ్యమయవిగ్రహా! స్వామీ! గాదిలి గలిగి నావేఁడికోలును వినుము! శర్వ! ఈశ్వర! అఘోర! వామదేవ! మహేశ్వర! వేదాంతవేద్య! విశ్వాత్మ! విశ్వకారణ! శాశ్వత! ప్రభూ! భక్తితో దండప్రణామమాచరించి లలాటమున నంజలిఘటించి నడుగు చున్నదానను. వెంటనే మోక్షఫలమిచ్చు పుణ్యక్షేత్ర మెద్ది? ఉత్త మ మగు పుణ్యస్థాన మేది? యని దేవి ప్రార్థింప భగవానుఁడు ప్రేయసి నభినందింపఁజేసి జగద్ధితార్థ మిట్లు పలికెను:—“ఓకళ్యాణి!

సద్యోముక్తిప్రదాయకమును, సద్యఃపాపౌఘహారస్థానమును, సర్వ సర్వార్థసిద్ధిదమును నగుదానిని జెప్పుచున్నాఁడను వినుము! దర్శన ముచేతనే జనులకు భోగమోక్షములను విధించువాఁడనై సుధాసాగర మధ్యమమున స్వయముగా నుదయించినవాఁడనై, సప్తర్షులచేతను, సూర్యునిచేతను బ్రతిష్ఠింపఁబడినవాఁడనై యప్సరస్త్రీకటాక్షేక్షా పాలత్వాయుతమూర్తినై యున్న నాచేత దక్షవాటీపురవరము భోగమోక్షములకుఁ బుట్టినిల్లని ప్రకాశింపఁ జేయఁబడినది. కృతయు గమున మునులు శంసితవ్రతులై త్రికాలవిహితస్నానము లాచరించు చును, భస్మోద్ధూళితవిగ్రహులగుచును, రుద్రాక్షమాలాభరణులగు చును, జటావల్కలధారులగుచును, శంభులింగార్చనాపరులగుచును, చిరకాలము ఘోరతప మాచరించిరి. ఆ మహాతపమునకు మెచ్చి భక్తవత్సలుఁడును, మంకణానల్పసంకల్పకల్పవృక్షమును, నహీకంక ణుఁడును నగు దక్షవాటీపురాధ్యక్షుఁడు వారలకుఁ బ్రసన్నుఁడయ్యె ను. అట్లు దక్షవాటి కాధ్యక్షుని సాక్షాత్కారము వీక్షించి మహర్షులు హర్షోత్కర్షమున దండములు వలె భూమిపై సాగిలఁ బడి మ్రొక్కి యంజలిపుటములు గీలించి నుతించి యిట్లు వేఁడి కొనిరి:—"ఓ సదాశివ! మహాదేవ! విరూపాక్ష! జగద్గురు! వందా రులోకసుందార! పరమానంద! శంకర! మహాప్రభూ! కృపతో దక్షవాటీపురమునకు వరమిమ్ము! ఓ దేవ! నీ పాదాంబుజమునకు వందన మాచరించెదము! సద్యోభోగశ్రీయును, సద్యఃకైవల్యసంపదయు విద్యయు, నవిద్యానాశమును, దక్షవాటికకుఁ గలిగింపుము!" అని ప్రార్థింపఁగా నాసమయమున భక్తవత్సలుఁడు భీమేశుఁడు విశుద్ధు లును నూర్ధ్వరేతసులును నగు నామునిశ్రేష్ఠులతో లోకహితమునకై యిట్లనియెను:—"ఓ తపోధనులారా! దక్షవాటికకు వరమొసఁగితిని, వెండికొండపైఁ గలవేడ్కను విడిచితిని; మేరుమందిరముపైఁ గల

మెచ్చను వదలితిని; మొదలి మాయకు నారామమై, సమస్తగుణభాసురమై యున్న దక్షనగరమునందు సతతము వసింతును. అగ్రజుఁడైనను, నంత్యజుఁడైనను, బురుషుఁడైనను, బాలఁతియైనను, బతితుఁడైనను, మూఁఢుఁడైనను, ధనవంతుఁడైనను, ధనహీనుఁడైనను, బలవంతుఁడైనను, బలహీనుఁడైనను, బ్రాయంపువాఁడైనను, బంగువైనను, నాస్తికుఁడైనను, గామియైనను, నిస్పృహుఁడైనను, మశకమైనను, గుంజరమైనను, ఖరమైనను, సూకరమైనను, గీటమైనను, బకమైనను, గ్రిమియైనను, వృక్షమైనను, దృణమైనను, దేహాంతమునఁ గైవల్యసుఖసంపద నందును. పూర్వభాగమున సాగరమును, దక్షిణమున వృద్ధగౌతమియుఁ, బశ్చిమమున గౌతమీగంగయు, నుత్తరమునఁ దుల్యభాగయుఁ గల యీ భీమమండలము భుక్తిముక్తిఫలప్రదమైనది. ఈ పుణ్యభూమండలమును గనుఁగొనినంతనే శుష్కకాష్ఠము వహ్నిసంయోగమున దహించినటుల మహాఘోర మగు మర్త్యులపాపబృందము నశించును. అందు దేవదేవుఁడు సకలశరీరులకుఁ బ్రాణప్రయాణవేళ చెవిలోఁ దారకబ్రహ్మవిద్య నుపదేశించును. పిడికెడు ధాన్యమైనను, స్వల్పధనమైనను నొసఁగిన దాతకనంతఫలము లభించును. శ్రద్ధతో శివయోగికి భోజనము పెట్టినవాఁడును, వస్త్రమిచ్చినవాఁడును భవబంధమునుండి ముక్తుఁడగును. దక్షవాటమున జపహోమదాన తపోధ్యానసమాధియోగములు గలిగినపుణ్యులకగణ్యఫలము కలుగును. హిమవత్పర్వతమునఁ గోటిసంవత్సరములు తపమాచరించిన ఫలము దక్షవాటమునందు ఘటికార్ధోపవాసమాత్రమునఁ గలుగును. కాశియందుఁ గోటిబ్రాహ్మణులకు భోజమిడిన ఫలము దక్షవాటికాక్షేత్రమున బిచ్చము పెట్టినంతమాత్రముచే సిద్ధించును. గ్రహణకాలమునందుఁ గురుక్షేత్రమునఁదులాపురుష దానమువలనఁ గలుగుఫలము దక్షవాటియందు భోజనము పెట్టినంతమాత్రముచే

సంభవించును; దేవేశుఁడ నగు నే నిందు భీమనాథుఁడనై యుండిన కతన దక్షిణానందవనవాటి యగు దక్షవాటి తీర్థోత్తమమయ్యెను. ఇందు శివగంగయు రుద్రగంగయు ననురెండు తీర్థములున్నవి. అందు మొదటిది పాపములనెల్లఁ బాఱఁదోలును; రెండవది పితరులను దనివి నందించును." అని వరములొసఁగి యా సంయమిీంద్రుల యెట్టయెదుట నే యంతర్ధానము నందితిని; అంత నాతాపసపుంగవులు దిక్కులు పిక్కటిల్లునట్లుగా "ఓన్నమశ శివాయ"యని పఠించిరి. వారుపంచాక్షరీమహామంత్రపారాయణ పరాయణులై యిట్లునుతించిరి. "దేవదేవ! అంబికానాథ! భక్తవత్సల! నీ వెచ్చటికేగితివి? నీవరిగిన తెలియఁగాలియఁగ కున్నారము. ఎచ్చటికిని విచ్చేయక నిరంతమిచ్చటనే యుండుము!"అని వారలు ప్రార్థింప నామహాదేవుఁ డట్లే యని పలికి యా ఋషులు చూచుచుండఁగనే మెఱుపుమెఱచిన తెఱఁగున భీమలింగమునఁ జొచ్చితిని. అందుచే వారలు విస్మయాక్రాంతచేతస్కులగుచు మిగులనంతసించిరి! ఓగౌరి! ఇది భీమలింగపుగౌరవము. ఇఁక దక్షవాటీవరపురీమాహాత్మ్యమును వినుము! అంత నా సంయమిశ్రేష్ఠులు భక్తిశ్రద్ధాయుక్తులై కు సప్తర్షిప్రవర్తనిత మగు సప్తగోదావరమును గాంచి యిట్లు నుతించిరి:— "శంభుజటాజూటనివాసిని! దేవి! శివప్రియ! నీవు లోకరక్షణకార్యార్థముద్భూతమైనదానవు; నీకు నమస్కారము. ఓగోదావరి! ఏకస్వరూపముతోడనే భీమనాథుని సన్నిధియందు సదా సన్నిహితయై యున్నదానవు. నీకు మ్రొక్కెదము!" అని శంసితవ్రతులగు నా మును లెల్లరును వికచకనకకమలబృందపరిమళతుందిలములును, లోకపావనములును నగునాపుణ్యతరంగిణీజలముల నఘమర్షణస్నానమాచరించిరి. నిందువేడుకతో నిండి లోకపావనియగు నీసప్తసింధువనవరతము నొక ప్రవాహమున శ్రీభీమనాయకుని సేవించుచున్నది. ఆ పరప్రవాహము హంసగామినియుఁ బాతాళగామియునై సాగరము

తో బొంగమించుచున్నది. శ్రీభీమలింగసన్నిధియందు గభీరతరజలపూర మగ్నమగు సప్తగోదావరతీర్థమెల్లప్పుడును రాజిల్లుచుండును. ఓప్రియా! ఉత్తమమగు నా తీర్థరాజము శ్రాంతవేగమున వారిధిని గలయుచున్నది. ఓశాతోదరి! నిస్పృహుండును నిరహంకారుండునగు శివయోగిశిఖామణి సప్తగోదావరమున జలకమాడి భీమనాథమహాప్రభునిసముజ్జ్వల శూలాగ్రభాగసౌవర్ణకుంభములనుగాంచి జిహ్వతో షడక్షరమంత్రమును జపించిన ఘోరతరాపారసంసారసాగరమున మునుంగుచుండడు గదా! నీవును నేనును బుత్రులును బ్రమథకోటులును నారాయణుండును, బ్రహ్మయు, దినపతియు, నిశానాథుండును, దేవేంద్రాదిలోకపాలురును, దేవవిద్యాధరాదు లందఱును గలసి సర్వలోకసంసేవ్యుండై, భద్రదాయకుండై, సాంద్రవైభవుండై, యున్న శ్రీదక్షవాటీనగరనాయకుని మహాశ్రేయమునకై భజింతము. ఓభద్రే భామిని! సప్తగోదావరతీరవాసుండును, సప్తసప్తిప్రతిష్ఠితుండును, సకలలోకరక్షకుండును, దీప్తపావనవిగ్రహుండును, భజనీయుండును, భవదూరుండును, భక్తాభీష్టఫలప్రదుండును నగు భీమనాథుని భజింపుము! భీమనాథమహాస్థానము సర్వకామార్థసాధనము. అదియొక సంవత్సర పర్యంతమున సద్యోముక్తి నొసంగును. సూర్యుండు మేషరాశియందు శ్రవణనక్షత్రముతో నుండు చైత్రమాసమున సప్తగోదావరములో స్నానమాచరించియు శక్తికొలంది ధనము బ్రాహ్మణుల కొసంగియు భక్తితో భీమనాయకుండ నగు నాకుం బ్రదక్షిణనమస్కారాదులాచరించియు, రాత్రిభుజింపవలయును; అట్లే రవి వృషభరాశిని విశాఖానక్షత్రమునాశ్రయించి యున్న వైశాఖమునను, దివాకరుండు మిథునమునందు మూలానక్షత్రమునను, భానుండు కర్కాటకమున భగదైవత్యమైన నక్షత్రమున వసించియుండంగను, విభాకరుండు సింహరాశియందు వైష్ణవనక్షత్రమునం దుండంగను, సర్యముండు కన్యారాశి

యందుఁ బూర్వాభాద్రానక్షత్రమున నుండఁగను, ద్వాదశాత్మ తుల యందు దస్రదైవతనక్షత్రమున నుండఁగను, సహస్రాంశువు వృశ్చికమునఁ గృత్తికయం దుండఁగను, జలదకరుఁడు ధనూరాశియందు రుద్రదైవతనక్షత్రమున నుండఁగను, గ్రహపతి మకరమునఁ బుష్యమీనక్షత్రమునందుండఁగను, జిత్రభానుఁడు కుంభరాసియందు మఖానక్షత్రమునం దుండఁగను, లోకభాంధవుఁడు మీనరాశియందు ఫల్గునీనక్షత్రమునందుండఁగను సప్తగోదావరస్నానమును, యథాశక్తి ధనదానమును, శ్రీభీమనాయకదర్శనమును, రాత్రిభోజనముఁగ నియమాన్వితుఁడై భక్తితో సంవత్సరవ్రతమాచరింపవలయును. ఈయుత్తమవ్రతమూచరించిన స్వర్గార్థికి స్వర్గమును, ధనార్థికి ధనముఁగ, మోక్షార్థికి మోక్షమును లభించును. ఓకల్యాణి! నాకుఁ బ్రియస్థానమగు నీక్షేత్రమునందెందైనను మృతినొందిన మానవుఁడు కైవల్యసంపద నందును. ఓమృగేక్షణా! నాక్షారామపురోత్తమమునకగి సప్తగోదావర తీరమున నొకింత స్వర్ణదానము కావించినను మేరుదాన మిచ్చినట్లగును. సర్వమంగళా! భోగమోక్షనివాసభూమి యగు నక్షవాటీమహాపురమున మనెడి మనుజులొనర్చెడు స్వాభావిక కర్మమెల్లను మత్సేవానియమవ్రతమే! వారి పలుకులెల్లఁ బంచాక్షరజపమే. నక్షారామమాహాత్మ్య మవాఙ్మానసగోచరము. ఓమనోరమా! భీమనాయకమహాదేవదివ్యశ్రీపాదపద్మసేవచే మర్త్యుఁడు మహోగ్రపాపకర్ముఁడయ్యును మహైశ్వర్యమోక్షసామ్రాజ్యపదవిగాంచును. మహాదేవి!సమస్తశాస్త్రసిద్ధాంతమతాంతర సుసమ్మతమైన యీక్షేత్రము సద్యోముక్తిప్రదాయకమై సద్యస్సుజ్ఞానసదనమై, సద్యస్సర్వార్థసిద్ధిదమై యున్నది. ఓ యీశ్వరి! శ్రీదాక్షారామనగరముత్తమతీర్థము. నీవు మిగుల బ్రార్థించుటవలన నీయర్థము నీకుఁ జెప్పితిని. దీనిని జిత్తమున నవధానము చేయుము!" అని సర్వజ్ఞుఁడైన హృద

యేశుఁడు పలుక హైమవతి మగనికి మ్రొక్కి హర్షోత్కర్షమునందెను. ఓమునీంద్రులారా! ఈ పరమరహస్యమును నేను నాదు గురుముఖమున వింటిని; బ్రహ్మవాదు లగు మీకు వాక్రుచ్చితిని. ఓమనీషులారా! శ్రీదక్షనగరీస్థానము సద్యోముక్తి ప్రదాయక మని మహేశుఁ డాన తిచ్చెను. ఇది వేదార్థము! సద్యోముక్తి గోరు నరుఁడు దక్షపురము నకే చనవలయును. అన్యతీర్థములకుఁ బోవుట కాలము గడుపుట కై పుష్పవనమునకుఁ జనునట్టిది యే యగును.

ఇది శ్రీస్కాందపురాణమునందలి భీమఖండమునం

దిరువదితొమ్మిదవ యధ్యాయము:

---

## ముప్పదవ యధ్యాయము

—సూతుఁడు శౌనకాదిమునులకు దక్షారామమాహాత్మ్యమును జెప్పుట—

శ్రీసూతుఁడు శౌనకాదిమునులకు మరల నిట్లనియెను:—"ఓ మహాత్ములారా! మరల ఘోరకల్మషనాశనమును శుభకారణమును నగు భీమలింగమాహాత్మ్యమును వినుఁడి! బ్రహ్మవిష్ణుపురందర ప్రము ఖులకుఁ గల్పకోటిశతముల నైనను వర్ణింప నలవికానిది. అట్లయ్యును సర్వదేవగణప్రభుఁ డగు భీమనాథుని మాహాత్మ్యము నాబుద్ధికి గో చరించినంతవట్టు వచించెదను. దక్షుఁడు మేషశిరమును ధరించినపు డును, జాంపేయకళికపగిది వాణీవధూనాసిక ఖండింపఁబడినపుడును, బూషార్కుని వదనము బోసివోయినపుడును, విష్ణుచక్రము విఱిగినపు డును, హవ్యవాహనుని నాల్కలేడును విచ్ఛిన్నములైనపుడును, జం ద్రుని యురమునఁ దాడనము తగిలినపుడును, యాగమృగశిరము చెం డాడినపుడును, క్షణములోఁ బ్రాగ్వంశప్రదేశమెల్ల భస్మము గావింపఁ

బడినప్పుడును,మునులును దేవదానవులునుసిద్ధ గంధర్వయక్షసాధ్య సిద్ధా మానవులును మహాభయాక్రాంతులగుచు శరణాగతవత్సలుఁ డగు భీమేశుని శరణు చొచ్చి యంజలులు ఘటించి యిట్లభ్యర్థించిరి:—“భీమేశ! శరణు! శంకర! శరణు! సర్వజ్ఞ! శరణు! శివ! శరణు! క్షీరాబ్ధి మధ్యసంభూతవిషభూషణకంధర ! విష్ణుబాణమునఁ త్రిపురములను ధ్వంసముచేసినవాఁడా! శరణు! శరణు! జలంధరాంధక వ్యాఘ్రసింధు రాసురసంహార! కల్పాంతసంధ్యావసరస్ఫురత్తాండవతత్పర ! శరణు! శరణు! గౌరీకుచపరీరంభ కేళీసుఖపశంవద! అశేషభువనాశ్రాంత సంరక్షణ విచక్షణ! శరణు! శరణు! దక్షిణాబ్ధితటభూమండలేశ్వర శ్రీదక్షవాటీనగరీమహాక్షేత్రనివాసి! శరణు! శరణు ! వృషకేతన ! విశ్వేశస్వామి! భీమేశ్వర! సమస్తదేవతాధ్యక్ష! శరణాగతులమగుమమ్ము లను రక్షింపుము!విశ్వసర్గస్థితిధ్వంసలీలాకౌశలధూర్వహా!సంసారాంభోధి తరణక్రియాహేతుపదపల్లవ! భుజంగరాజకేయూరచంద్రశేఖాశిఖామణి! పరమాత్మక!భీమేశ!మేమునీకింకరులము.రక్షింపుము!రక్షింపుము! ఆకా శగంగాకల్లోలజాలకాంతజటాధర!అపారమహిమోదార!కృపామృతసా గర!శరణు! శరణు! లోకైకవిస్మయకరప్రభాత్మ! భక్తపాలక!స్మరహార! మేమొనర్చిన యపరాధకోటులను దలఁపెట్టకుము!ప్రణతార్తిప్రాణికోటి పరిత్రాణపరాయణ! సూర్యచంద్రాగ్నిలోచన! శరణు! శరణు! ప్రేయసీ చారువామాంగప్రకాశమయవిగ్రహా! ప్రసన్నలోకవరద! పరమేశ్వర! ప్రసన్నమగుము!” అని స్తోత్ర మొనర్చినవారలనెల్లరను సర్వపాలకుఁడును దీనబంధువును నగుభీమేశ్వరుఁడు ప్రసన్నుఁడై కృపాపూర్ణచక్షువులతో వీక్షించియు, మందహాసముఖపద్మవికాసాతిశయమున నానందపఱచి యు నిట్లనియెను:—“వత్సలారా! ప్రణతవశంవదుఁడ నగు నేను సుప్ర సన్నుఁడనైతిని. సర్వలోకహిత మగు నామాట చెవియొగ్గి వినుఁడి! నేనీ దక్షవాటికకు బహువరముల నిచ్చితిని. ఇది క్షితిపైఁ దీర్ఘరాజపద

మునవిఖ్యాతమైనది. మదనుగ్రహమున ధాత్రిపైఁగల తీర్థములనెల్లనతిక్ర మించిన యీదక్షవాటీమహాతీర్థము పెంపునింపినది. దక్షప్రజాపతిని గీర్తించి దక్షారామమహాపుర మాచంద్రతారకముగా సకలతీర్థోత్త మోత్తమమగునట్లు వరదాన మొసఁగితిని. సమస్తగుణశోభిత మగు నాపుణ్యక్షేత్రమునఁ బార్వతితోడ వసింతును. యజ్ఞకుండజలములందు మునిఁగిన పుణ్యాచారసంపన్నుఁడే నాకు భక్తుఁడు. శ్రద్ధతో ద్వాదశ క్షేత్రయాత్రయందుఁ బ్రవర్తించు పుణ్యాచారసంపన్నుఁడు నాకు భక్తుఁ డు. స్వయముగా నింటింటికిఁ బోయి భిక్షించి తెచ్చిన ధాన్యవస్త్ర తైలాజ్యలవణాదికమగు యాత్రాపదార్థవ్రాతము తీర్థవాసుల కొసఁగిన పుణ్యాచారసంపన్నుఁడే నాకుభక్తుఁడు. మఱియు సమస్తతీర్థరాజమగు యజ్ఞతీర్థమొకటికలదు. అది బహుజన్మకృతము లగు మహాఘోరపాత కములను బాఱఁదోలును. భాస్కరుఁడు వృషభరాశియందును, మిథున రాశియందునునున్నపుడును, కృష్ణపక్షాష్టమీతిథియందునుసప్తగోదావ రమున స్నానమొనర్చినపంచజనునకుఁ బంచమహాపాతకములును బంచ బంగాళమైపోవును. ఆషాఢమాసమున శుక్లచతుర్దశియందును, సూ ర్యుఁడు కన్యారాశియందుండునపుడును, శ్రావణపౌర్ణమాసియందును, జన్మనక్షత్రమునందును, భానువారమునందును యజ్ఞకుండజలస్నానము వలన నరులకుఁ గల్మషౌఘవినాశనమగును. పద్మమిత్రుఁడు తులారాసి యందు నసించియుండఁగా యజ్ఞకుండనీరముల నీరాడిన నరుని మహా పాతకసంచయమెల్ల బ్రుగ్గి పోవును; దిననాథుఁడు వృశ్చికరాశి యందు నిలిచినపుడు యజ్ఞకుండమునఁ బ్రాతఃకాలస్నానమాచరింపఁ గల్మషములెల్లఁ గ్రాగిపోవును; మార్తాండుఁడు ధనుస్సునందుండునెడ రుద్రదైవతనక్షత్రమున యజ్ఞకుండమునందు నీరాడిన సర్వపాపములును నమసిపోవును; దినకరుఁడు మకరరాసియందుండుతఱి బుష్యమీనక్షత్ర యుతభానువాసరమునఁ బ్రాతఃకాలమునందు యజ్ఞకుండమున నవగా

హించిన నరుఁడు పాతకములను దరించును. మాఘమాసమునందు మఖానక్షత్రమున సూర్యోదయమున సప్తగోదావరమున స్నానమొనః గ్చిన నఖిలదురితములును దొలఁగును. ఫాల్గునమున ఫల్గునీనక్షత్రము తోఁగూడిన ద్వితీయయందు సప్తసింధుస్నానమొనరించిన మర్త్యుఁడు వీతపాతకుఁడౌను. మాటలు వేయు నేల? సర్వజ్ఞుఁడ నగు నా మాట ముమ్మాటికిని సత్యమైనది. భువనత్రయమందును దాక్షారామసమ మగు తీర్థములేదని జయఘంటానాదపూర్వకముగాఁ జెప్పుచున్నాఁ డను. దక్షవాటికయందు భక్తితో అన్నవస్త్రాదికము బ్రాహ్మవిదుల కొసఁగినవానికిఁ గైవల్యపదవి చిక్కును; మఱియు నచ్చట మఠాదు లను గట్టించి యందు బ్రాహ్మయోగిని నివసింపఁజేసిన మానుషుఁడు నాకు మాన్యుఁడు" అని దేవదేవుఁడు చెప్పఁగా హరిబ్రహ్మాదిదేవత లును, ఋషులును, సిద్ధగంధర్వవిద్యాధరాదులును దక్షనగరీతీర్థ సేవా పరాయణులై భక్తితో భీమేశ్వరునిఁబూజించి కృతార్థులైరి.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున ముప్పదవ యధ్యాయము.

---

## ముప్పదియొకండవయధ్యాయము

—: దక్షయాగమునఁ గోల్పోయిన తన చక్రాయుధమునకై విష్ణువు విభూతిధా రణాదులొనర్చి భీమేశుని సేవించుట.

సూతుఁడు శౌనకాదిమునులతో నిట్లనియెను:—పూర్వమొక ప్పుడు జలంధరవ్యాఘ్రగంధనాగాంధకాది మహాదైత్యులు బలోదగ్రు లగుచు భువనత్రయము నాక్రమించుకొనిరి. అప్పుడు దేవేంద్రుఁడు భయభ్రాంతుఁడై తపోధనులను సిద్ధచారణగంధర్వసాధ్యవిద్యాధరా

దులను వెంటనిడుకొని బ్రహ్మలోకమున కేగి దైత్యునియౌద్ధత్యమును విరించికి విన్నవించెను. ఆ భారతీనాథుఁడును జేయునదిలేక యింద్రాదులనందఱను దోడ్కొని క్షీరసాగరమునకుఁ బోయెను. అందు శేషాంగశాయియు, సర్వలోకార్తిహారియు నగు సరోజనాభునిఁ గనుగొని కృతాంజలియై సర్వమును దెలిపెను. భగవానుఁడు దనుజాంతకుఁడావిజ్ఞాపనమాలించి చింతాభరమునఁ జాలసేపటివఱకు నూరకుండెను. అంతఁ బ్రణమిల్లిన నగసీకుమారగర్భునితో సరసీరుహాక్షుఁడిట్లను:— "విక్రమశాలియగు వీరభద్రుఁడు రోషావేశమునఁ జక్రమును ముక్కలుచేసి చక్కిలమువలె మెక్కినాఁడు. కోపాగ్నిజ్వాలాదగ్ధ యగు తల్లిఋణము తీర్ప మిగులఁ దీప్తమూర్తియై యఖిలామరులను వీక్షించుచుండ నెదుటనుండి సంరంభమునఁ జక్రమును బ్రయోగించితిని. అంత నాతఁడాగ్రహమున దానిని బట్టి భక్షించెను. అప్పుడా మహాత్ముఁడత్యద్భుతప్రభావమున వెలుఁగుచుండ నాతని ముంగలనుండనోడితిని. తర్వాత నామహాబలుఁడతిరోషమున దక్షప్రజాపతి శిరమును జెండి యజ్ఞశాలయందున్న హుతాశనునఁ వ్రేల్చుటయేకాక యకుంఠిత విక్రముఁడై మేషమస్తకము నా ప్రజాపతికంఠమున స్థాపించెను. అట్లు దుర్నిరీక్షుఁడై యున్న యాతనితేజమును జూడఁజాలక మహాభయమున వానిదృష్టిపథమునుండి తొలఁగి పోతిని. నాఁటినుండియు నా చక్రము లేమింజేసి నా బాహుదండము లీలాసమృద్ధిరహితమై, నిరాయుధమై యున్నది. అయ్యో! నాసుదర్శనమేయుండి యుండిన దైత్యబాధాకులులై దుఃఖించుచుండిన మిమ్ముల నిట్లు గాంచి మిన్నకుందువాఁడనా! ఇఁక నిప్పుడు భక్తేష్టదాయకుఁడగు భీమనాయకునిఁ జక్రలాభమునకై సేవించెదను" అని బ్రహ్మేంద్రాది దేవతలతోడ క్షితిభూషణమై యున్న దాక్షారామమహాక్షేత్రమునకు విచ్చేసెను. అందు యథావిధి శివగ

గామహారూపమున నవగాహించెను. అంత భస్మోద్ధూళితవిగ్రహుండు ను, త్రిపుండ్రాంకిత మస్తకుండును, రుద్రాక్షమాలాభరణుండును, జటావల్కలమండితుండును, దృఢవ్రతుండును నై నిత్యమును బద్మసహస్రముతో నియమమున నీలగ్రీవుండై, యమారాతియై, సదాశివుండై యున్న భీమనాగేశ్వరునిం గొంత కాలము గొలిచెను. ప్రతిదినమును బుండరీకాక్షుండు సహస్రపుండరీకములతో సహస్రనామములను బఠించుచుం బూజించును: వివిధభూషణములతో శశాంకశేఖరుని పాదపీఠము నలంకరించును. అట్లనుదినమును సాదరముగాం గపర్దిపాదపీఠమునకు సమర్పింపంబడిన సరోజాతములు భక్త్యుద్రేకముతోం గాంచుచుండెడి వారిజాక్షుని వీక్షణములతో సంగతములగు మధుకరవ్రాతసమేతములై రాజిల్లెను. అట్లు ప్రత్యహముగ బద్మసహస్రముతో హరునిం బూజించెడి పద్మనాభుని మనమును బరీక్షింపనెంచి శ్రీభీమేశమహాదేవుం డొకపద్మమును హరించెను. అంత నా పద్మలోచనుండు తానర్పించు సహస్రపద్మములలో నొకకొఱటి లేకుంటచే నిట్లు వగచెను:—"అయ్యో! ఏమిది! నా నియమమునకు మహాభంగము కలిగెం గదే" యని వగచి కటకస్ఫురత్కాంశుపటలీపాటనమగు కనిష్ఠికానఖాగ్రమున వికచపద్మసదృశమగు తనదక్షిణాలోచనము నూడంబెరికి సుధాకళాధరుండై, సర్వలోకైకపూజ్యుండై, సర్వాభీష్టప్రదాయకుండై, శ్రీరక్షావాటికటకస్థాయియై యున్న భీమనాయకున కర్పించెను. అప్పుడిది వెన్నుండు కొనగోటం బెకలించిన నేత్రపద్మమును బరమభక్తితో బంగారుగద్దియపై నునిచెను. అప్పుడు సర్వజ్ఞమగు పద్మనాభుని లోచనము వామదేవపాదాబ్జములందు నెంతేనియు శోభించెను. అంత నా సదాశివుండు సంప్రీతిచెంది సదయుండగుచు దామోదరుని ముంగలం బొడచూపి ప్రీతితో నిట్లనియె:—"పుండరీకాక్ష! నీభక్తికి నాడెందము

మిగులఁ బ్రీతిచెందినది; కాన నీచిత్తమునకు వచ్చిన వరము నడుగుము! ఇదిగో యిచ్చెదను" అని పరమేశ్వరుఁడు పలుకఁగా నానలినలోచనుఁడు నమస్కరించి లోకావనావకమగు చక్రము నాత్రిలోచనుని యాచించెను. ఆ భీమనాథేశ్వరుఁడును తపాచరవిపక్షులకు నస్త్రకులదైవతమగు సుదర్శనచక్రము నిచ్చెను. అంతకు మున్నే భూలలోచనుఁడు కమలలోచనున కంభోజగుచ్చిపగు దక్షిణలోచనము నొసఁగి యుండెను. అట్లు నారాయణుఁడు శ్రీభీమేశమహాప్రభునికడ నంగీకరించిన దివ్యాయుధమగు వేయంచుల వాఁడు మార్తాండకోటిసదృశప్రభాముదశాలియై తేజశ్శాలియై యుండెను ఆచక్రముతో యుద్ధమున దుష్టరాక్షసులశిరములను భేదించెను. ఇంద్రాదిదేవతలకెల్లరకును బ్రమోదము కలిగించెను. ఇది యునుగ్రభుఁడగు భీమనాయకుని మాహాత్మ్యము. ఆ దేవుఁడు నిజాంఘ్రిపూజాసక్తులకు సకలాభీష్టముల నొసఁగును. వారి వాసరమున సద్భక్తితో శివగంగాజలములం స్నానమాచరించి భీమనాథేశునవలోకించు వారలకభీష్టములు సిద్ధించును. అంతఃప్రాకారభవనమున భీమనాయకునకు దక్షిణమున నున్న నగ్రాదయునకు మ్రొక్కువారలు వాంఛితములు నడయుదురు. భీమనాథునికి నైరుతిభాగమున దక్షిణ దిగ్భాగముననున్న మహాలింగమూర్తియగు గురుమునకు నమస్కరించువారలకు శుభములు చేకూరును. అట్లే భీమనాథునకు దక్షిణమున నున్న లక్ష్మీనారాయణునకుఁ గేశవునకు మ్రొక్కినవారలు భద్రములు వడయుదురు. నాతనిదిగ్భాగముననున్న విఘ్నాధినాయకునకుఁ బ్రణమిల్లిన వారికిష్టార్థసంసిద్ధిసంపదనందును. భీమేశునకు వాయుదిగ్భాగముననున్న దుర్గను సప్తమినాఁడు గాని చతుర్దశినాఁడు గాని సేవించిన నరుఁడు నిష్కల్మషుఁడగును. తాండవేశ్వరుని దర్శించు మానవులు పీతసంతాపులై కళ్యాణపరంపరనందుదురు. భీమేశునకుఁ బురోభాగమున నున్న హిమాచలేశ్వరయునకు గౌరికి నమస్కరించునరుఁ డన్వహా

మును శుభములను బడయుచుండును. గౌరిని, జనార్దనుని, రుద్రునిఁ, కేశవుని, గణపతిని, శివను, దాండవేశ్వరునిఁ గ్రమముగాఁ గాంచి భీమేశ్వరుని విలోకింపవలయును. పూర్వకాలమునం దద్భుతమహోదారవిరాడ్రూపసముజ్జ్వలుండును, సనాతనుండును, సర్వభూతాత్మకుండును నగు శ్రీభీమేశ్వరస్వామి మహాప్రభావముతో మహాలింగమూర్తియై యొకింతయేని యవకాశము గన్పింపకుండునట్లు సర్వము నాక్రమించి యున్న సమయమున సప్తమునగిఁది భూర్భువస్స్వర్లోకములు మూఁడును భేదించుకొని బ్రహ్మాండకర్పరముదాఁకను బెరిఁగియుండెను. అప్పుడు బ్రహ్మాదిదేవతలు భయాక్రాంతులగుచు బరమాద్భుతాకారమగు నా భీమేశ్వరు నీపగిది నుతించిరి:—"సర్వేశ్వర! మహాత్మా! నీరూపమును గాంచి యోగీంద్రులు ధ్యానములను దెలిసికొననేరకున్నారము! నీరూపము హ్రస్వము చేయుము! లోకానుగ్రహనిష్ఠ! ఇట్టి యద్భుతరూపమును గాంచి మేమెట్లు పూజింపఁగలుగుదుము! ప్రభూ! వామనమూర్తివి కమ్ము!" అని ప్రార్థింప నద్భుతవైభవుండును దేవేశుండును నగు భీమేశుండు కారుణ్యామృతసాగరుండై బ్రహ్మాండమునుండెలా పూర్ణమగు తన స్థూలశరీరమును ఖర్వముగాఁ జేసి దక్షవాటీపురీస్వర్ణసౌధమధ్యమమున విరాజిల్లెను. కేశవగణాధిశదుర్గాతాండవశంకరకాలభైరవులును, గౌరియును, బరివేష్టించియుండఁ బుణ్యప్రవాహపూరణపాపహారియగు శంకరుండును, బరదారాభిగమనపాపధ్వంసియగు నీశ్వరియుఁ, బరపీడాపాపహారుఁడగు బాలచంద్రశేఖరుండును నైరృతిభాగమున నధివసింప దక్షోదిగ్భాగమున భీమనాథుండు ప్రకాశించుచున్నవాఁడు. అంబుధిపృద్ధగంగకాంతేయసరిత్కృష్ణానదీతుల్యభాగానస్తగోదావరముల ప్రవాహములకు మధ్యదేశమై, జగత్ప్రసన్నతమై, మధ్యమలోకభాగధేయమై, దేవకిన్నరగంధర్వసిద్ధవిద్యాధరాశ్రయమై, సమీపోద్యానమందారపారిజాతాదిభూరుహ

మై, ప్రసూనవిసరామోదవాసితదిశాముఖమై, యజ్ఞతటాకసంజాతమరందాస్వాదనశాలులగు స్ఫురన్మిళిందబృందముల ఝుంకారామందనిస్వనములతోడను, శింజినీవల్లిటంకారలబ్ధమీనకేతు ప్రతాపసంతతపరిదీపితమై, యాఖండలాదిదిక్పాలజాగరూకప్రతిక్షణ పరిగుప్తదీప్తప్రాకారగోపురప్రాంగణస్థలమై, మూలికాఖడ్గఘుటికారసాంజనముఖసంసిద్ధిక్షేత్రమై, వసిష్ఠవాలఖిల్యాత్రిశాండిల్యాంగిరసాద్యష్టాశీతిసహస్రర్షిమండల సమాకులమై, కర్ణికారాంబికాపాణిసువర్ణడమరుస్వనపర్జన్యగర్జితభ్రాంతినృత్యకుమార మయూరములతోడను, కుమారారామసంవేద్యకుండలాముఖసంజ్ఞితములతోడను, వ్యాఘ్రేశ్వర మార్కండేయేశ్వరులతోడను, నవ్యములగు శాఖోపశాఖాతీర్థములతోడను శోభిల్లునదియై, సముద్రభువనోత్కృష్టమై, కైలాసమేరు శైలసుందరములకన్నను, ఉదంబరకాళహస్తికాశీనగర శ్రీనగములకన్నను, కేదారసేతుబంధములకన్నను, ప్రియతమమై యున్న దక్షారామపురోత్తమమునఁ గాలకూటాగ్నిజ్వాలాజాలవిజృంభణమును హరించియుఁ, జండత్రిపురదైతేయసుందరీగండమండలమకరీపత్రభంగ శ్రీశూన్యము గావించియు, సర్వమంగళాయుక్తుండై భీమలింగమహాప్రభువు నిరంతరాఖిలజగత్త్రాణలీలాపరుండయ్యెను.

ఇది స్కాందపురాణమునందలి భీమఖండమున

ముప్పదియొకండవ యధ్యాయము.

# ముప్పదిరెండవయధ్యాయము

—భీమేశ్వరుఁడు వ్యాసాదులకుఁ బ్రసన్నుఁడై దక్షారామమాహాత్మ్యమును జెప్పుట—

సూతుఁడు శౌనకాదిమునుల కిట్లనియెను:—పూర్వము వాసవుఁడు నాట్యోత్సవార్థము సురూపు లగు నాట్యాటయచ్చరలను శ్రీభీమేశ్వరున కొసఁగి యుండెను గదా! ఆ విలాసవతులలోఁ గొందఱు చంద్రమండలమునుండియుఁ గొందఱు క్షీరసాగరమునుండియు, కొందఱు హుతాశనశిఖాచయమునుండియుఁ, గొందఱు మెఱపులనుండియుఁ, గొందఱు సూర్యబింబమునుండియుఁ, గొందఱు పంచబాణుని యిక్షుకార్ముకమునుండియుఁ, గొందఱు లక్ష్మీపతియూరుకాండములనుండియుఁ, గొందఱు గంధర్వకులమునుండియు జనించిరి. వారలెల్లరును మన్మథసామ్రాజ్యసంపదనింపువారు; రూపలావణ్యతారుణ్యసౌకుమార్యసమంచితులు; వారికచములు తమోవినీలములు; వారి యలకలు బాలేందుసదృశములు; వారి భ్రూవల్లులు పంచబాణచాపములు; వారి చూపులు మన్మథబాణములు; వారి కర్ణములు శ్రీకారములు; వారి నాసికలు స్వర్ణకోరకములు; వారి యోష్ఠములు బంధుజీవకతామ్రములు; వారి పలువరుసలు మల్లెమొగ్గలు; వారిగండఫలకములు దర్పణములు; వారి మంజుసూక్తములు శుకకూజితములు; వారి చారుహాసనము చంద్రికయే! వారి యాననములు చంద్రబింబసమములు; వారి కంఠములు కంబువులు; వారి బాహువులు లతలు; వారి నఖశోభ ప్రవాళసుందరము; వారి వక్షోజములు పూలబంతులు; వారి మధ్యమములు సింహమధ్యమములు; వారి వళులు తరంగతుల్యములు; వారి రోమరాజులు భుజంగులు; వారి నాభికుహరము లావర్తనములు; వారి కటిమండలములు భూచక్రములు; వారి యూరుయుగ

ళములు రంభాస్తంభములు; వారి జంఘికలు తూణీరోపమములు; వారి గుల్ఫములు మాణిక్యప్రోల్లసములు; వారి పదములెఱ్ఱదామరలు; మఱియు వారలు గంభీరవేదగమనలు; సర్వాలంకారశోభితలు; నాట్యసంగీతచాతుర్యసద్విద్యలకు జన్మభూములు; వినయాదిగుణోపేతలు; సుకాంతలు నైనవారలు. ఆ వారవనితలు మహోత్సవములందుఁ బ్రతిసంధ్యాకాలమునందును నత్యంతభక్తియుతులగుచు దేవేశుని భీమనాథమహాప్రభుని సేవింతురు. అప్పుడు వారలు శ్రవణానందము లగు సంగీతములు పాడుదురు; నయనోత్సవమగునట్లు నాట్యమాడుదురు; సరసముగా మధురాలాపములాడుదురు; సత్రేపముగ నవలోకింతురు: శృంగారచేష్టారచనములను గావింతురు; మనోహరముగఁ జిఱునగవులు నగుదురు; ఇష్టకేళీవిలాసములఁ దేలుదురు; పుష్పమాల్యములు సమర్పింతురు; సారకర్పూరకస్తూరీగంధసారములనలదుదురు; సంధ్యారాగసమప్రభము లగు నీరాజనములిడుదురు; మనోజ్ఞము లగు మంగళాష్టకములను బఠింతురు; అనవద్యము లగు గద్యపద్యములను జదువుదురు; బిరుదావళీకీర్తనములను బాడుదురు; పుణ్యము లగు కథాసంవాదములను సల్పుదురు; కళ్యాణగుణములను వర్ణింతురు; ప్రార్థింతురు; మ్రొక్కుదురు; సకలోపచారములను గావింతురు. మఱియు సకలదేవతలును శ్రీభీమమండలీపుణ్యక్షోణియందునలుదెసలను భక్తితో శంభులింగములను బ్రతిష్ఠించి దయాపరుఁ డగు భీమేశునిట్లు వేఁడికొనిరి:—మేమెల్లరమును నిల్పినలింగములకు నిరంతరము మహత్తర మగు భుక్తిముక్తిప్రదానైకసామర్థ్యము గలిగింపుము!" అని సకలదేవతలును వేఁడికొన భక్తవత్సలుఁ డగుభీమేశ్వరుఁడు వారలు వాంఛించినట్లనుగ్రహించెను. శ్రీభీమనాథునకును సప్తగోదావరమునకును నడుమ నింద్రేశ్వరమహాతీర్థము గలదు. అది సకలపాపములను నశింపఁజేయుట

యే కాక దర్శనమాత్రముననే నరులకు భుక్తిముక్తిఫలము నొసం గును. దానిని దేవనాథుఁడు సద్భక్తియుతుఁడై ప్రతిష్ఠించెను. మఱి గు భీమేశునకు దక్షిణదిశాభాగమున శ్రీయజ్ఞపురుషేశ్వరుఁడు గలఁడు. అతఁడు భోగాపవర్గములు నిచ్చు దివ్యలింగమూర్తి. ఆదేవుని చెంత నగ్నికుండమను పేరుగల వాపి యొకటి కలదు. అందలి జలముల స్నాన మొనర్చి తర్పణము గావించినవాని పితరులసదియూర్ధ్వగతికిఁ దీసికొని పోవును. అందుఁ గృత్తికానక్షత్రమున స్నానమొనర్చి యాయగ్నీశ్వరుని గాంచినవానికి ముక్తి పాణిబిల్వఫలమగును. దానికి దాపునఁ బాప హారిణి యగు దక్షకుండిక గలదు. దానికి దక్షిణదిగ్భాగమున హిమ గిరినందనయు, భువనేశ్వరియు నగు దాక్షాయణీమహాదేవి వెలసియు న్నది. ఆ దక్షకుండమునఁ గృష్ణపక్షమునం దష్టమినాఁడైనను, జతుర్దశి యందైనను స్నానమొనర్చి యాదేవికి సాష్టాంగనమస్కార మొనర్చిన వాఁడు దేహాంతమున మోక్షమందును. ఆ తీర్థమునకు త్తరదిగ్భాగమున వీరభద్రుఁడు ప్రతిష్ఠించిన వీరభద్రేశునిఁ గాంచినవాఁడు మోక్షమం దును. అదేవునకు సమీపమున నైరృతియందు నిరృతి ప్రతిష్ఠించిన నిరృతిలింగమును దర్శించినవానికిఁ బరమగతి సంభవించును. శ్రీభీమేశ మహాదేవునకుఁ బశ్చిమదిక్కున వరుణేశుఁడు ప్రతిష్ఠించిన వరుణేశ మహాలింగము గలదు. ఆ వారుణకుండమునందు వారుణనక్షత్రమున మునిఁగియావరుణేశ్వరలింగమునుదర్శించినవానికిసంతతానంతదుఃఖవ్రా తభవబంధమువీడును. శ్రీభీమనాథమహాదేవునకువాయవ్యదిగ్భాగమున వాయుప్రతిష్ఠిత మగు వాయులింగము గలదు. ఆ వాయుకుండజలముల స్నానమొనర్చి యా వాయులింగదర్శన మొనర్చినవాఁడు మోక్ష సంపదనందును. మఱియు సోమప్రతిష్ఠిత మగు సోమేశ్వరమహాలింగము గలదు. సోమనక్షత్రమునందాసోమకుండజలమున స్నానమొనర్చి యాసోమేశ్వరుని వీక్షించినమానవుఁడు దుర్వార ఘోరసంసార

దుఃఖబంధములను బాయును. కుబేరుఁడు ప్రతిష్ఠించిన కుబేరమహా లింగమునవలోకించిన నరులకు సర్వార్థసిద్ధియగును. శ్రీభీమనాథేశ్వరున కీశానదిగ్భాగమున సప్తగోదావరతటమునందీశానలింగము గలదు. రుద్రనక్షత్రమున సప్తగోదావరమున మునిఁగి యా యాశానలింగ మును భజించువానికి భుక్తిముక్తులు కలుగును. కృష్ణద్వైపాయనమౌని సప్తగోదావరతీరమునందత్యంత నిష్ఠతోఁ బరమతపం బాచరిం చెను. మఱియు దక్షవాటికాపూర్వద్వారమునందుండి నూకాంబికా మహాశక్తియు; దక్షిణద్వారమునందుండి ఘంటాంబికామహాదేవియుఁ, బశ్చిమద్వారమునందుండి గోగాంబ (గోగులమ్మ) యు; నుత్తరద్వార మునందుండి మండాంబికామహాదేవియు నానగరోత్తమమును రక్షించు చుందురు. మర్త్యులీశక్తిచతుష్టయమును దర్శింపవలయును; లింగ పార్వతీదర్శనము చేయవలయును. సప్తగోదావరతటమునఁ బాదరా యణుఁ డత్యంతనిష్ఠతో సుదారుణమగు మహాతప మాచరించెను. అంత నితాంతభక్తివిశ్వాసతాత్పర్యదృఢమానసుఁడగుచు నందు శంభు లింగము నొకదానిని నిల్పెను. ఆ సత్యవతీసుతుఁడు పంచాక్షర మహామంత్రమును జపించుచుఁ జిరకాలమాలింగమును సేవించెను. అంత హరిబ్రహ్మేంద్రాదిదేవతల కుపాస్యుఁడగు నా మహాదేవుఁడా మహామునికిఁ బ్రసన్నుఁడయ్యెను. అట్లు పరమేశ్వరుఁడు ప్రత్యక్షమైన పుణ్యాహమున సమదభ్రమరవ్రాతకోలాహలవిజృంభితమును నామోద నిర్భరమును నగు పుష్పవర్షము గురిసెను; దెసలు విరిసెను; మందా నిలములు మనోహరముగ వీచెను; దేవదుందుభులు మొరసెను; సకల లోకములకు మనఃప్రమోదమానతిహెల్లెను; అచ్చరలాడిరి; గంధర్వులు మధురముగాఁ బాడిరి; మునిగణము స్తుతించెను; జగజ్జనులు కొందఱ ట్టాలాపములాడికొనిరి; కొందఱు తాండవమాడిరి; కొందఱానంద మున బాహాయుద్ధము సల్పిరి. అత్తఱిఁ బాదరాయణుఁడు ప్రసన్నుఁ

డయిన పరమేశ్వరునిఁ గాంచి పులకాంకురసర్వాంగుఁడై ప్రమొక్కి యిట్లు ప్రస్తుతించెను:—"ఓపార్వతీశ! సర్వజ్ఞ! సర్వదేవేశ! సర్వాత్మక! సర్వభూతహృదావాస! నీకునమస్కారము! నీలకంఠ! నిగమోపనిష ద్వేద్య! నిస్తుల్యమహిమోన్నత! నిత్య! అనంత! నిరాతంక! నీకు నమస్కారము! మృత్యుంజయా! సత్యప్రతిజ్ఞ! త్రైలోక్యసత్య! దైత్యపురాంతక! అత్యంతాద్భుతసామర్థ్య! నీకు నమస్కారము! కళ్యాణగుణసంపన్న! కళ్యాణాద్రికార్ముక! కళానిధికళాకల్ప! కాలకాల! నీకు నమస్కారము! కామగర్వాద్రిదంభోళి! సోమసూర్యాగ్నిలోచన! సామప్రియ! మహాదేవ! వామదేవ, నీకు నమస్కారము. అంగనాక్రాంతనామాంగ! మంగళప్రదనామక! పుంగవాశ్వ! జగద్వంద్య! గంగాధర! నీకు నమస్కారము. నీలలోహిత! భూతేశ! భాలలోచన! శంకర! కైలాసవాస! శ్రీకంఠ! శూలపాణి! నీకు నమస్కారము! ఈశ్వర! అనీశ్వర! అమేయ! శాశ్వతానందదాయక! విశ్వరూప! విరూపాక్ష! విశ్వనాథ! నీకు నమస్కారము. ఓప్రభూ! నక్షత్రములు, వర్షధారలు, భూరేణువులు గణింపశక్యములగును; గాని నీకళ్యాణగుణములు లెక్కింపరావు. జనులు ప్రీతియుతులై వేదాంతములతో శక్తికొలఁది నీగుణార్ణవములను స్తోత్రమొనరింతురు. అంతట నీస్తవముసఫలమైనది; విశ్వాధికుఁడవు, విశ్వసృజుఁడవు, విశ్వస్థితివిధాయకుఁడవు, విశ్వనాథుఁడవు నగు నీకుఁ బ్రణామమాచరింతును. ఓస్థాణు! ప్రళయకాలమునందఖిలమును సంహరించి నీవొక్కఁడవే యుందువు; ఓభవా! సృష్టియందుఁజచరాచరమగునదంతయు నీవే! ఓపరమేశ్వర! సర్వభూతములందు గూఢమూర్తివై యున్నవాఁడవు; భూతకర్తవు; అణువునకన్నను దక్కువవాఁడవు; గొప్పదానికంటెను గొప్పవాఁడవు; నీకు నమస్కారము. ఓబ్రహ్మ! భేదమోహములను నివర్తింపఁజేసికొని సకలమును నీవే యనుకొనువానికి నసారమగు సంసారసాగరము గోవత్సపదమగును. ఓభీమేశ!

నీ కథ యనెడి సుధను నమృతముతో నెట్లు పోల్ప
నగును? మర్త్యుఁ డమృతపానమున నమరుఁడే యగును;
నీకథాసుధాపానమున నోయమరాధిపుఁడేయగును. చేతస్సునందు శివుఁ
డుండు వానికి మంగళము లెక్కడివి? ఓకృపాకర! మహాఘోర మగు
భవపంకమునుండి నన్ను లేవనెత్తుము! నీదు పాదపంకజభక్తిహస్తా
వలంబనమువలనఁ బరమార్థరసాపేక్షమునం దెల్లపుడును నాయాత్మ
రమించుఁగాత! నాశిరమెల్లపుడును నీపాదపద్మమునందుఁ భ్రమరమై
యుండుఁగాక! ఆ యాస హేతువు లగు వివిధమనోరథార్థము లక్కఱ
లేదు.'' అని భక్తుఁడగు వ్యాసుఁడు నుతింప భక్తవత్సలుఁడగు కామారి
యా వ్యాసునిఁగాంచి నితాంతప్రీతమానసుఁడగుచుఁ గారుణ్యవీక్షణ
మున వీక్షించి ప్రమోదింపఁజేసెను. అంత నాపరమేశ్వరుఁడచ్చటకు
వచ్చియుండిన మునివరులను, యోగీశ్వరులను, సమస్తదేవతలను నుద్దే
శించి యిట్లనియెను:—ఇందున్నవారందఱును నాదరముతో నామాట
నాలింపుఁడి! సందియము వదలుఁడి! అక్కడాకసమున కాభరణ
మైన నగిది ధరణీమండలమున కెల్లను దక్షపురక్షేత్రమే భూషణము.
ఈ పుణ్యస్థలమున సకలజనులకును భుక్తిముక్తులు గలుగును. ఈయర్థ
మునందు మీరలందఱును విశ్వాసతత్పరులు గావలయును. ముల్లోకము
లందును మాకభీష్టములగు నా రామములనేకములున్నను దక్షపురమునం
దున్న యభిమానము మఱొకదానిపైఁ గానరాదు. ఇది సత్యము!
ముమ్మాటికిని సత్యము! నేనిది బాగుగా భావించియే పలికితిని దక్ష
వాటమునకంటెఁ బరమ మగు తీర్థము భువనత్రయమునందును బొడ
చూపదు. మఱే వేల్పు చెంతకును బోకుండఁ గండ్లూడఁ బెఱికికొని
యుఁ, జరణద్వయమును ఖండించుకొనియు దక్షవాటముననే నరుఁడు
వసింపవలయును. తిష్ఠన్మాత్రుఁడైనను వసిష్ఠసమానుఁడైనను దక్ష
వాటపురమున నున్నవాఁడు మోక్షమునందుననుటకు సందియము

వలదు. దక్షవాటీదర్శనమున బ్రహ్మహత్యాసురాపానగురుతల్పగమ నాదిపాపౌఘములు తత్క్షణముననే నశించును." అని సర్వదేవగణ ప్రభుఁడు చంద్రకళాధరుఁడు లోకహితకరణముగాఁ జెప్పి యంతర్ధాన మందెను. అప్పుడందున్న గోవిందశతానందపురందరపురస్సరు లగు బ్రహ్మయోగీశ్వరులును, మార్కండేయపురస్సరు లగు మాదపాల మాద్గల్యమాండవ్యాదిమహామునులును కృతార్థుఁడై, యీశ్వరాను గ్రహోగణ్యలాభసంతుష్టుఁడై యున్న బాదరాయణునిఁ బ్రస్తుతించి నిజ నివాసములకేగిరి. సప్తగోదావరస్నానమును, రామనాథావలోకన మును, రామగయాపితృశ్రాద్ధక్రియాదికమును, గౌరీజనార్దనరుద్ర కేశ వ గణనాథ దుర్గా తాండ వేశ్వరుల దర్శనమును, ప్రదక్షిణ ప్రక్రమమును, బంచాక్షర జపమును, పాశుపతా చారనియమములును బరమపుతములు. సర్వదేవతాసార్వభౌముఁడు, సదా శివుఁడు, భుక్తిముక్తిప్రదాత, భువనైకమహాప్రభుఁగును నగు భీమనా థేశ్వరుని భజించు విమలాత్ము లగు భక్తులకెల్లరకును నాగమోక్త మతమిది యు! నతజనాభీష్టఫలదానసమద్రుమములై, సకలకలుషహార ములై, దూరావరణదేవతలై యున్న పరదారేశ్వరుఁడును, నగస్త్యే శ్వరుఁడును భీమేశ్వరపూర్వదిగ్భాగమండలి ప్రాసాదములందు వెలసి యున్నారు. శ్రీదక్షనగరమున లేని దేవతలు వసుధాతలమున మఱె చ్చటను లేరు; శ్రీదక్షవాటీనగరియందు లేని యమృతము భూతలమున మఱేడను లేదు; శ్రీదక్షవాటీనగరమున లేని శాసనము జగతీతలమున మఱెందును లేదు; శ్రీదక్షవాటీనగరి సర్వక్షేత్రనివాసభూమియై, సమ స్తవిబుధాశ్రయమై, శివమహాంతఃపురమై యున్నది. అట్టెడఁగున జగ ద్గేయసమృద్ధిచే శోభించు శ్రీదక్షవాటీనగరమునకుఁ దాపసులమందఱ మును బోదము! నేత్రోత్సవ మగు శ్రీభీమమండలమును వీక్షింతము! శోభన మగు సప్తగోదావరమున మునుఁగుదము! కణ్వనదిని, గౌతమిని,

సాగరసంగమమునను, గౌంతేయనదిని మజ్జనమాచరింతము!" అని నైమిశారణ్యపుణ్యక్షేత్రముననున్న మునివర్యులుపలుక వ్యాసశిష్యుఁడు సూతుఁ డనవన్యమానసుఁడగుచు నూరకుండె ను. అంతనామునిమునిపుంగవులెల్లరును బురాణవక్త యగు సూతునకు వస్త్రాలంకారభూషణముల నిచ్చి పూజించిరి:—ఒకమునిశ్రేష్ఠుఁడు శుభ్ర యగు శాటియిచ్చెను; ఒకరుఁడు కమండలువునిచ్చెను;ఒకొ్కరుఁడు నమస్కరించెను;ఒకొరుఁడు మనోహర మగు కుశాసన మొసఁగెను. వేయేల? ఉన్నతులగుచు వివిధద్రవ్యముల నొసఁగిరి. మఱియు బుద్ధిమంతుఁడు పురాణము చెప్పువాని నవమానింపరాదు! అట్లొనర్చినమూఁఢాత్ముఁడు రౌరవనరకమునకుఁ బోవును; బ్రహ్మరాక్షసుఁ డగును. సకలదేవతలకు జ్ఞానమొసఁగెడి శ్రేష్ఠుని బురాణవాచకునిఁ బూజింపకయే పురాణశ్రవణఫలమునందఁజాలఁడు. అపూతుఁడును, నరకుఁడును నగు వానిని గాంచి యమోఘశాసనుఁడు భీమేశుఁడు కోపించి మిగులఁ బీడించును. అట్టి దుష్టమనుజుఁడీశ్వరవైభవము నెఱిఁగి యున్నవాఁడయ్యును యముని వశమై నారకబాధలనందును. మఱియు నాలుబ్ధుని వాలుకాకుంభతపనమునందును, రౌరవాదులందును బడఁగొట్టి మిగులఁ బీడించును. అందుచే మహాత్ములగు వారలు పురాణవాచకునిఁ బూజింపవలయును! ఆ విప్రవరునిఁ బూజించినవానికిష్టసిద్ధికలుగు ననుటకు సందియము లేదు" అని యుదారు లగు నా మహాత్ములెల్లరును నాపురాణవాచకుని సూతునిఁ బూజించిరి. అంత ద్వాదశవార్షిక మగు నాసత్త్రయాగమునఁ గూడిన శౌనకాదిమహర్షులెల్లరును యా యాగావసానమున హర్షోత్కర్షముతో రోమహర్షపుత్రుఁడును, మతిశాలియు నగు సూతుని వెంటనిడుకొని వచ్చి శ్రీభీమేశ్వరుని నవలోకించిరి. ఇట్లు పావనమై, వేదసమ్మతమై యొప్పు శ్రీభీమేశమాహాత్మ్యమును భక్తితోఁ బఠించువారలకును,వినువారలకును, వ్రాయువారలకును,ధర్మమునుబరిపాలించు

వారలకును శ్రీభీమేశకృపచే దీర్ఘాయువు, బలమారోగ్యమైశ్వర్యము, సుస్థిరయశము, ధర్మాభివృద్ధి, విజయము, తుష్టి, పుష్టి, మతి, ధృతి, నిత్యోత్సవసమృద్ధి, సంపత్తి, బంధువులు, పశుసంపత్తి, పుత్రలాభము, కుశలము, సంతతసుఖములును సంభవించుటయే కాక దేహాంతమున శంభులోకసుఖము సంభవించును!

ఇది శ్రీస్కాందపురాణమునందలి భీమఖండమున

ముప్పదిరెండవయధ్యాయము

సంపూర్ణము.

---

ఇది కాటకూటేశ్వర గ్రామవాసులగు భాగవతుల

వేంకటసుబ్బారాయునకును సీతాంబికకును

బుత్రుఁడగు లక్ష్మీపతిశాస్త్రిచే

రచింపఁబడెను.

---

# తప్పు ఒప్పుల పట్టిక

మొదటి నలుఁవదిగొనిమిది పుటలలో మాత్రమే కొన్ని ప్రమాదములు కలవు
వానిని సవరించుకొని చదువఁగోరెదము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 21 | డియె | డై | 26 | 12 | తెరం | తెఱం |
| 3 | 16 | రము | రమున | ,, | 26 | నాసూ | నానాసూ |
| 4 | 10 | నాయత్త | నాయిత్త | 27 | 5 | త్తరి | త్తఱి |
| ,, | 16 | జ్ఞాత్వ | జ్ఞాత్మ | ,, | ,, | తీర | తీఱ |
| 5 | 4 | మారు | మాఱు | ,, | 10 | ఆఁకు | ఆకు |
| ,, | 22 | త్తరి | త్తఱి | ,, | 20 | క్షుద్ర | క్షౌద్ర |
| 6 | 9 | త్తరి | త్తఱి | ,, | ,, | సోక | స్తోక |
| ,, | 16 | స్వర | స్పర | 28 | 12 | పము | పమము |
| 7 | 17 | పాత్ర | ప్రాంత | 29 | 19 | ద్దరు | ద్దఱు |
| 8 | 17 | సమ | సమ్మ | 33 | 22 | ముల | ములు |
| 9 | 9 | యింతి | తిం | ,, | ,, | మునుం | ములనుం |
| 10 | 21 | సాద్ | సాద | 37 | 12 | పారు | పార్కు |
| ,, | 23 | సూ | నూ | ,, | 13 | విను | విని |
| 11 | 12 | డాన్ని | డాన్వి | 40 | 8 | ప్రారి | పారి |
| , | 14 | యరు | యఱు | 41 | 12 | గుదా | గుద్దా |
| ,, | 25 | లేరు | లేఱు | 42 | 2 | ద్వ్యక | ద్వ్యజ |
| 12 | 1 | కౄర | క్రూర | ,, | 3 | జషు | జఘు |
| 13 | 16 | క్ప్వష్ట | క్ప్వష్ప | ,, | 13 | శశా | శసా |
| 14 | 21 | పర | ఁబర | 43 | 14 | అచ్చ | ఇచ్చ |
| ,, | ,, | లేఁడు | లేదు | 44 | 2 | ప్రతీ | ప్రతి |
| 16 | 25 | ఃథి) | పథి | ,, | 16 | సిద్ధ | సిద్ధి |
| 25 | 19 | పోయింప | పోయఁ | ,, | 26 | వేడి | లెడి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 45 | 16 | సిద్దే | సిద్ధే |
| ,, | 17 | క్తుల | క్త |
| ,, | 19 | సీర | వీర |
| ,, | 22 | వర | వర్గ |
| 46 | 6 | ముస | మున |
| ,, | 12 | కతా | కలతా |
| ,, | 14 | బృదా | బృందా |
| ,, | 19 | ఫాలా | భాలా |
| ,, | 22 | భవ | భువ |
| ,, | 23 | భార్త | భార |
| 47 | 13 | నజు | నకు |
| ,, | 20 | బడి | బడెడి |
| ,, | ,, | నాశ | నాస |
| 48 | 1 | దృష్ణ | దృష్ణి |
| ,, | 2 | ర్వ్యాభా | ర్వ్యాగ్రభా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ,, | 6 | యొసఁ | యెసఁ |
| 61 | 12 | శాతాం | శాంతా |
| 63 | 22 | వభ | భవ |
| 164 | 5 | వానికి | వానిక |

పీఠిక

| | | | |
|---|---|---|---|
| III | 15 | క్ఛ్ర | కృచ్ఛ్ర |
| III | 11 | భీమేశుని | భజింపనగ్నిష్టోమాదులు చేయనక్కఱలేదు. |
| VIII | 12 | నిధి | నిధే |
| X | 24 | నుఁడై | నుజుఁడై |
| XII | 21 | దుత్య | దుల్య |
| XVIII | 14 | యెంచి | హిమవంతుఁడు |

# అచ్చగుచున్న గ్రంథములు.

---

శ్రీ రామకృష్ణగోపాలు భండారుకారు వారిచే రచియింపఁబడిన మార్గోపదేశిక సంస్కృతమందిరాంతః ప్రవేశికలు వలెఁ బాశ్చాత్య పౌరస్త్యపండితులచే రచియింపఁబడిన సంస్కృతాంగ్లాది వాచకపుస్తకాదులను జక్కఁగఁ బరిశీలించి సంస్కృత భాషావిషయములెల్ల నచిర కాలములోఁ దెలియునట్లుగా సంస్కృత ప్రథమ వాచకము, ద్వితీయ వాచకమునను రెండు గ్రంథములు సంస్కృతమెల్ల నాగరాక్షరములతోడను దెలుఁగు తెలుఁగక్షరములతోడను ముద్రింపఁబడుచున్నవి. ఇట్టిగ్రంథము లిదివఱకేభాషయందును నెవరును రచియించియుండ లేదు. వీనియందున్న సూత్రములను దెలుపు విషయములెన్నియో గలవు. సంస్కృతభాషతోఁ జక్కఁగా మాటలాడుటకుఁ గాని, వ్యాసములు రచియించుటకుఁ గాని, భాషాంతరీకరణము చేయుటకుఁ గాని వ్యాఖ్యానాదులు లేకయే స్వశక్తితో శ్లోకార్థమును జెప్పఁగలుగుటకుఁ గాని యిట్టి గ్రంథములు లేవనియే ప్రథమముగాఁ జెప్పఁగలము. శీఘ్రకాలములోనే వెలువడును. విషయములన్నియుఁ దేశ తెలుఁగు మాటలతోడనే యెల్లరకుఁ దెలియునట్లు తెలుపఁబడినవి. ముందుగా వ్రాసికొనినవారలకు మూల్యము తగ్గింపఁబడును.

భాగవతుల లక్ష్మీపతి శాస్త్రి,

రామచంద్రపురము

( [illegible] )